

వచ్చాయి. కథలు నచ్చడం, స్టార్ హీరోల సరసన నటించే ఛాన్స్‌లు... దాంతో తమిళంలో వరుసపెట్టి సినిమాలు చేస్తున్నాను. టాలీవుడ్ మీద ఎక్కువ దృష్టి పెట్టకపోవడానికి ఇది కూడా ఒక కారణం.

**సినిమాల విషయంలో మీ మదర్ సలహా తీసుకుంటారా?**

చాలామంది ఇదే ప్రశ్న అడుగుతుంటారు. మా మదర్ కూడా నటి కావడమే కారణం అనుకుంటాను. నా విషయంలో మాత్రం అమ్మ పెద్దగా జోక్యం చేసుకోదు. ఏ విషయాన్నీ అడగదు. ఆమె అడగకపోయినా అన్ని విషయాలూ ఆమెతో షేర్ చేసుకుంటాను. నేను విన్న కథలు, ఓకే చెప్పిన సినిమా వివరాలు అన్నీ ఆమెకు చెబుతాను. విని ఊరుకుంటుంది అంతే! ఏదైనా సలహా అడిగినా నీకు నచ్చితే చేయి. లేకపోతే లేదు అంటుంది. ఎవరి నిర్ణయాలు వారే తీసుకోవాలన్నది అమ్మ పాలసీ. అప్పుడే ఎదుగుదల అనేది ఉంటుంది అని ఎప్పుడూ చెబుతూంటుంది.

**విజయ్ పక్కన అవకాశం ఎలా వచ్చింది?**

ఇంత త్వరగా ఆయన పక్కన నటించే అవకాశం వస్తుందని ఎప్పుడూ అనుకోలేదు. ఈ సినిమాకి నన్ను అడిగినప్పుడు ఆనందంతో నోట మాట రాలేదు. తమిళంలో ఇంతకు ముందు నేను చేసిన సినిమాలు చూసి ఈ అవకాశం నాకు ఇచ్చారు.

**ధనుష్‌తో సినిమా ఎప్పుడు రాబోతోంది?**

ఆగస్టు నెలలో వస్తోంది. సినిమా బాగా వచ్చింది. నా అభిమానులకు తప్పకుండా నచ్చుతుందని నా నమ్మకం.

**మాతృభాషలో చేస్తున్న సినిమాల గురించి...**

కొన్ని కథలు విన్నాను. ఓకే మాత్రం చెప్పలేదు. తమిళ సినిమాలతో బిజీగా ఉండడం వలన వాటికి డేట్లు అడ్జస్ట్ చేయడం కుదరలేదు. ఒకవేళ నేను ఆ సినిమాలకు ఓకే చెప్పి షూటింగ్‌కి రాలేకపోతే నాతోపాటు అందరూ ఇబ్బంది పడతారు. అందుకే ఏ సినిమాకు అక్కడ ఓకే చెప్పలేదు. టాలీవుడ్‌లోనూ, మాలీవుడ్‌లోనూ ఒకేసారి సినిమాలు చేసే అవకాశం ఉంది.

# నా కారణాలు నాకున్నాయి

-కీర్తి సురేష్

**హీరోయిన్లకు ఆత్మాభిమానం ఎక్కువగా ఉంటుంది. అది కొద్దిగా ఎక్కువగానే ఉంది కీర్తి సురేష్‌కు. మిగతావారి కన్నా రెండాకులు ఎక్కువే చదివింది కూడా! తెలుగులో మంచి విజయం అందుకున్నప్పటికీ, సినిమాల విషయంలో స్పీడు పెంచలేక పోయింది. తెలుగులో వరసపెట్టి సినిమాలు చేయకపోవడానికి తన కారణాలు తనకు ఉన్నాయంటున్న కీర్తితో....**

**తెలుగులో మంచి విజయం అందుకున్నా ఎక్కువ సినిమాలు చేయకపోవడానికి కారణం?**

నేనూ శైలజ తరువాత చాలా అవకాశాలు వచ్చాయి. కొన్ని కథలు నచ్చలేదు. కథ నచ్చినా వాళ్ళు అడిగిన డేట్లు ఇవ్వలేక, కొన్ని సినిమాలు వదులుకున్నాను. తెలుగులో వరసపెట్టి సినిమాలు చేయకపోవడానికి నా కారణాలు నాకు ఉన్నాయి. అలాగని తెలుగువారి మీద అభిమానం లేదనుకుంటే పొరపాటే! త్వరలోనే ఓ మంచి తెలుగు సినిమాతో తెలుగువారి ముందుకు వస్తాను.

**తమిళంలో వరుసపెట్టి చేస్తున్నట్టున్నారు?**

అనుకోకుండా అవకాశాలు అలా




**నటి కాకపోయుంటే....**

నటి కాకపోయుంటే ఏం అవ్వాలో ఎప్పుడూ ఊహించలేదు. మా మదర్ నటి కావడంతో ఆమె ప్రభావం నా మీద కొద్దిగా ఎక్కువే! బాల నటిగా పలు సినిమాల్లో నటించాను. అయితే చదువుకి ఆటంకం కలుగుతుందని మా మదర్ నన్ను పెద్దగా ఎంకరేజ్ చేసేవారు కాదు. ప్లస్ టూ అయిపోగానే మాలీవుడ్‌లో హీరోయిన్‌గా అవకాశం వచ్చింది. మంచి బ్యానర్, మంచి కథ కావడంతో అమ్మ పచ్చజెండా ఊపింది.

అక్కడ వెంట వెంటనే రెండు మూడు సినిమాలు చేశాను. ఆ తరువాత తమిళంలో అవకాశాలు క్యూ కట్టాయి. దాదాపు మూడునాలుగు సంవత్సరాలుగా సినిమాలు చేస్తున్నాను. సినిమాలు తరువాత ఏం చేయాలి? అన్న విషయాన్ని ఎప్పుడూ ఆలోచించలేదు. ప్రారంభంలో హాబీగా ఉండేది. కానీ ఇప్పుడు మాత్రం సీరియస్‌గానే తీసుకున్నాను.

-భరత్ కుమార్

## సరదాగా

### అతి బద్ధకస్తుడు

రఘువీర్‌కి కొడుకంటే ప్రాణం. ఏదడిగినా లేదనకుండా అన్నీ సమకూర్చడంతో వాడు పరమ బద్ధకస్థుడుగా తయారయ్యాడు. ఆఖరికి ఎలా తయారయ్యాడంటే, చేత్తో అన్నం కలుపుకుని తిన డానికి కూడా బద్ధకమే! ఆ కారణంగా తిండి సరిగ్గా తినకుండా నీరసించిపోసాగాడు. రఘువీర్ వాడిని ఏమీ అనలేకపోయేవాడు. తిండి తినకుండా బక్క చిక్కిపోవడం చూడలేక వాడికో మిషన్ కొనిపె ట్టాడు. 'ఇదిగో ఈ ఎర్రమీట నొక్కితే ఇద్దరు వచ్చి నీకు భోజనం వడ్డిస్తారు. ఈ బ్లూ రంగు మీట నొక్కితే ఆయా వచ్చి ఏం కావాలన్నా చేసిపెడు తుంది' మిషన్ ఎలా పనిచేస్తుందో వివరించాడు రఘువీర్. అంతా విన్నాడు కొడుకు. తరువాత 'నాన్నా, నాకో చిన్న డౌట్!' అన్నాడు. ఏంటో చెప్ప మన్న రఘువీర్‌తో మరి ఈ మీటలన్నీ నొక్కడా నికి ఎవరు వస్తారు?' అడిగాడు అమాయకంగా.

### ఒక ప్రశ్న?

ఆ రోజు ఆదివారం. ప్రశాంత్‌కు ఏమీ తోచడం లేదు. తల్లీదండ్రీ ఇద్దరూ ఏదో ఫంక్షనుందని పొద్దునే వెళ్ళిపోయారు. కాసేపు టీవీ చూశాడు. మరికాసేపు ఆఫీసు వర్కు చూసుకున్నాడు. పదకొండయింది. సరే చేతులు కాల్చుకుందామని వంటగదిలోకి వెళ్ళాడు. టమాటాలు, గుడ్లు తీసి, ఉల్లిపాయలు తరిగి, కూరచేసి, అన్నం కుక్కర్‌లో పెట్టేశాడు. పనంతా అయింది. ఇక తీరిగ్గా ఆరగిద్దామనుకుంటుండగానే ప్రశాంత్ అక్క, ప్రణతి పిల్లలతో సహా వచ్చింది. ఏమిటే ఈ సడెన్ సర్‌ప్రైజ్! అన్నాడు. ఏం లేదురా! పిల్లలు మామయ్య దగ్గరకి వెళ్దామని గొడవ చేస్తుంటే తీసుకు వచ్చాను" అన్నది ప్రణతి.

నలుగురూ తినేసి, కబుర్లలో పడ్డారు. ఆ ముచ్చటా ఈ ముచ్చటా అయ్యాక కాసేపు క్యారమ్స్ ఆడారు. అదీ బోర్ కొట్టింది. కొత్తగా ఏదన్నా ఆటాడదాం మావయ్యా! అంటూ మొదలెట్టారు పిల్లలు. కొత్తగా ఏం చేయాలా? అని ఆలోచించి లోపలకెళ్ళి బోర్డు తెచ్చాడు ప్రశాంత్. దానిమీద గజిబిజిగా చతురస్రాలు గీయటం మొదలెట్టాడు. ఎంత గజిబిజిగా అంటే ఎవరికీ అర్థం కానంత!. గీసిన తరువాత ఊ...ఇక చెప్పండి నేనెన్ని స్క్వేర్స్ గీశానో? అని అడిగాడు. పిల్లలు తదేకంగా బోర్డువైపే చూస్తూ, లెక్కబెట్టసా గారు. మరి మీరూ లెక్కబెట్టండి ఈ ఫోటో చూసి, ప్రశాంత్ ఎన్ని చతురస్రాలు గీశాడో?

**సమాధానం**

మధ్యలో 6 చతురస్రాలు, చుట్టూతా 12... మొత్తం 18 చతురస్రాలు ఉన్నాయి. లెక్క సరిపో యిందేమో చూడండి.

# అడపా దడపా నవ్వబ్బా

Jayadev















72

## ఒక శృంగార దేవత పతనం!

**ఆమె నవ్వు, నడక, వయ్యారం, ఒంపుసొంపులు పురుష ప్రపంచాన్ని వెర్రెక్కించేవి. విపరీతమైన స్వేచ్ఛతో ప్రవర్తించేది. కోరికష్టాలు తెచ్చుకునేది. నిప్పుతో చెలగాటమాడేది. ఆమె ఎవరో కాదు మార్లిన్‌మన్రో. చనిపోయి 54 యేళ్ళు గడిచినా ఆ శృంగార రసాధిదేవత జ్ఞాపకాలు మనల్ని వీడలేదు.**

**8**

### స్నేహమేరా జీవితం..

అమ్మ తర్వాత అంతటి ఆత్మీయతను ధ్వనింపజేసే పదం స్నేహం. నిర్వచనానికి అందని అద్భుతమైన భావన. ఆగస్టు మొదటి ఆదివారం ఫ్రెండ్‌షిప్ డే సందర్భంగా ఒక వీక్షణం...

**30**

### సినీ నారాయణీయం

రెండువందలకు పైగా తాగుబోతు పాత్రలు చేశారు ఎమ్మెస్ నారాయణ. ఆ పాత్రల్లో ఆయనకు నంది అవార్డులు కూడా వచ్చాయి. కానీ దేన్ని ఆయన సిసలైన అవార్డుగా భావించేవారు?

# సీరియల్స్



# కథలు



# ఫీచర్స్



**ముఖచిత్రం:** సమంత

ఫొటో: గోపీకృష్ణ


*రచనలు, కథలు పంపవలసిన చిరునామా*

**నవ్య వీక్లీ,** ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### నిర్వచనాలు

**స్కూలు:** తల్లిదండ్రులు డబ్బులు చెల్లించి మరీ పిల్లల్ని ఆడించే చోటు.

**లైఫ్ ఇన్స్యూరెన్స్:** బతికినంతకాలం పేదరికాన్ని అంటగట్టి, చచ్చేటప్పుడు డబ్బుగల మారాజుని చెప్పే గొప్ప కాంట్రాక్ట్.

**నర్సు:** పడుకున్నవాణ్ణి లేపి మరీ నిద్రమాత్రలు మింగించే గొప్ప సేవకురాలు.

**తండ్రి:** భగవంతుడు ఇచ్చిన బ్యాంకర్

**బాస్:** మనం ఆలస్యంగా వస్తే త్వరగా వచ్చేవాడు. మనం త్వరగా వస్తే ఆలస్యంగా వచ్చేవాడు.

### వెర్రిపప్ప

ఓ అందమైన అమ్మాయి తండ్రిసహా నడుస్తోంది. దారిలో బోయ్‌ఫ్రెండ్ కనిపించాడు. తండ్రికి అర్థం కాకూడదన్న రీతిలో బోయ్‌ఫ్రెండ్‌కి అర్థం అయ్యే రీతిలో ఆమె మాట్లాడిందిలా.

"మొన్న నువ్వు ఇచ్చిన యర్రంశెట్టి శాయి నవల 'మా నాన్నగారు ఇంట్లో ఉన్నారు' అడగడానికి వస్తున్నావా?"

"లేదు. 'నీకోసం నేనెక్కడ ఉండాలి?' కొమ్మనాపల్లి గణపతిరావు నవల కావాలి? అది నీ దగ్గర ఉందా?" అడిగాడు బోయ్‌ఫ్రెండ్.

"అది నా దగ్గర లేదుగాని ఇంకో పుస్తకం ఉంది. మాదిరెడ్డి సులోచనారాణి నవల 'అదిగో! అక్కడ ఆ చెట్టుకింద...' కావాలా?" అడిగింది అమ్మాయి.

"సరే! దాంతో పాటు కొమ్మూరి సాంబశివరావు డిటెక్టివ్ నవల 'అయిదు నిముషాలే ఉంటాను' కూడా తీసుకుని రా."

"తప్పకుండా తీసుకొస్తాను. కావాలంటే విశ్వప్రసాద్ డిటెక్టివ్ నవల 'రెండు నిముషాలు చాలు' కూడా తెస్తాను."

అమ్మాయి-అబ్బాయి మాటలు విన్న తండ్రి కల్పించుకున్నాడిలా.

"అబ్బాయి అన్ని పుస్తకాలు ఒకేసారి చదువుతాడంటావా?"

"చదువుతాడు డాడీ! స్పీడ్ రీడర్." అంది అమ్మాయి.

"అయితే నా సొరుగులో ఓ మంచి పుస్తకం ఉంది.

'నన్ను తక్కువ అంచనా వెయ్యకు! నేనేం వెర్రి పప్పను కాను.' అని. వైనతేయ రాశాడు. అది కూడా అబ్బాయికి ఇవ్వు, చదువుకుంటాడు." అన్నాడు తండ్రి.

-వైనతేయ

www.navyaweekly.com

నవ్య

సంపుటి: 13 సంచిక: 23

10-8-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎస్.జగన్నాథశర్మ



## మొదటి పేజీ

# అల్లం టీ

ఇప్పుడు కాంతానికి అరవై ఏళ్ళు. అరవై ఏళ్ళయినా నలభై ఏళ్ళ దానిలా ఉంటుందామె. అందంగా ఉంటుంది. ఇప్పుడే ఇలా ఉంటే నలభై ఏళ్ళ వయసులో కాంతం ఎలా ఉండేదో చెప్పనక్కరలేదు. పేరుకి తగ్గట్టు అప్పట్లో మరీ అందంగా ఉండేదామె. అందరినీ ఆకర్షిస్తూ ఉండేది. మొగుడు, కొడుకు, ఆమె...ముగ్గురూ ముచ్చటగా ఉండేవారు. మొగుడు ఆటో నడిపేవాడు. అయిదోతరగతి చదివేవాడు కొడుకు. కాపురం హాయి హాయిగా ఉంది. బాగుంది అనుకునేంతలో రోడ్డు ప్రమాదంలో మొగుడు పోయాడు. దాంతో కొడుకు చదువు, పెంపకం అంతా కాంతం మీదే పడింది. ఏం చేసి చదివించాలి వాణ్ణి? ఏం పెట్టి పెంచాలంటూ బాగా ఆలోచించింది. అల్లం టీ తట్టిందప్పుడు. ఆటో నడిపి నడిపి, అలసిపోయి ఇంటికి వచ్చిన మొగుడికి అల్లం టీ వేడివేడిగా ఇచ్చేది కాంతం. తాగి అదుర్స్ అనేవాడతను. అల్లం టీ కాదిది, అమృతం అనేవాడు. ఇప్పుడు ఆ అమృతాన్నే అమ్మి, బతుకుబండి నడపాలనుకున్నది కాంతం.

కిలోమీటరు దూరంలో గవర్నమెంట్ ఆఫీసు ఉంది. అందులో వెయ్యిమందికి పైగా ఉద్యోగులు ఉన్నారు. వాళ్ళకి క్యాంటీన్ ఉంది. టీ, కాఫీ...అన్నీ దొరుకుతాయక్కడ. అయినా తన అల్లం టీ అంటే పడి చచ్చేలా వారికి అలవాటు చేసింది కాంతం. మూసిన ఆఫీసు వెనుకగేటు దగ్గర చిన్న పొయ్యి పెట్టుకుని, అల్లం టీ అమ్మసాగిందామె. చుట్ట బీడి సిగరెట్ కూడా అమ్మజూపింది. కటకటాల్లోంచి వేడి వేడి టీ అందిస్తోంటే...టీనీ, కాంతం అందాన్నీ చప్పరిస్తూ తాగడం, ఉద్యోగులకు ఉత్సాహంగా ఉండేది. ఉదయం పది నుంచి సాయంత్రం ఆరు వరకూ కాంతానికి క్షణం తీరిక ఉండేది కాదు. అల్లం టీ తయారీలో తలమునకలై ఉండేది. అన్నం కూడా తినడానికి సమయం ఉండేది కాదు. మధ్యాహ్నం నాలుగుగంటలకి స్కూలు నుంచి వచ్చి తల్లికి సాయ పడేవాడు కొడుకు. అప్పుడు కొంచెం తెరిపిన పడేదామె.

అల్లం టీ అచ్చొచ్చింది. కాంతం బంగారం కొన్నది. బస్తీలో ఇల్లు కొన్నది. కొడుకుని ఇంజనీర్‌ని చేసింది. వాడిప్పుడు ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నాడు. బ్యాంకు ఉద్యోగం. పెద్ద స్థాయిలో ఉన్నాడు. పడినన్నాళ్ళు కష్టపడ్డావు. ఇక చాలు! పద! ఢిల్లీకి పోదాం అని కొడుకు అంటే...మర్నాడు ప్రయాణం అనగా...ముందు రోజు ఆఖరుగా అందరికీ అల్లం టీ ఇచ్చేందుకు ఆఫీసుగేటు దగ్గరకు చేరుకుంది కాంతం. పేరుపేరునా ఉద్యోగులను పిలిచి పలకరిస్తూ టీ ఇవ్వసాగింది. డబ్బులిస్తే వద్దయ్యా అన్నది. ఇవాళ ఫ్రీనా? అడిగారంతా. అవునయ్యా! ఇవాళ మీ అందరికీ తాగినంత టీ ఫ్రీ అని నవ్వింది. అలవాటు ఉన్న వారికి సిగరెట్ కూడా ఫ్రీగానే ఇవ్వసాగింది. సెక్షన్‌హెడ్ కుమార్‌బాబుని పిలిచి, అతని చేతిలో వెయ్యి రూపాయలు ఉంచింది. ఏంటిది? నాకెందుకు డబ్బులిస్తున్నావని అతనడిగితే...గుర్తు తెచ్చుకోవయ్యా! పదేళ్ళ క్రితం వద్దు వద్దన్నా నా చేతిలో వెయ్యి రూపాయలు ఉంచావు. నా నుంచి ఏదో ఆశించావు. నేను అలాంటి దాన్ని కాదయ్యా అని అప్పుడే చెబుదామనుకున్నాను, చెబితే నువ్వు వినిపించుకునే స్థితిలో లేవు. సర్లే! దేనికైనా టైం వస్తుంది అనుకున్నాను. టైం వచ్చిందిప్పుడు. నీ డబ్బు నీకు ఇచ్చేస్తున్నాను అన్నది కాంతం. ఎల్‌డీసి సుబ్బారావుని కేకేసింది. అతని చేతిలో ఉంగరాన్ని ఉంచింది. ఈ ఉంగరం నాదే! నేనిచ్చిందే అన్నాడతను. అవునయ్యా! నువ్విచ్చిందే! పుచ్చుకున్న పాపానికి ఇన్నాళ్ళూ జాగ్రత్త చేశాను. తీసుకో అంది కాంతం. మొగుడు లేనిదని, బంగారానికీ, ఉంగరానికీ లొంగిపోతుందనుకున్నావు. తప్పుకదూ? అంది. ఆఫీస్‌బాయ్ అరుణాచలాన్ని దగ్గరగా రమ్మంది. వచ్చాడతను. మా ఆఫీసరుబాబు ఇచ్చాడంటూ ఆరోజు నువ్విచ్చిన చీరయ్యా ఇది! తీసుకో! ఆఫీసరుబాబిచ్చాడో, నువ్వే ఇచ్చి ఆయనగారి పేరు చెప్పావోకాని అక్కలాంటిదాన్నయ్యా! నన్ను అలా చూడకూడదు అంది కాంతం. ఎవరెవరు ఏమేమిచ్చిందీ వారందరికీ అందజేసి, చేతులు జోడించి నమస్కరించింది. ఒకరోజూ రెండ్రోజులు కాదు, ఇరవై ఏళ్ళపాటు ఆదుకున్న మీ అందరికీ మళ్ళీ మళ్ళీ నమస్కారాలంటూ కన్నీరుపెట్టుకుంది. వెళ్ళొస్తానంటూ వెళ్ళిపోయింది. రేపటి నుంచి కాంతం కనిపించదు. అల్లం టీ దొరకదు. ఎలా మరి? గుబులు పడి, దిగులు చెందారు ఉద్యోగులు. అయితే ఏం మాయ చేసిందో కాంతం! గేటు దగ్గరకు వస్తే చాలు! ఇరవై ఏళ్ళుగా అలవాటైన అల్లం టీ వాసన అందరినీ మత్తెక్కిస్తోంది. గేటుకు పట్టిన వాసన ఘుమఘుమలాడుతోంది. అది చాలనుకున్నారు ఉద్యోగులు.



నవ్య




## పర్యావరణానికి ఎలక్ట్రిక్ క్యాబ్

**కా**లుష్యం పెరిగిపోతోంది, చెట్లు కనుమరుగైపోతున్నాయి, కొత్తకొత్త వ్యాధులు పుట్టుకొస్తున్నాయి అని ఉపన్యాసాలు దంచేవాళ్ళేగాని ఆచరణలో పెట్టేవాళ్ళు మాత్రం ఎక్కడో ఒకరో ఇద్దరో ఉంటారు. అలాంటివారిలో సంజయ్ కృష్ణన్‌ను చెప్పుకోవచ్చు. ఎందుకంటే కాలుష్యాన్ని కొంతయినా తగ్గించాలని ఆలోచించి ఆచరణలో చేసి చూపించాడు. తన వంతుగా నగరంలో ఎలక్ట్రిక్ క్యాబ్‌లు నడిపిస్తూ సరికొత్త మార్పుకు శ్రీకారం చుట్టాడు.

బెంగళూరులో సాఫ్ట్‌వేర్, కార్పొరేట్ కంపెనీలు ఎక్కువ. ఉద్యోగుల కోసం కంపెనీలు క్యాబ్‌లే ఎక్కువ వినియోగిస్తాయి. పెట్రోలు, డీజిల్‌తో నడిచే ఈ కార్ల వల్ల కాలుష్యం పెరుగుతోంది. వాటి స్థానంలో ఎలక్ట్రానిక్ కార్లను వినియోగిస్తే పర్యావరణాన్ని కొంతయినా కాపాడినట్టే అని భావించి




లిథియం టెక్నాలజీస్ క్యాబ్ సంస్థను ప్రారంభించాడు సంజయ్ కృష్ణన్. తొమ్మిదినెలల క్రితం పది ఎలక్ట్రానిక్ క్యాబ్‌లతో సంస్థను ప్రారంభించాడు గానీ, అందరికీ అలవాటు చేయడం అంత సులభం కాలేదు. దాంతో సంజయ్ బాగా ఆలోచించి కార్పొరేట్ సంస్థలపైనే ప్రధానంగా దృష్టిపెట్టాడు. కార్పొరేట్ సంస్థల చుట్టూ తిరుగుతూ ఎలక్ట్రిక్ కార్ల వినియోగంవల్ల కలిగే ప్రయోజనాలను తెలియజేశాడు. మెల్లిగా వాళ్ళు సంజయ్ అభిప్రాయంతో ఏకీభవించడం మొదలెట్టారు. అలా చాలా సంస్థలు ఇప్పుడు లిథియం టెక్నాలజీస్ క్యాబ్ సర్వీస్‌తో ఒప్పందం కుదుర్చుకున్నాయి.

ప్రస్తుతం సంజయ్ క్యాబ్‌ల సంఖ్యను పది నుంచి 200కి పెంచాడు. రోజుకు 200 - 300 కిలోమీటర్లు ప్రయాణిస్తున్నాయట. ఎలక్ట్రిక్ కార్లు నడిచేందుకు ముఖ్యంగా కావాల్సింది చార్జింగ్. అందుకే నగరంలోని పలుచోట్ల 200 హైస్పీడ్ చార్జింగ్ స్టేషన్లు కూడా ఏర్పాటు చేశారు. గంటసేపు ఛార్జింగ్ చేస్తే బ్యాటరీ ఫుల్ అవుతుంది. ఇప్పటివరకు కేవలం కార్పొరేట్ ఉద్యోగులకు మాత్రమే అందుబాటులో ఉన్న ఈ క్యాబ్ సేవలను త్వరలో సాధారణ ప్రజలకూ అందుబాటులోకి తీసుకురానున్నారట. దేశంలోని ఇతర నగరాల్లోనూ తమ సర్వీసులు ప్రారంభించే యోచన చేస్తున్నట్లు చెబుతున్నాడు సంజయ్. ఇలా చంద్రునికో నూలుపోగులా పర్యావరణ పరిరక్షణ ఉద్యమంలో ఆచరణాత్మకమైన పాత్ర పోషిస్తున్న సంజయ్‌కు హ్యాట్సాఫ్!

# మెయిల్ బాక్స్

## నవ్వించిన మార్నింగ్ కాఫీ కథ

శ్రీరాముడు, సీత 14 సంవత్సరాలు అరణ్యవాసం చేయడం, రావణుడు సీతను అపహరించడం వెనుక కారణం నాణ్యత, క్వాలిటీ లోపించిన రథచక్రమేననీ మార్నింగ్ కాఫీలో కథ చెప్పి నవ్వించి మార్నింగ్ కాఫీ రుచి చూపించారు. శోధనకు అంతుబట్టని రహస్యాలతో పాఠకులను ఆశ్చర్యపరిచారు.

*-సరికొండ శ్రీనివాసరాజు, వనస్థలిపురం, హైదరాబాద్*

## రథచక్రం కథలో ఊహించని స్పార్క్

ఊహించని స్పార్క్‌తో మార్నింగ్ కాఫీ ఆకట్టుకుంది. క్వాలిటీ, నాణ్యత గురించి రామాయణంలో చెప్పిన రథచక్రం కథ ఆకట్టుకుంది. 8,9 పేజీల్లో వ్యాసం వృద్ధులకు వరప్రసాదంలా రూపుదిద్దుకుంది.

*-నేమానసుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం*

## సురభి కబుర్లు సూపర్బ్

సురభి కబుర్లు సూపర్బ్. సముద్రంలో శివాలయం, నీటిపై అద్భుత కళాఖండాలు ఆశ్చర్యపరిచాయి. గణేష్ శ్రమదానం ఎందరికో మేలు కొలుపు. డెంటిస్టులను బోల్తాకొట్టించిన పిసినారిరోగి, తాజ్‌లేక్ ప్యాలెస్, హోటల్ సదుపాయాలు విడ్డూరంగా అనిపించాయి. ఎమ్మెస్ చిల్లర కబుర్లు రక్తికట్టిస్తున్నాయి. మధుబాబు వెట్టి ఆరంభమే అదిరింది. ఇవన్నీ నిజాలే ఆశ్చర్యం గొలిపాయి.

*-తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం-11*

## వెట్టి ఆకట్టుకుంది

నిత్యామీనన్ ముఖచిత్రంతో వెలువడిన నవ్య వీక్లీ చాలా బాగుంది. మధుబాబు సీరియల్ వెట్టి ప్రారంభంలోనే ఆకట్టుకుంది. ఈ వారం కామేశ్వరి గారి శృంగార కథ బాగుంది. తెలుగు కవితలు చక్కని ప్రచురిస్తున్నందుకు థాంక్స్.

*-ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం*

## రామాయణం లైవ్‌లో చూసినట్టుంది

అలనాడు ధృతరాష్ట్రునికి యుద్ధవిశేషాలు ప్రత్యక్ష ప్రసారంలా సంజయుడు చెప్పాడు. ఈనాడు నవ్య వీక్లీ రామాయణంలో రామ రావణ యుద్ధవిశేషాలను అరణిగారు లైవ్ టెలి




కాస్ట్‌లో చూపిస్తున్నారు. వెట్టి సీరియల్ ఆరంభమే అదిరింది. నోబెల్ కథ 'సత్యం-అసత్యం' కాశీమజిలీ కథలాగా ఆసక్తికరంగా ఉంది. ముఖచిత్రాలపట్ల మీ శ్రద్ధ అభినందనీయం.

*-శాంతిచంద్రిక, సామర్లకోట*

## గ్రాఫిక్స్‌లో చూస్తున్నట్టుంది

రామాయణంలో యుద్ధ విశేషాలను కళ్ళకు కట్టినట్టు వివరిస్తున్నారు. నిజానికి సినిమాల్లో గ్రాఫిక్స్ చూస్తున్న అనుభూతి కలిగింది. సంగీత సరస్వతి రావు బాలసరస్వతీదేవిగారి ఇంటర్వ్యూ ఆసక్తికరంగా ఉంది. ఆమె చెప్పినట్టు నేటి సినిమాల్లో అంతా ఓవర్ యాక్షనే.

*-పవన్‌పుత్ర, రామారావుపేట*

## కళ్ళకు కట్టారు

అరణి రామాయణంలో యుద్ధవిశేషాలను కళ్ళకు కట్టినట్టు చూపిస్తున్నారు. అనుచరుల మరణం, రావణుడి కోపం, శోకం బాగా చెప్పారు. లైవ్‌లో సీన్లు చూస్తున్నట్టుగా అనిపించింది. కోతిమూక చెట్లు, చేమలు పట్టుకుని రెచ్చిపోవడం, హనుమ పరాక్రమాన్ని చూసి రామలక్ష్మణులు, ఆకాశ దేవతలు పొంగిపోవడం..వంటి ఘట్టాలు బాగా చెప్పారు.

*-అక్కిరాజు శ్రీనివాసరావు, విశాఖపట్నం*



ప్రముఖ కవి, రచయిత డాక్టర్ దేవరాజు మహారాజుకు దాశరథి కృష్ణమాచార్య సాహితీ పురస్కారం బహుకరిస్తున్న దృశ్యం. చిత్రంలో డా.కె.వి.రమణాచారి, జి.నారాయణరావు, నూతిశంకరరావు, టి.ఉడయవర్లు ప్రభృతులున్నారు. హైదరాబాద్‌లోని శ్రీకృష్ణదేవరాయ తెలుగు భాషానిలయంలో జూలై 23 శనివారం, 2016న ఈ కార్యక్రమం జరిగింది.

## ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్





డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 84999 91829 / 040-4959 4959

# మోకాలు మార్పిడి సర్జరీపై అపోహలు వీడండి...!
# సర్జరీ తర్వాత సాధారణ జీవితం గడపవచ్చు

మోకాళ్ల నొప్పులతో బాధపడుతున్న వారు మోకాలు మార్పిడి శస్త్రచికిత్స చేయించుకున్న తర్వాత అందరిలాగే సాధారణ జీవితం గడపగలుగుతారు. సర్జరీ తర్వాత జీవితం ఎలా ఉంటుందో అని చాలా మందిలో ఎన్నో అపోహలు, మరెన్నో భయాలు ఉన్నాయి. మోకాలు మార్పిడి చేయించుకుంటే నెలల తరబడి విశ్రాంతి అవసరమని, విధులను నిర్వహించలేమని, ఎక్కువకాలం ఇతరులపై ఆధారపడాల్సి వస్తుందని అపోహ పడుతుంటారు. ఈ అపోహల కారణంగా ఎంత తీవ్రమైన నొప్పితో బాధపడుతున్నప్పటికీ మోకాలు మార్పిడికి కొందరు సిద్ధపడడం లేదు. కానీ అవన్నీ అపోహలు మాత్రమే. మోకాలు మార్పిడి శస్త్రచికిత్సలో 95 శాతం సక్సెస్ రేటు నమోదవుతోంది. 1 శాతం కంటే తక్కువగానే దుష్ప్రభావాలు ఉంటాయి. మోకాలు మార్పిడి చేయించుకున్న తర్వాత అందరిలాగే సాధారణ జీవితం గడపవచ్చు. అయితే ఆపరేషన్ జరిగిన తర్వాత కొన్ని రోజుల పాటు మాత్రం వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ జీవనశైలిలో మార్పులు చేసుకుంటూ సరైన జాగ్రత్తలు పాటించాలి.



## విశ్రాంతి ఎంత అవసరం...?

ఆపరేషన్ తరువాత రెండుమూడు నెలలు పడుకునే ఉండాలి అనేది అపోహ మాత్రమే. అత్యాధునిక విధానాలలో ఆపరేషన్ నిర్వహించడం ద్వారా సర్జరీ అయిన రోజునే రోగిని నడిపిస్తారు. రెండుమూడు రోజుల్లో రోగి సొంతంగా నడవగలుగుట మెట్లు ఎక్కటంతోపాటు నిత్యదినచర్యలు పాల్గొనగలుగుతాడు. మోకాలు మార్పిడి శస్త్రచికిత్స జరిగిన తర్వాత కొన్ని వారాలపాటు వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ జాగ్రత్తలు తీసుకోవాలి. ఆపరేషన్ జరిగిన ఆరువారాల తర్వాత వైద్యులను సంప్రదించి విధులకు హాజరుకావచ్చు.

## ఇంట్లో చేసుకునే పనులు:

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స అనంతరం కర్ర, వాకర్స్ సహాయం లేకుండా నడవడానికి సుమారుగా నెల రోజుల సమయం పడుతుంది. నెల రోజులవరకు వాకర్ సహాయంతో సొంతంగా ఇంట్లో చేసుకునే పనులు చేసుకోగలుగుతారు.

## వ్యాయామం చేయొచ్చా...?

మోకాలు మార్పిడి సర్జరీ రెండు నెలల తర్వాత వాకింగ్, సైక్లింగ్, స్విమ్మింగ్ వంటి వ్యాయామాలు చేయవచ్చు. మోకాలుపై అధిక ఒత్తిడిని కలిగించే వ్యాయామాలకు కొన్ని నెలలపాటు దూరంగా ఉండాలి. గోల్ఫ్, బేస్‌లైన్ టెన్నిస్ వంటి ఆటలు కూడా ఆడవచ్చు.

## ప్రయాణాలు చేయవచ్చా...?

ప్రయాణాలు శరీరాన్ని ఒత్తిడికి గురిచేస్తాయి. దూరప్రయాణాలు చేయవలసి వస్తే తప్పనిసరిగా వైద్యులను సంప్రదించాలి. సర్జరీ జరిగిన నెల నుంచి నెలన్నర తర్వాత విమాన ప్రయాణాలు చేయవచ్చు. మోకాలు మార్పిడి చేయించుకున్న వారికి కృత్రిమ కీలు అమర్చుతారు కాబట్టి ఎయిర్‌పోర్టులలో ఉండే మెటల్ డిటెక్టర్లు గుర్తిస్తాయి. కాబట్టి సర్జరీ జరిగినట్లు వైద్యులు ఇచ్చే గుర్తింపు కార్డును విధిగా వెంట తీసుకెళ్ళడం మంచిది.

## డ్రైవింగ్ చేయవచ్చా...?

ఆపరేషన్ జరిగిన నెల రోజుల లోపే కారు వంటి ఫోర్ వీలర్ నడచవచ్చు. 2-3 నెలల తరువాత ద్విచక్రవాహనం నడపాలి. వీటిలో సెల్ఫ్ స్టాటర్ ఉన్న వాహనాలను నడపడం మంచిది.

## దాంపత్య జీవితం:

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స జరిగిన కొన్ని రోజుల తర్వాత సాధారణ దాంపత్య జీవితం గడపవచ్చు.

## గుర్తుంచుకోవాల్సిన విషయాలు:

సర్జరీ జరిగి ఆసుపత్రి నుండి డిశ్చార్జ్ అయిన తర్వాత ఇంటి దగ్గర కొన్ని జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. ముఖ్యంగా ఆపరేషన్ జరిగిన ప్రాంతాన్ని శుభ్రంగా ఉంచుకోవాలి. ఆ ప్రాంతంలో వాపు వచ్చినా, ఎర్రగా మారినా, నొప్పి పెరుగుతూ ఉన్నా వెంటనే వైద్యులను సంప్రదించాలి. మందులు క్రమం తప్పకుండా వాడుతూ, వైద్యులు సూచించిన జాగ్రత్తలు పాటించాలి.

## జాగ్రత్తలు తప్పనిసరి :

మోకాలు మార్పిడి శస్త్రచికిత్స అనంతరం మనం ఎంత జాగ్రత్తగా వ్యవహరిస్తే కృత్రిమ మోకాలు అంత ఎక్కువకాలం మన్నికగా ఉంటుంది. సర్జరీ తర్వాత కొన్ని జాగ్రత్తలు పాటించడం చాలా అవసరం. ఆపరేషన్ తర్వాత మోకాలుపై ఎక్కువగా ఒత్తిడి కల్గించే ఆటలకు దూరంగా ఉండాలి. సర్జరీ చేయించుకున్న వారికి మధుమేహం, రక్తపోటు వంటి ఆరోగ్య సమస్యలు ఉంటే వాటిని అదుపులో ఉంచుకోవాలి. ఆపరేషన్ తర్వాత దంతాలకు సంబంధించిన చికిత్సగానీ, శస్త్రచికిత్సగానీ చేయించుకోవాల్సి వస్తే సర్జరీ జరిగిన విషయాన్ని వైద్యులకు తెలియజేయాలి. దాంతో ఇన్‌ఫెక్షన్ రాకుండా జాగ్రత్తలు తీసుకుంటూ వైద్యులు దంతాలకు చికిత్స అందిస్తారు.

(ఆగస్ట్ మొదటి ఆదివారం ఫ్రెండ్‌షిప్ డే సందర్భంగా)



# స్నేహమేరా జీవితం..

**అమ్మ తర్వాత అంతటి ఆత్మీయతను ధ్వనింపచేసే ఏకైక పదం స్నేహం. స్నేహం అనేది దేవుడిచ్చిన గొప్ప వరం. అమ్మా నాన్న అక్క తమ్ముడు చెల్లెలు అన్నలాంటి బంధాలను తనే సృష్టించి ఇచ్చినా స్నేహితులను మాత్రం మనల్నే ఎంచుకోమన్నాడు ఆ దేవుడు. మండుటెండలో చల్లని ఐస్‌క్రీం తింటున్న అనుభూతి నిస్తుంది స్నేహ భావన. నిర్వచనానికి అందని అద్భుతమైన ఫీలింగ్!**

ఒంటరైనా ఓటమైనా వెంటనడిచే నీడ స్నేహం. అమ్మలా ప్రేమను చూపిస్తూనే నాన్నలా అక్కున చేర్చుకుని గురువులా హితబోధ చేసేది కమ్మనైన స్నేహం. ఈ తీయనైన స్నేహంలో అప్పుడప్పుడు వచ్చే అలకలు, మనస్పర్ధల చిక్కుముళ్ళు, పొర పొచ్చాలతో మనసును మెలిపెట్టే దూరాలు..ఇలా ఎన్నో ఉండొచ్చు మరి! నిష్కల్మషమైన, నిస్వార్ధమైన మధుర స్నేహ బంధాన్ని గాఢమైన అనుబంధంగా మలుచుకోవడం ఎలా? కమ్మని స్నేహాన్ని జీవితాంతం పదిలం చేసుకోవాలంటే మన ప్రవర్తన ఎలా ఉండాలి? స్నేహితుల దినోత్సవం సందర్భంగా ఒక అవలోకనం.

## మధుర భావన

మనిషికి జన్మతః ఎన్నో బంధాలు ఏర్పడతాయి. కానీ స్నేహితులను మాత్రం మనమే సంపాదించుకోవాలి. మంచి స్నేహితుణ్ణి సంపాదించుకుని ఆ స్నేహాన్ని భద్రంగా కాపాడుకుంటే జీవితాంతం మనం సంతోషంగా ఉండగలుగుతాం. స్నేహానికి నిర్దిష్ట కొలమానాలేమీ లేవు. మన దృక్పథమే మన స్నేహితుణ్ణి ఎంచుకుంటుంది. ఆ దృక్పథాల కలయికలో జతకలిస్తే స్నేహం గట్టి పడుతుంది. అందుకే "నీ స్నేహితుడెవరో చెప్పు, నువ్వెలాంటివాడివో నే చెబుతా" అనే సామెత ఏనాడో పుట్టింది. మనలా ఆలోచించి గురువులా బోధించి తప్పు చేసినప్పుడు సరైన మార్గంలో పెట్టే వ్యక్తే నిజమైన స్నేహితుడు. మంచి స్నేహితుల మధ్య ఎటువంటి మొహమాటాలు, రహస్యాలు ఉండవు, అవసరమైనప్పుడు నిస్సంకోచంగా తమ కష్టసుఖాలు ఒకరికొకరు పంచుకుంటారు. ఒక్కోసారి కుటుంబ సభ్యులతో కూడా చెప్పుకోలేని సమస్యలను ఆత్మీయ స్నేహితులతో నిర్మొహమాటంగా చర్చించవచ్చు స్నేహం అనేది ఇద్దరు పరిచయస్థుల మధ్య మాత్రమే ఉండే బంధం కాదు. కుటుంబ సభ్యులు, బంధుమిత్రులతోపాటు ప్రతి వ్యక్తిలో ఉండాల్సిన ముఖ్యమైన భావనే స్నేహం.

## స్నేహితులు అవసరమా?

ఎందుకీ స్నేహాలు? స్నేహం లేకుండా ఉండలేమా? అంటే లేకుండా ఉండటం సాధ్యం కాదంటున్నారు మానసిక శాస్త్రవేత్తలు. కేవలం మెచ్చుకోలుకో, వెన్ను తట్టడానికో మాత్రమే కాదు మంచి భవిష్యత్తు, మెరుగైన జీవితం ఇవ్వడంలో స్నేహితులదే కీలకపాత్ర. తెలివైన ఫ్రెండ్ పక్కనుంటే వాళ్లని చూసి మనం కూడా జీవన నైపుణ్యాలను మెరుగుపర్చుకుంటాం. సర్దుకుపోయే మనస్తత్వం అలవడటానికి స్నేహమే పునాది. అంతేనా! నమ్మకం, నిజాయితీ, ప్రేమ పంచుకోవడంలాంటివన్నీ అలవడటానికి మూలకారణం స్నేహమే.

స్వచ్ఛమైన స్నేహం తరగతి గదుల్లో మొగ్గ తొడుగుతుంది. ఆటపాటల్లో ఎదిగి, మనసు విప్పి మాట్లాడుకున్నప్పుడు వికసిస్తుంది. పదిమంది ఫ్రెండ్స్ ఉంటే అందులో ఏడెనిమిది మంది టీనేజీలో ఏర్పడిన స్నేహితులేనట. మానసిక నిపుణులు అంటున్న మాటిది. ఎందుకంటే టీనేజ్‌లో ఉన్న వాళ్లలో శారీరకంగా, మానసికంగా తీవ్రమార్పులు సంభవిస్తాయి. అలాంటి సమయంలో వారు కన్నవాళ్లపై ఆధారపడడం తగ్గించి స్వతంత్రంగా ఉండటానికి ఇష్టపడతారు, వేగంగా నిర్ణయాలు తీసుకుంటూ కొత్త స్నేహితులకోసం అన్వేషిస్తారు.

## మంచి స్నేహం ముఖ్యం

మంచి స్నేహాన్ని సంపాదించుకోవడం అంత సులభం కాదు. సంపాదించుకున్న స్నేహం జీవితాన్ని సుఖమయం చేస్తుంది. లేకుంటే సర్వనాశనం చేస్తుంది. ఒక వ్యక్తి గుణగణాలను అతడు పెంచుకున్న స్నేహాన్ని బట్టే నిర్ణయించగలం. ఒకరితో స్నేహం కలుపుకుని చెలిమి పెంచుకోవాలని నిర్ణయించుకుంటే వారి జీవిత సరళి, మనోవైఖరి, వారి అలవాట్లను గురించి తెలుసుకోవడం అత్యవసరం. వారి నైజాన్ని అర్థం చేసుకుని వారి ఆలోచనలు, అనుభూతులు ఎలా ఉన్నవీ గమ



నించాలి. నిజమైన స్నేహితుల మధ్య రహస్యాలు ఉండవు. చెలిమి పెంపొందాలంటే ముందు నిన్ను నువ్వు ఉత్తమ మిత్రుడిగా రూపొందించుకోవాలి. అసలైన మిత్రులు మన స్వభావాన్ని బట్టి గుణాన్ని బట్టి ఏర్పడతారు గానీ మనం ఇచ్చేదాన్ని బట్టి ఏర్పడరు. ఒక్క ముక్కలో చెప్పాలంటే ఇద్దరు వ్యక్తుల మధ్య స్నేహం తెరిచిన పుస్తకంలా ఉండాలి.

### పొరపొచ్చాలు మామూలే

స్నేహం నిలబడాలంటే ఎన్నో సానుకూల అంశాలు కావాలి. విడిపోవడానికి మాత్రం చిన్న కారణం చాలు. ఎంత దగ్గర స్నేహితులైనా అభిప్రాయ భేదాలు సహజం. మనస్పర్థలు తలెత్తడం ఖాయం. అప్పుడే వాదన మొదలవుతుంది. నీదంటే నీదే తప్పని వాదించుకుంటారు. ఎవరూ మెట్టు దిగడానికి ఇష్టపడరు. ఎన్నో యేళ్ళ స్నేహానికి కూడా ఇలాంటివి గండి కొడతాయి. ఒకప్పుడు నువ్వే నా ప్రాణ స్నేహితుడివి అనుకున్నవాళ్ల బద్ధ శత్రువుల్లా మారతారు. అదే ఇద్దరిలో ఒకరు చొరవ చూపించి ఎదుటివాళ్ళ తరపున ఆలోచిస్తే సమస్య ఆదిలోనే పరిష్కారమవుతుంది. అందుకే పట్టువిడుపులు అవసరం. ప్రతి వ్యక్తికి వ్యక్తిగత పరిధి ఉంటుంది. ఎంత చొరవున్నా, చనువున్నా సరే అతడి వ్యక్తిగత పరిధిలోకి చొచ్చుకుపోతానంటే కుదరదు. పూర్తి సమయం నాకే కేటాయించాలని ఈర్ష్య పడితే ఆ స్నేహం నిలువదు. ఎంత దగ్గర స్నేహితులైనా గొడవలు, క్షమాపణలు సహజం.

### వరల్డ్ ఫ్రెండ్‌షిప్ డే

మన స్నేహితుణ్ణి బట్టే మన గమనం ఆధార పడుతుంది. అందుకే ఒక మంచి స్నేహితుడంటే, ఒక మంచి పుస్తకం లాంటివాడని అర్థం చేసుకోవాలి. ఒక మంచి స్నేహితుడు ఓ పెద్ద లైబ్రరీ లాంటివాడన్నారు దివంగత మాజీ రాష్ట్రపతి అబ్దుల్ కలాం. క్యాలెండర్‌లో ప్రతీ బంధానికి ఓరోజు ఉన్నట్టే స్నేహ భావనకూ కేలండర్‌లో ఓ రోజు కేటాయించారు. ప్రతి యేడాది ఆగస్టు మొదటి ఆదివారం వరల్డ్ ఫ్రెండ్‌షిప్ డే సెలబ్రేట్ చేసుకుంటారు. అయితే ఐక్యరాజ్యసమితి ప్రకారం జూలై 30వ తేదీ అధికారికంగా ఫ్రెండ్‌షిప్ డే పాటిస్తారు. అయితే భారత్ సహా ఎక్కువ దేశాలు ఆగస్ట్ మొదటి ఆదివారాన్నే ఫ్రెండ్‌షిప్ డేగా సెలబ్రేట్ చేసుకుంటున్నారు. ఈ స్నేహితుల దినోత్సవం వెనుక పెద్ద కథే ఉంది. 1935వ సంవత్సరం ఆగస్ట్ మొదటి శనివారం రోజున అమెరికా ప్రభుత్వం చేతిలో హతమైన తన స్నేహితుడిని మర్చిపోలేని మరో స్నేహితుడు ఆ తర్వాతి రోజైన ఆదివారంనాడు ఆత్మహత్య చేసుకుని చనిపోయాడు. ఈ సంఘటనతో అమెరికా ప్రభుత్వం చలించిపోయింది. ఆగస్ట్ మొదటి ఆదివారాన్ని నేషనల్ ఫ్రెండ్‌షిప్‌డేగా ప్రకటించింది. ఈ సంఘటనలో ఇమిడిఉన్న బలమైన సెంటిమెంట్ కారణంగా, అప్పటి నుండే ఆగస్టు మొదటి ఆదివారం ఫ్రెండ్‌షిప్ డేగా అన్ని దేశాలకు విస్తరించింది.

## స్నేహంపై సర్వేలు

మనుషుల్లాగానే జంతువులకూ స్నేహబంధం ఉంటుందని మరో పరిశోధనలో తేలింది. ముఖ్యంగా చింపాంజీ, బాబూన్, గుర్రాలు, పులులు, హైనా, గబ్బిలాలు, ఏనుగులు, డాల్ఫిన్లలో స్నేహబంధం ఉంటుందట. కొంత వయసు వచ్చాక స్నేహితుల సంఖ్య స్థిరంగా ఉంటుందట. జీవితంలో ఎన్నో దశలలో ఎంతో మంది స్నేహితులను ఏర్పరుచుకున్నా కొత్త స్నేహితులు వచ్చాక పాతవారిలో ఇద్దరిని దూరం చేసుకుంటారని పరిశోధనలు చెబుతున్నాయి. స్నేహితులు లేనివారికన్నా ఉన్నవారిలో 50 శాతం ఆరోగ్యం మెరుగ్గా ఉంటుందట. వారికి స్నేహితుల నుంచి లభించే సాంత్వన, భరోసా ఈ పరిస్థితికి కారణమని బ్రింగ్‌హామ్ యంగ్ యూనివర్సిటీ పరిశోధనల్లో వెల్లడైంది. అంతేకాదండోయ్, మంచి స్నేహితులున్నవారి జీవితకాలం ఎక్కువగా ఉంటుందని కూడా వారి నివేదికలో తేలింది.





### ఫ్రెండ్‌షిప్ బ్యాండ్ చరిత్ర

ఇప్పుడు ప్రతి ఒక్కరు తమ స్నేహితులకి ఫ్రెండ్‌షిప్ బ్యాండ్ కట్టడమన్నది సాధారణమై పోయింది. అయితే ఈ ఫ్రెండ్‌షిప్ బ్యాండ్లకు పెద్ద చరిత్రే ఉంది. క్రీ.పూ 481లోనే ఇవి చైనాలో రంగ ప్రవేశం చేశాయని, 13వ శతాబ్దంలో అరేబియన్లు దారంతో పలురకాలుగా ముడులు వేసి వీటిని తీర్చిదిద్దేవారని చరిత్రకారులు చెబుతుంటారు. ఒకప్పుడు సముద్రంలోకి వెళ్లే నావికులు వివిధ రకాలుగా ముడులు వేసి ఈ బ్యాండ్‌లను అల్లుతూ తమ స్నేహితులకు ఇచ్చేవారట. ఆ తర్వాతి కాలంలో ఇటలీ, ఫ్రాన్స్, బ్రిటన్, అమెరికా దేశాల్లో ఈ ఫ్రెండ్‌షిప్ బ్యాండ్‌లు జనాదరణ పొందాయి. ఇందులో కట్టే ఒక్కోరకం రంగు దారం ఒక్కో భావానికి ప్రతీకగా నిలుస్తాయట.

### ఆన్‌లైన్ స్నేహం తస్మాత్ జాగ్రత్త!

ఫేస్‌బుక్, ట్విట్టర్ వంటి సామాజిక మాధ్యమాలు వచ్చాక ఆన్‌లైన్ ఫ్రెండ్‌షిప్ ట్రెండ్ మొదలైంది. ఇందులో లింగ, మత, వర్ణ వివక్ష ఏమీ లేదు. నిజానికి ప్రత్యక్షంగా కలుసుకునే స్నేహితుల మధ్యకంటే ఆన్‌లైన్ స్నేహితుల మధ్య సంభాషణల్లోనే తమ జీవిత రహస్యాలు బహిర్గతం చేయడానికి వెనుకాడటం లేదట. ఆన్‌లైన్ ఫ్రెండ్‌షిప్‌తో మనసులో దిగులు పోగొట్టుకున్న వారి సంఖ్య 65 శాతం ఉంది. ఆన్‌లైన్ ఫ్రెండ్‌షిప్‌లో మోసపోతున్న వారి సంఖ్యా 40 శాతంగా ఉంది.

- సంతోషి దహగాం

### వీటిని పాటించండి

వెలకట్టలేని స్నేహం పదికాలాల పాటు పదిలంగా ఉండాలంటే కొన్ని జాగ్రత్తలు పాటించాలి.

1. ఎదుటివాళ్ల తరపున ఆలోచించాలి. అంతే కాదు ఒక ఫ్రెండ్ గురించి మరో ఫ్రెండ్ దగ్గర కామెంట్లు చేయకూడదు. డబ్బు, కులం, అందం, చదువు ఇలాంటి వాటిని చూసేవారు నిజమైన స్నేహితులు కాదు.
2. స్నేహితుల కోసం ఏదైనా చేయడం గొప్ప కాదు. వారు చెడు దారిలో వెళుతుంటే చెడు అలవాట్లు ప్రోత్సహిస్తుంటే నిర్మొహమాటంగా నో చెప్పాలి. తప్పులు చేయని వారు ఉండరు. కాబట్టి స్నేహితులు చేసే చిన్న చిన్న తప్పులు క్షమించాలి.
3. ఎంత దగ్గరి వాళ్లయినా సరే అతిగా వ్యక్తిగత సమాచారం పంచుకోవద్దు. లోకువవుతాం. తేడాలొస్తే భవిష్యత్తులో బ్లాక్‌మెయిలింగ్‌కు పాల్పడవచ్చు.
4. ప్రతి ఫ్రెండ్‌కి ఇష్టాలు, భావోద్వేగాలు, అభిరుచులు ఉంటాయి. వాటిని గుర్తించాలి. గౌరవించాలి. వారికి ఉండాల్సిన ప్రాధాన్యాలు వారికుంటాయి. మనమే సర్వం కాదు కదా, అన్నివేళలా మనతో ఉండాలంటే కుదరదు.
5. ఏదైనా సరే ఫ్రెండ్ దగ్గర నుంచి అతిగా ఏదీ ఆశించవద్దు. తీరా స్పందించకపోతే ఆశాభంగం కలుగుతుంది. అది గొడవలకు దారితీస్తుంది.

# మరింత జీవనం

## వి.రాజారామమోహనరావు

**ఆ పెళ్ళి ఊళ్ళోనే జరగాలని పెద్దాయన మంచి పట్టుమీద ఉన్నాడు. బంధువర్గం అందరిలో అదే చర్చ. ముప్ఫై ఏళ్ళ క్రితం అది రెండు వందల గడపల ఊరు. ఇప్పుడు రెట్టింపై ఉండొచ్చు. అయినా, ఆ ఊరికి అధునాతన సౌకర్యాలన్నీ ఏర్పడలేదు. ఏ గట్టి అవసరం వచ్చినా, నలభై కిలోమీటర్ల దూరంలో ఉన్న ఏలూరు మీదే ఆధారం.**



అయినా, ఆ ఊళ్ళోనే అంటే పాతూరులోనే పెళ్ళి జరగాలంటున్నాడు పెద్దాయన. ఆయన ఎనభై అయిదేళ్ళ జీవితంలో అంతగట్టిగా ఏ విషయం మీదా పట్టుపట్టలేదు. ఆయన్ని కాదనటానికి ఎవరికీ మనసు రావటం లేదు. పాతూరులోనే పెళ్ళంటే... వెళ్ళటం, అక్కడ ఉండటం, తిరిగి రావటం కూడా శ్రమే. అయినా తప్పేలా లేదు. అంతగా అయితే ఏలూరులో హోటల్ రూములు తీసుకుని అక్కణ్ణించి రోజూ పాతూరు వెళ్ళి రావటం చెయ్యాలి. పాతూరులో చాలాచోట్ల సెల్‌ఫోన్ సిగ్నల్ కూడా సరిగా అందదు.

మేనకోడలి పెళ్ళి. తప్పకుండా వెళ్ళాలి. వెళ్ళటమే కాదు, అన్ని కార్యక్రమాలు పూర్తి అయ్యేవరకూ ఉండాలి. ఎలా, ఏరకంగా ఏర్పాట్లు చేసుకోవాలా అన్న ఆలోచనలో ఉన్నాడు సుధాకర్. ఆ ఆలోచన తేలకముందే పెద్దాయన దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.

పెళ్ళి పాతూరులో అంటే అంత సౌకర్యంగా ఉండదని మీరందరూ జంజాటనలో ఉంటారని నాకు తెలుసు. అంత అసౌకర్యం ఏమీ ఉండదు. అందుకని, అందరూ తిన్నగా పాతూరుకే రండి. ఎక్కడా హోటళ్ళు అవి తీసుకోవద్దు. మీకిక్కడ సౌకర్యంగా లేనప్పుడు ఆ ఆలోచన. అందరికీ ఇలాగే తెలియచేస్తున్నాను. గమనించవలెను.

తాతయ్య రామబ్రహ్మం గారి గురించి సుధాకర్‌కి బాగా తెలుసు. బంధువర్గంలోనే కాదు, పాతూరు మొత్తంలో ఆయనకి మంచి పేరుంది. ఏదైనా ప్రత్యేకంగా చెప్పాల్సి వస్తే, ఇలా సున్నితంగానే చెపుతారు. 'గమనించవలెను' అంటే, అలాగే చెయ్యమని, వేరే ఆలోచనేం వద్దని. దీనితో ప్రయాణం తిన్నగా పాతూరుకే అని నిర్ణయం అయిపోయింది.

పెళ్ళంటే, ఈ రోజుల్లో ఓ భారమైన పనైపోయింది. చేసేవాళ్ళకి, చేసుకునేవాళ్ళకి, వచ్చి చూసేవాళ్ళకి... అందరికీ ఓ తప్పనిసరి బాధ్యత అయింది. అందులో పాతూరులాంటి చోట పెళ్ళంటే, అందరికీ ఇబ్బందే అన్న నిర్ణయానికి వచ్చాడు సుధాకర్.

పెళ్ళికి బయలుదేరాక కూడా అంత ఉత్సాహంగా లేదు. సుధాకర్, అతని కుటుంబం రాత్రంతా ప్రయాణం చేసి, తెలతెలవారుతుండగా పాతూరు చేరారు.

కాలవ గట్టమ్మట ప్రయాణం సాగుతుంటే చిత్రంగా ఉంది సుధాకర్‌కి. అతనా ఊరికి వచ్చి నాలుగేళ్ళు దాటింది.

కాలువ ఇదివరకంత నిండుగా లేదు. గట్ల మీద చెట్లు కూడా అంత దట్టంగా లేవు. చల్లదనం కూడా అంతగా లేదు. కొన్ని ఇళ్ళు, వీధులు స్వల్పంగా మారాయి. తెలిసున్న వాళ్ళెవరూ కనపడలేదు.

వీళ్ళు ఇల్లు చేరేటప్పటికి, రామబ్రహ్మం గారు వీధి అరుగు మీదే ఉన్నారు.

"రండి.. రండి... ప్రయాణం బాగా జరిగిందా?" అని పలుకరించారు నిండుగా నవ్వుతూ...

# నవ్యవీక్లి- నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కథ

అరగంటసేపు గలగలా కబుర్లు సాగాయి. కాఫీ, టిఫిన్లు అయ్యాయి. ఓ గంటసేపు హడావిడిలో, అదోలా అనిపించినా, ఆ తర్వాత నెమ్మదిగా స్థిమితపడ్డారు సుధాకర్ వాళ్ళు.

తమ ఇంటి చుట్టుపక్కల ఇళ్ళు పెరిగాయి. చాలా ఇళ్ళు మార్చి విశాలంగా కట్టుకున్నారు. చాలామంది ఇళ్ళల్లో గదులు అడిగి తీసుకున్నాడు పెద్దాయన. అన్ని ఇళ్ళు చుట్టుపక్కలే ఉండటం వల్ల, ఎవరు ఎప్పుడు కావాలంటే అప్పుడువెళ్ళి, తమకి కావలసినట్టు గడపగలుగు తున్నారు. ఏలూరులో హోటల్‌లో ఉండి, అటూ ఇటూ తిరగటం కన్నా ఇదే ఎంతో బావుందనిపించింది.

"నా మునిమనవరాలి పెళ్ళి... ఈ ఇంట్లో మరో శుభకార్యం వరకూ గుర్తుకు ఉండాలి. అయిదు రోజుల పెళ్ళి చేస్తాను" అని ముందే అందరికీ తెలియజేశారు రామబ్రహ్మంగారు.

అన్ని రోజులు పాతూరులో ఎలా ఉండాలా? అనుకున్న అందరికీ, ఆ సాయంత్రానికే 'ఫరవాలేదు... ఉండగలం' అనిపించింది.

సాయంత్రం టిఫిన్లు అయ్యాయి. రాత్రి తొమ్మిదింటికల్లా ఇంచుమించు అందరి భోజనాలు పూర్తయ్యాయి.

ఇంటిముందు పెద్ద తాటాకుల పందిరి. పందిరి గుంజలకి పచ్చగా కొబ్బరాకులు. పందిరి మూలల్లో అరటిచెట్లు. పందిరంతా మావిడాకుల తోరణాలు. ఆ పందిరి కింద కూచోటమే ఓ హాయైన అనుభవంలా ఉంది. అన్నింటికన్నా ఆశ్చర్యంగా, రాత్రికి హరికథా కాలక్షేపం ఏర్పాటుచేశారు రామబ్రహ్మంగారు.

సుధాకర్‌కి తన చిన్నతనమంతా ఒక్కసారిగా గుర్తొచ్చింది. శ్రీరామనవమి పందిళ్ళలో హరికథలు వినటం, నాటకాలు చూడటం. ఇప్పుడు తిరిగి హరికథ వింటుంటే, ఆనాటి ముచ్చట్లు ఓ వాహినిలా కదులుతున్నాయి.

సాఫీగా నడిచిన రోజులు, స్నేహితులతో గంటలు గంటలు కబుర్లు, సినిమాహాళ్ళ ముందు షికార్లు.. అన్నీ లలితంగా, మృదువుగా జీవితాన్ని నడిపిన అనుభవాలు. ఎందులోనూ ఏ మాత్రం మొరటుతనం లేని సరదాలు. అమ్మాయి, అబ్బాయి ఒకరివేపు మరొకరు ఇష్టంగా చూసుకోటంలోనే గొప్ప ప్రేమ.

ఇప్పటిలా, అప్పుడు మనసులో తొందర, తొడతొక్కిడ లేదు. అన్నింటిమీద అనుమానం, అసంతృప్తి లేదు. ఇన్నిరకాల భయాలు, సందేహాలు లేవు. నిండైన కాలవలా, చక్కటి సెలయేరులా అదో రకం స్వచ్ఛత, నిండుతనం ఉండేవి.

ఒకరకం మత్తు ఆవరించి, మైమరపు కలిగినట్టు, చేష్టలుడిగిన వాడిలా, చిన్నపిల్లాడిలా.. ఆ హరికథలో లీనమై పోయాడు సుధాకర్. ఆ రాత్రి భార్యతో చాలాసేపు కబుర్లు చెప్పాడు. పక్కనే ఉన్న పిల్లలవేపు ఎంతో ప్రేమగా చూశాడు. తాను వేరే మనిషిలా పరివర్తన చెందినట్టు, మనసు, శరీరం సర్వం ఎంతో తేలికైనట్టు అనిపించింది. పొద్దున్నే పువ్వులా నిద్రలేచాడు.

నిద్ర లేచిం దగ్గర్నించీ, ఊరుని, తన చుట్టూ ఉన్నవాళ్ళనీ అసహనం లేకుండా చూట్టం, తనకి తెలియకుండానే చేస్తూ వచ్చాడు. అన్నీ బావున్నట్టే ఉన్నాయి. ఏదీ అసౌకర్యంగా, అసంతృప్తిగా లేదు. చిత్రంగా ఏదీ విసుగ్గా లేదు.

మొదటిరోజు కన్నా, రెండోరోజు మరింత బాగా గడిచింది. బంధువులు, పాతస్నేహితులతో కలిసి పిచ్చాపాటి కబుర్లాడుతుంటే, అది గొప్ప సంతోషంలా ఉంది. ఊరంతా తిరిగి వచ్చాడు. కొన్ని మార్పులు జరిగినా, మౌలికంగా ఊరు తీరు అదే.

అయిదురోజుల పెళ్ళి అందరికీ ఆశ్చర్యంగా ఉంది. ప్రతిరోజూ ఒక్కోరకం కార్యక్రమం. అసలు

**ఏసీలకు, రెస్టారెంట్లకు మనం అలవాటుపడిపోయాం. కృత్రిమ అభిప్రాయాలే మనల్ని శాసిస్తున్నాయి. సెల్‌ఫోన్లు, టీవీలు, లేనిపోని హోదాలు, అనవసర ఆర్భాటాలమధ్య తృప్తీ, ఆప్యాయతా ఎక్కడా కానరావడం లేదు. ఎదుగూ బొదుగూలేని, రుచీపచీలేని ఇలాంటి అసంతృప్త జీవితం కూడా ఒక జీవితమేనా? మరి జీవితాన్ని మెరుగుపర్చుకోవాలంటే ఏం చేయాలి? ఈ కథలో సుధాకర్ ఏం చేశాడు?**



# ఒక పోజిస్తే 3 కోట్లు

కోట్లకి విలువలేకుండా పోయిందని కొందరు వ్యక్తం చేస్తున్న ఆవేదన నిజమేనేమో అనిపిస్తుంది ఈ వార్త చదివిన వారెవరికైనా! ఓ క్యాలెండర్ మీద పోజిచ్చినందుకుగాను బాలీవుడ్ హీరోయిన్ సన్నీలియోన్‌కి మూడు కోట్ల రూపాయలు ముట్టాయట! దీని కోసం సన్ని కష్టపడింది కేవలం కొన్ని గంటలు మాత్రమే! పోర్న్ స్టార్‌గా సన్ని క్రేజ్‌ను దృష్టిలో పెట్టుకునే ఇంత మొత్తం చెల్లించామని ఆ కంపెనీ చెబుతోంది. ఓ కండోమ్ కంపెనీ విడుదల చేసే క్యాలెండర్ మీద సన్ని దర్శనమివ్వబోతోందట!



పెళ్ళిలో అటువంటివి జరుగుతాయని గానీ, అది సంప్రదాయం అని గానీ, వచ్చిన వాళ్ళలో చాలా మందికి తెలియదు. తీరుబడిగా, ప్రశాంతంగా ఉండటం, పాతూరులో బైట తిరిగే హడావిడి లేకపోవటంతో ఎవరూ ఎటూ వెళ్ళకుండా పెళ్ళి తతంగమంతా చూశారు. దీనికి తగ్గట్టుగానే వంటలు, పూటకో రకం ప్రత్యేకం. రకరకాల ఫలహారాలు, చిరుతిళ్ళు. పిల్లల ఆటలు... సందడి.. రకరకాల పళ్ళు, పానీయాలు.. చురుగ్గా తిరుగుతూ, గెంతుతూ అలసిపోవటం, అలసట తీరేలా తిని తాగటం.

ఎంతపెద్ద హోటల్లో పార్టీకి వెళ్ళినా, ఎంతటి ఖరీదైన రిసార్ట్‌కి పిక్నిక్‌కి వెళ్ళినా, ఇటువంటి సంతోషం ఉండదనిపించింది.

అయిదురోజుల పెళ్ళి అద్భుతంగా జరిగింది. అందరికీ అదో అపురూప అనుభవంలా గడిచాయి రోజులు. ప్రతి రాత్రి ఏదో కార్యక్రమం... నాటకమో... సంగీత కచేరీయో... అందరికీ హాయిగా ఉంది.

ఎప్పుడూ టి.వి.కి అతుక్కుపోయి, కార్టూన్ సినిమాలు చూస్తూ, ఎంతగా పిలిచినా పలకని పిల్లలు, కలివిడిగా కలిసిమెలసి ఆడుకుంటున్నారు. పిలవకపోయినా, తల్లిదండ్రుల దగ్గరకి వచ్చి కబుర్లు చెపుతున్నారు.

సుధాకర్ కొడుకు పదేళ్ళవాడు వచ్చి, తాటాకు పందిరిని చూపిస్తూ "ఇదేమిటి నాన్నా... కొత్త రకం షామియానానా?" అని అడిగాడు. సుధాకర్ కాదని చెపుతూ, ఆ పందిరి గురించి వివరాలు చెప్పాడు. పొలాలవేపు తీసుకెళ్ళి తాటిచెట్లు, కొబ్బరి, అరటి చెట్లు చూపించాడు. ప్రకృతి ఒడిలో తూనీగలా మారిపోయాడు ఆ కుర్రాడు. తండ్రి చెప్పటం, కొడుకు విని అర్థం చేసుకోవటం... అదొక అపురూప ఆత్మీయ అనుబంధం.

ఈ పెళ్ళి వల్ల పిల్లలకి, అంతకుముందు తెలియనివి చాలా తెలిశాయి. పెద్దలకి, చిన్నతనం పునరావృతం అయింది. నగర, పట్టణ గందరగోళం నుంచి వేరుగా ఉన్న ప్రశాంతత. ఒత్తిడి, పరుగు, విసుగు లేని జీవనానందం. గారెలు, బూరెలు, చిత్రాన్నాలే కాకుండా, మినపసున్ని, చిమ్మిలి, నువ్వుండలు, పోకుండలు, జున్ను, సీమ చింతకాయలు, ఈతముయ్య... ఇలాంటి పల్లెటూరి రుచులు. అటూ ఇటూ అస్తమానం తిరుగుతుండటం వల్ల అందరికీ మంచి ఆకలి పుట్టింది.

తినటం, హడావిడిగా ముగిసే అవసరంలా కాక, ఆస్వాదిస్తూ సాగించే ఓ చక్కటి కార్యక్రమం అయింది.

సుధాకర్‌కి చాలా ఆశ్చర్యంగా ఉంది. నగరంలో అలవాటైన ఎ.సి.లు, కారు ప్రయాణాలు, ఇతర సౌకర్యాలు ఉండవని, పాతూరులో ఉండటానికి పడ్డ సందేహమంతా మటుమాయమైంది. తెలియకుండా చాప కింద నీరులా, జీవితంలోని అసలైన రుచి, తృప్తి ఎంతగా లుప్తమైపోయాయో అర్థమైంది. అంతగా అవసరంలేని చాలా చాలా కృత్రిమమైన పనులు, అభిప్రాయాలు జీవితాన్ని ఎంతగా శాసిస్తున్నాయో తెలుస్తోంది. సెల్‌ఫోన్ తోటి, టీవీతోటి గడుపుతున్నంత సమయం మనుషులతో గడుపుతున్నామా? అనిపించింది.

ఊరుతో సంబంధం తగ్గిపోతుంటే, తనవాళ్ళతో సంబంధం తగ్గటమే. అంతేకాదు, అనుబంధాలతో, నిజమైన సంతోషంతో, జీవన మూలంతో సంబంధం తగ్గిపోతున్నట్టే.

పాతూరులోనే పెళ్ళి జరగాలనీ, అదీ అయిదు రోజుల పెళ్ళిగా, ఓ సంప్రదాయ, సాంస్కృతిక పునరావృతంగా పెద్దాయన జరపటంలో, అందరూ వచ్చి కలిసి అక్కడే గడపాలి అన్న యోచనలోని అంతరార్థం సుధాకర్‌కి అర్థమైంది. జీవితాన్ని, వెనక్కితిరిగి ఓసారి చూసుకోమన్న హెచ్చరిక అది.

గతంలో, ఆ రోజుల్లో పొద్దున్నే నిద్రలేచి, వరండాలోకి వస్తే ఉదయం ప్రశాంతంగా, ఉత్సాహంగా ఉండేది. అశుభ భావనలేం ఉండేవికావు. కానీ ఇప్పుడు నిద్రలేస్తూనే చికాకు. ఏదో దిగులు. అలజడి... కారణమేమిటో తెలియని, కనీసం తెలుసుకునే ప్రయత్నానికైనా పురికొల్పని అసంతృప్తి. మోయలేనంత బరువు, అదృశ్యంగా అందరి మీదా ఉన్నట్టు బరువు. అన్నిరోజులూ పాతూరులో ఎలా ఉండాలో అనుకుని వచ్చినవాళ్ళు, అప్పుడే వెళ్ళిపోవాలా అన్నట్లు తిరుగు ప్రయాణం అయ్యారు. పద్ధతిగా, ఎవరి పెట్టుబడులు, వాళ్ళకి అందేలా ఏర్పాటుచేశారు రామబ్రహ్మంగారు. తను చెయ్యాల్సిందేదో చేశాను అన్న తృప్తి ఆయన ముఖంలో నిండుగా ఉంది.

పెళ్ళంటే సంతోషం... ఓ సంగమం... హాయిగా, కలివిడిగా కష్టసుఖాలు పంచుకునే ఓ పండగ. అంతేకానీ, తప్పనిసరి క్రతువు కాదు. ఖర్చు ఎంత అన్నది కాదు.... ఎంతగా పరస్పరం కలుస్తున్నాం అన్నది ముఖ్యం.

పెళ్ళేకాదు. జీవితంలో ఏదయినా సరే.. 'ఎంత బాగా బతుకుతున్నాం' అన్నదే ముఖ్యం. ఆ కేంద్రంగానే జీవనతీరు ఉండాలి. కృత్రిమ హోదాలు, అనవసర ఆర్భాటాలు, మార్కెట్ మాయాజాలాలు, మనసులోలేని మన్ననలు.. ఇలాంటివన్నీ ఓ మాయలా కమ్మేశాయి. అన్నీ ఉన్నా ఆనందించలేని దుస్థితిలో ఉన్నాం. తలకిందులైన విలువల ప్రభావం!

తిరిగి వచ్చేటప్పుడు తాతగారిని కౌగలించుకున్నాడు సుధాకర్. జీవితం తాలుకు తృప్తిని కౌగలించుకున్నట్టు అనిపించింది. ఎనభై అయిదేళ్ళ అనుభవాన్ని, 'బతుకుని సరైన రుచితో బతకండి' అని చెప్పకనే చెప్పిన ఆప్యాయతనీ కౌగలించుకున్నట్టు అనిపించింది. ఈ అనుభవంతో, ఎంతో కొంతయినా జీవితాన్ని మెరుగుపరుచుకోవాలనిపించింది సుధాకర్‌కి, పాతూరు నుంచి తిరిగి వస్తుంటే.

*సెల్:93947 38805*






## లోకం చుట్టిన వీరుడు

హాట్ ఎయిర్ బెలూన్స్‌లో ఎగురుతూ ఎంజాయ్ చేస్తుంటారు కొందరు. కొన్నిచోట్ల ఈ పోటీలు కూడా నిర్వహిస్తారు. రకరకాల ఆకారాల్లో తయారుచేసి, వాటిలో కూర్చొని ఆకాశంలో ఎగురుతూ ఉంటే ఆ మజాయే వేరు! అలాంటి హాట్ ఎయిర్ బెలూన్‌లోనే ప్రపంచాన్ని చుట్టి వచ్చాడు ఫెదర్ కొన్యుఖొవ్. ఇందులో వింతేముంది అనుకుంటున్నారా! వయస్సురీత్యా చూస్తే వింతేమరి!

రష్యాకు చెందిన అరవై ఏళ్ళ ఫెదర్ కొన్యుఖొవ్ హాట్ ఎయిర్ బెలూన్‌లో 11 రోజుల్లో 34 వేల కిలోమీటర్ల దూరం ప్రయాణించాడు. హాట్ ఎయిర్ బెలూన్‌పై ప్రపంచాన్ని వేగంగా చుట్టి వచ్చిన వ్యక్తిగా పేరు తెచ్చుకున్నాడు. ఆస్ట్రేలియాలో జులై 12న మొదలుపెట్టి, తిరిగి అదే నెల 23న ఆస్ట్రేలియాలో దిగిపోయాడు. ఈయన గారు ప్రయాణించిన హాట్ ఎయిర్ బెలూన్ రెండు వందల అడుగుల పొడవుతో ఉంటుంది. అందులో పడుకోవడానికి ఏర్పాట్లు, ఆహారం, నీళ్ళు ఇతర ప్రత్యేక సదుపాయాలు కూడా ఏర్పాటు చేసుకున్నాడు. అంతక్రితం 2002లో స్టీవ్ ఫోసెట్ అనే అమెరికన్ 13 రోజుల్లో ఈ రికార్డు సాధించారు. ఆయన రికార్డును ఇప్పుడీ తాతయ్య బ్రేక్ చేశాడు. వయసును కూడా లెక్కచేయక రికార్డు సృష్టించిన ఫెదర్ తాతయ్య గ్రేట్ కదా!

## అగ్నిపర్వతంపై రెస్టారెంట్

ఇప్పుడు రకరకాల థీమ్ రెస్టారెంట్లు పుట్టుకొస్తున్నాయి. కొత్తదనం కోరుకునే వారికి కొత్తరుచులతో పాటు కొత్తరకం వాతావరణాన్ని కూడా సృష్టిస్తున్నారు. ఆ కోవలోదే ఈ అగ్నిపర్వతం రెస్టారెంట్ కూడా!

స్పెయిన్‌కి చెందిన లాంజరోట్ ద్వీపంలో ఎల్‌డియాబ్లో రెస్టారెంట్ ఉంది. ఈ రెస్టారెంట్‌ని అగ్నిపర్వతంపై నిర్మించారు! అదే దీని ప్రత్యేకత. పోయి పోయి ఎవరైనా నిప్పుల కొలిమిపై కూర్చుంటారా? అని ప్రశ్నించేవారికి సమాధానం కూడా సిద్ధంగా ఉందిమరి! ఈ అగ్నిపర్వతం ఇప్పట్లో పేలే అవకాశం లేదని కచ్చితంగా గణించిన తరువాతే ఇక్కడ రెస్టారెంట్ పెట్టారు.

ఈ పర్వతంపై అక్కడక్కడా చిల్లులు ఉన్నాయి. ఆ చిల్లులలోంచి ఆవిరి, వేడి బయటకు వస్తూ ఉండటంతో జులియో పాడ్రన్ అనే అతనికి ఇక్కడ రెస్టారెంట్ పెట్టి భూగర్భ ఉష్ణంతో వంటలు వండి పర్యాటకులకు అందించాలనే కోరిక పుట్టింది. ఇంకేముంది అనుమతి కోసం ప్రభుత్వానికి అప్లికేషన్ పెట్టుకున్నాడు. భూకంప పర్యవేక్షక నిపుణులు అంగీకారం చెప్పడంతో రెస్టారెంట్ మొదలైంది. అగ్నిపర్వతంమీద ఉన్న రాళ్ళతోనే రెస్టారెంట్‌నీ, వంటపొయ్యినీ నిర్మించారు. ప్రకృతి సహజ సిద్ధమైన వేడిని ఉపయోగించి వంటలు చేసి సర్వ్ చేయడం ఈ రెస్టారెంట్ మరో ప్రత్యేకత! శాస్త్రవేత్తలు పరీక్షలు జరిపాకే ఈ వంటపొయ్యి ఏర్పాటు చేశారట.

ఇప్పుడీ రెస్టారెంట్ పర్యాటకులకు ప్రత్యేక ఆకర్షణగా మారింది. రుచులు కూడా నచ్చడంతో సందర్శకుల సంఖ్య బాగా పెరిగింది. అయితే, మధ్యాహ్నం 12 - 3 సమయంలో మాత్రమే ఈ రెస్టారెంట్ పనిచేస్తుందట.

-నర్మద వాసిరెడ్డి

## రోబోతో సహవాసం!



చైనా, జపాన్ వంటి దేశాల్లో ప్రతి పనిలోనూ రోబోలు ఉపయోగించడం పరిపాటిగా మారింది. రెస్టారెంట్లకు వచ్చేవారికి కంపెనీ ఇవ్వడం, హోటళ్ళలో, సమావేశాల్లో రిసెప్షనిస్టులుగా రకరకాల అవతారాల్లో దర్శనమిస్తున్నాయి రోబోలు. విషయమేంటంటే ఓ మానవరూపంలో ఉన్న రోబోతో ఓ అమ్మాయి సహవాసం చేస్తోందట! అదీ విశేషం!

జపాన్‌కి చెందిన టొమోమీ ఓటా అనే మహిళ మానవరూపంలో ఉండే రోబోను కొనుక్కుంది. దాన్ని తనతోపాటే ప్రతిచోటకూ తీసుకెళుతోంది. ఆఫీసు, షాపింగ్, వాకింగ్...ఇలా ఈ రోబో ఆమె వెంటే ఉంటూ కుటుంబ సభ్యులలో ఒకరుగా అయిపోయిందని ఉత్సాహంగా చెబుతోంది టొమోమీ. అంతేకాదండోయ్, ఈ రోబో ఎదుటిమనిషిలోని భావాలు అర్థం చేసుకోగలదట కూడా! రోబోతో సహవాసం! భలే ఉంది కదూ!

## మనుషుల్ని మోసే సూట్‌కేసులు!

సాధారణంగా లగేజీని తీసుకెళ్ళడానికి సూట్‌కేసులను ఉపయోగిస్తారు. కానీ ఈ సూట్‌కేసు వెరీ స్పెషల్! ఎందుకంటే లగేజీతోపాటు అది మనల్ని కూడా మోసుకెళ్తుంది. మోడోబ్యాగ్‌గా పిలిచే ఈ స్కూటర్ సూట్‌కేసును షికాగోకు చెందిన వ్యాపారవేత్త కెవిన్ ఓ డెనెల్ ఓ ఇంజనీర్ సాయంతో రూపొందించాడు. దీనికి ఎలక్ట్రికల్ మోటార్ అమర్చారు. అంతేకాదు, గంటకు 13 కిలోమీటర్ల వేగంతో వెళ్ళగలదు. ఎయిర్‌పోర్టు, రైల్వేస్టేషన్లలో లగేజీతోపాటు ప్రయాణించేందుకు ఇవి ఎంతో ఉపకరిస్తాయని చెబుతున్నాడు కెవిన్. సూట్‌కేసుపై కూర్చొని హ్యాండిల్ వంటి పరికరాన్ని పైకి లేపి దీన్ని ఆపరేట్ చెయ్యాలి. నడిపేటప్పుడు కాళ్ళు పెట్టుకునేందుకు వీలుగా ఫుట్ పెడల్స్ అమర్చారు. స్మార్ట్ ఫోన్లు, ఇతర ఎలక్ట్రానిక్ డివైజ్‌లను చార్జింగ్ చేసేందుకు వీలుగా దీనిలో ప్రత్యేక పోర్టులు కూడా ఉన్నాయి. మొత్తం సూట్‌కేసులో 85 శాతం స్టోరేజీ స్పేస్‌ను సమకూర్చారు. ఇప్పటిదాకా సూట్‌కేసులను మనం మోయాల్సి వచ్చేది. కానీ ఇప్పుడు మనల్ని మోసుకెళ్ళే సూట్‌కేసులే వచ్చేశాయి. భలేఉంది కదూ!






**ఇసుకమూట మాదిరి జీపుటైర్లకు అడ్డంగా పడిపోయాడు అతను. పలుకురాళ్ళ దెబ్బలకు ముఖాలు పగిలి మూలుగుతున్న వాళ్ళలో ఎవరు పైకి లేచినా, గొడవ మళ్ళీ మొదలవుతుందని తెలుస్తూనే ఉండటం వల్ల, ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయలేదు వెట్టి.**

**టైర్లకు అడ్డంగా పడిపోయిన డ్రైవర్‌ని రోడ్డుపక్కనే ఉన్న పల్లంలోకి దొర్లించాడు. రోడ్డు మధ్యలోనే పడిపోయాడు ఒక హీరో, అతన్ని అవతలి పక్కకు ఈడ్చుకుంటూ పోయాడు.**

'నిన్ను ఆచార్లుగారి ఇంటి దగ్గర వదిలేసి నేను ఈ చుట్టుపట్ల ఎక్కడా కనిపించకుండా మాయం అయిపోవాలి. వాళ్ళకి తెలివివచ్చిన వెంటనే ఫోన్లు చేసి ఇంకో పదిమందిని తోడు పిలుచుకుంటారు. అందరూ కలిసి నా చెమడాలు ఎక్కదీసి వెంట బెట్టుకుపోతారు. నిన్ను క్షేమంగా ఊళ్ళోకి చేర్చడం ఎంత ముఖ్యమో, నేను దూరంగా పారిపోవటం అంతే అవసరం' అంటూ జీప్ వైపు తిరిగాడు.

నిద్రలో లేచి నిలబడినట్లు నిస్తేజంగా నిలబడి ఉన్న ఆ అమ్మిని జీప్ ఎక్కించి, తను స్టీరింగ్ తీసుకోవాలని అతని అలోచన.

'పద తల్లీ. జీప్ ఎక్కి కూర్చో' అంటూ ముందుకు కదిలాడు.

ఎక్కి కూర్చున్నదా అమ్మి. ఎక్కడ?

స్టీరింగ్ దగ్గర!

'అమ్మ నా తల్లో! అక్కడ కాదు. అవతల... అవతల సీట్లో తల్లీ! ముందు నువ్వు వెంటనే అవతలికి జరుగు' ఆందోళన నిండిన కంఠంతో ఆమెను హెచ్చరిస్తూ, వేగంగా జీప్ దగ్గరికి వచ్చాడు.

నిస్తేజంగా కనిపించిన ఆ అమ్మి ముఖం ఉన్నట్టుండి నవ్వుల మయమైపోయింది. 'జీప్ నడిపి చాలాకాలం అయిపోయింది. అలవాటు తప్పిపోయినట్టు అనిపిస్తోంది' అంటూ చిటుక్కున స్టార్ట్ చేసింది.

అంతటితో ఆగిపోకుండా చకచకా గేర్లు మార్చింది.

'తల్లీ...ఆగు... ఆగు తల్లీ.. ఆగిపో' విపరీతమైన ఆందోళనతో కంపించిపోతూ - జీప్ బోనెట్ మీద చేతులు వేసి బలవంతంగా ఆపటానికి ప్రయత్నం చేశాడు అతను.

కట్టుతాళ్ళు తెంపుకున్న పందెపుటెద్దు దూకినట్లు ఎగిరి ముందుకు దూకింది ఆ జీపు.

ఎగిరి పక్కకు దూకాడు వెట్టి. 'బ్రేకు వెయ్ తల్లీ.. బ్రేకు.. బ్రేకు..' గొంతు చినిగిపోయేటట్లు అరిచాడు.

పొరపాటున కూడా ఆ పని చేయలేదు అమ్మి. కిలకిలమని నవ్వుతూనే ఉంది. వేగంగా పాతిక అడుగుల దూరం తీసుకుపోయింది జీప్‌ని.

రోడ్డు మీద పడిపోయిన హీరోని ఎందుకైనా మంచిదనే ఉద్దేశంతో అవతలి పక్కకు ఈడ్వటం చాలా మంచిదయిందని వెంటనే అనిపించింది వెట్టికి. నిరభ్యంతరంగా టైర్లతో తొక్కించేసి ఉండేది ఆ అమ్మి.

'ఆపు తల్లీ.. ఆపేయమ్మా..' మరో క్షణంలోనో రెండు క్షణాల్లోనో తనకు కనిపించే యాక్సిడెంట్ దృశ్యం కనులముందు ప్రత్యక్షం అవుతుండగా ఆవేదన నిండిన కంఠంతో ఆక్రోశిస్తున్నట్టు అరిచాడు అతను.

అప్పుడు కూడా అతని గోడును ఆలకించలేదు అమ్మి. వేగంగా కదిలిన జీప్ ఉన్నట్లుండి చాలా టైట్‌గా టర్న్ తీసుకుంది.

పాతిక ముప్ఫయి అడుగుల వెడల్పు కంటే ఎక్కువ లేదు ఆ కంకర రోడ్డు. ఉన్న కాస్తరోడ్డు రకరకాల గోతులతో నిండి ఉంది. అయినాసరే ఎంతో ఎక్స్‌పీరియన్స్ ఉన్నట్టు జీప్‌ని వెనక్కి తిప్పి, సూటిగా అతని పక్కకు తీసుకువచ్చి, సడన్‌గా ఆపింది.

'త్వరగా ఎక్కు. దూరంగా పారిపోవాలని అంటున్నావుగా. పారిపోదువుగాని! ఎక్కి కూర్చో..' తల తిప్పి అతని ముఖంలోకి చూస్తూ అన్నది.

తెరిచిన నోరు తెరిచినట్టు ఉండిపోయింది వెట్టికి. 'త.. త.. తల్లీ.. నీకు డ్రైవింగ్ తెలుసా?' అడిగాడు అస్పష్టంగా, అతి ప్రయత్నం మీద తెలివి తెచ్చుకుని.

'బుల్‌డోజర్లు నడిపాను. ట్రాక్టర్లు నడిపాను. అంబాసిడర్లయితే అసలు లెక్కేలేదు. ముందు నువ్వు ఎక్కుతున్నావా లేదా?' ఉన్నట్లుండి సీరియస్ అయిపోతూ కరుకుగా అన్నది ఆమె.

ఎదురు చెప్పలేదు. ఎగిరి ఆమె పక్కసీటులో చతికిల పడ్డాడు వెట్టి.

అదిమిపట్టి ఉంచిన క్లచ్‌నో, బ్రేకునో చటుక్కున వదిలేసింది కాబోలు వింటినుంచి వెలువడిన బాణం మాదిరి దూసుకుపోవటం ప్రారంభించింది ఆ జీప్.

●●●

'దాహం... దాహంగా ఉంది. నీళ్ళు కావాలి. మంచినీళ్ళు' అంటూ కనులు తెరిచిచూశాడు పొదల్లో నురగలు కక్కుతూ పడిపోయిన వ్యక్తి.

పక్కనే ఉన్న బండరాయి మీద కూర్చుని ఉన్న ఆచార్లుగారు వెంటనే ముందుకు వంగి, అతని నాడిని పట్టుకున్నారు.

'మంచినీళ్ళని అడుగుతుంటే వినబడటం లేదా? నీ చెవులు ఎవరైనా-' అని చాలా రఫ్‌గా వల్గర్‌గా మాట్లాడుతూ, ఆ చేతిని వెనక్కి లాక్కోబోయిన ఆ వ్యక్తిని వెంటనే వారించారు, తలకు కట్లుకట్టి ఉన్న అతని సహచరులు.

'సమయానికి వచ్చి దేవుడి మాదిరి ఏదో ఇంజక్షన్ తెప్పించి గట్టిగా పొడిచాడు. నీ ప్రాణాలు దక్కినాయి. ఇంకో పావుగంట ఆలస్యం అయ్యుంటే విషం తలకు ఎక్కేసేదట' భుజం తడుతూ మృదువుగా చెప్పాడు ఒకతను.

ఆ సంభాషణ అసలు తన చెవులకు చేరనట్టు అతని నాడిని పరిశీలించటాన్ని పూర్తిచేసి



## జరిగిన కథ

బస్సు ప్రమాదంలో చిక్కుకున్న తమ ఊరి ప్రయాణికుల్ని ప్రాణాలకు తెగించి కాపాడిన యువకుడు పెట్టి ఆపదలో ఉన్నాడని గుర్తి స్తారు ఆ ఊరివాళ్ళు. యువకుడి ఆరోగ్యం బాగయ్యే దాకా ఆశ్రయమిచ్చి ఆనక అతన్ని ఊరు దాటించి పంపేయాలని నిర్ణయించుకుంటారు. ఈ లోపు అతడి కోసం గాలిస్తున్న గూండా ముఠా ఆ గ్రామంలో నాగమాతగా పేరుగాంచిన మహి మగల స్త్రీని చెరబడుతుంది. అంతలో నాగు పాము వచ్చి వారిలో ఒకణ్ణి కరిచి చంపు తుంది. ఆ తర్వాత......

తృప్తిగా తల ఊపారు ఆచార్లుగారు.

'ఇవాళ మీరు లేచినవేళ చాలా మంచిది. ఒకే ఒక ఇంజక్షన్ ఉండింది నా దగ్గర. సరైన సమ యానికి చేయటం జరిగింది. ఇంకో గంట గడిచిన తర్వాత మీ దారిన మీరు వెళ్ళిపోవచ్చును' అంటూ అప్పటివరకూ తాను కూర్చుని ఉన్న బండమీద నుంచి లేచి కంకరరోడ్డు మీదికి వచ్చాడు.

అప్పటివరకూ ఒక లాంతరు పట్టుకుని ఆయన పక్కనే నిలబడ్డ చెన్నకేశవులు కూడా ఆయనతో పాటు రోడ్డు ఎక్కాడు.

'వాళ్ళతోపాటు ఇక్కడ ఏదో జీప్ ఉన్న దంటిరే... ఏది అది?' చుట్టపొగ గుప్పుగుప్పున వదులుతూ అడిగాడు ప్రెసిడెంటు.

కర్రలు, బరిసెలు, గొడ్డళ్ళు పట్టుకుని ఆయన వెనకే ఉన్న గ్రామస్థులు పాతికమంది ప్రశ్నార్థ కంగా చూశారు ఆచార్లుగారి వైపు.

'ఇంతకుముందు వరకూ గుటగుటమంటూ ఉండింది ఆ అబ్బయ్య ప్రాణం. ఆ టైములో అడ గటం బాగోదని అడగలే. ఇప్పుడు అడగచ్చు' ఒక గ్రామస్థుడు అందించిన వాటర్‌బాటిల్‌తో చేతులు కడుక్కుని, తన ఉత్తరీయానికి తుడుచుకుంటూ చెప్పాడు ఆచార్లుగారు.

'ఇదిగో అబ్బీ.. ఒక పాలి ఇటు వస్తారా?' నోటి లోని చుట్టని అవతలికి విసురుతూ అరిచాడు ప్రెసిడెంటు.

ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు పొదల్లో ఉన్న హీరోలు. రెండు క్షణాల తరువాత నెమ్మదిగా ఇవతలకు వచ్చాడు వారిలో ఒకతను.

'పోయిన నెల ఒకరోజున చీకటిపడే సమ యంలో ఎక్కడి నుంచి వచ్చిందోగాని, సరాసరి మా నాగమ్మతల్లి గుడి దగ్గరికి వచ్చి పడి పోయింది మా పిచ్చమ్మి. తనెవరో తనకి తెలి యలా.. తన వారెవరో చెప్పలా... నవ్వేది.. ఏడ్చేది... కోపం వస్తే వెనుకాముందు చూసుకోకుండా విరగ బాదేది. మా ఆడబిడ్డే అనుకున్నాం. అన్నీ భరించాం. ఆళ్ళ వాళ్ళెవరయినా వస్తే అప్పగిద్దామని ఆచార్లు గారింటిలో పెట్టాం..' ఆ వ్యక్తి ముఖంలోకి సాభిప్రా యంగా చూస్తూ అన్నాడు ప్రెసిడెంటు.

ఆ సంభాషణ మొదలైన వెంటనే ఇంజక్షన్ చేయించుకున్న మనిషిని పొదల్లోనే వదిలి, గబ గబా రోడ్డు మీదికి వచ్చేశారు మిగిలిన వ్యక్తులు.

'పొదలకు అడ్డం పడి పరిగెత్తుతుంటే ఆప టానికి పట్టుకున్నాం. మమ్మల్ని కూడా పలుకు రాళ్ళతో బాదేసింది. ఇవన్నీ ఆ అమ్మి కొట్టిన దెబ్బలే' తమ తలకు ఆచార్లుగారు కట్టినకట్లను చూపిస్తూ తడుముకోకుండా చెప్పాడు ఒకతను.

'వాడు మాట మార్చేశాడు ఆచారిగారూ. వట్టి అమాయకుడి మాదిరి నటిస్తున్నాడు' పళ్ళు బిగపడుతూ ఆచారిగారి చెవిలో అన్నాడు చెన్నకే శవులు.

'అది సరే. ఆ అమ్మి ఏది? ఎక్కడ?' సూటిగా అడిగాడు ప్రెసిడెంటు ఆ మనిషిని.

'అయ్యా... చెప్పుకుంటే సిగ్గుచేటు. పొదల్లో నుంచి రోడ్డు మీదికి వచ్చింది. జీప్ దిగి అడ్డు కోబోయిన మా డ్రైవర్‌ని కూడా బాది జీపుతో పారిపోయింది' సిగ్గు పడుతున్నట్టు తల వంచు కుంటూ అన్నాడు ఆ మనిషి.

'ఏంటబ్బయ్యోవ్! ఏంటి నువ్వు చెబుతోంది? మంచేంటో చెడేంటో తెలియని మా పిచ్చమ్మ మీ డ్రైవర్‌ని కొట్టి మీ జీపును నడుపుకుంటూ పారి పోయిందా? సినిమాల్లో పని చేసినట్లుందావే. రోడ్డుకు దూరంగా ఉంటున్నాం కాబట్టి మమ్మల్ని మొరటోళ్ళనుకుంటున్నారా?' కనులు ఎర్రచేసి కర కరలాడుతున్న కంఠంతో ఆ మనిషి మీద విరు



చుకు పడబోతున్న ప్రెసిడెంటును వెనుక నుంచి చిన్న కంఠంతో హెచ్చరించాడు ఆచార్లుగారు.

'మీరు ఊళ్ళోకి వెళ్ళిపొమ్మని గుడి దగ్గర్నించి పంపించేసిన అబ్బయ్య ఇంటికి రాలేదు. ఊళ్ళో ఎక్కడా లేడు. మనోళ్ళు నాకు చెప్పారు. అతనే పిచ్చమ్మతో జీపులో పారిపోయి ఉంటాడు. వాళ్ళని కొట్టింది అతనే. పిచ్చమ్మి కాదు".

'అంతేనంటావా ఆచార్లుగారూ...' తను కూడా రహస్యంగానే అన్నాడు ప్రెసిడెంటు.

'అంతే. కాకపోతే ఇంకా ఏమిటయ్యా? ఇది ఆ అబ్బయ్య పనే. ఇంకో మాట అనుకోవాల్సిన పనే లేదు' తను కూడా ఆ సంభాషణలో తలదూర్చాడు చెన్నకేశవులు.

'ఈళ్ళని వదిలేస్తే, మరి మళ్ళీ ఆ అబ్బయ్య ఎనకాల పడతారేమో..' తన మనసులోకి వచ్చిన సందేహాన్ని బయట పెట్టాడు ప్రెసిడెంటు.

'జీపుతో పోయాడు గదా, దొరకడు. అదీగాక మనకి సంబంధించిన వ్యవహారం కాదు గదా.. మనం మాట్లాడకూడదు గదా..' అన్నాడు చెన్నకేశవులు.

'అదీ నిజమేననుకో..' అంటూ తల ఊపి, ఊరి జనం వంక బెదురుబెదురుగా చూస్తున్న ఆ వ్యక్తులవైపు తిరిగాడు ప్రెసిడెంటు.

'ఇదుగో, మీరు ఈడకి వచ్చినేళ మంచిగా ఉన్నట్టు లేదు. మీ దారేదో వెంటనే మీరు చూసుకోండి. తంబేడు దగ్గర పోలీసు స్టేషనుంది. మీ జీపు పోయిందని ఆడ రిపోర్టు చేసుకోండి. ఈడనే తిరిగితే, మళ్ళీ ఏదో ఒక పాము మీ వెంటపడుతుంది. ఏంటి? వెళ్ళిపోతున్నారా?' అడిగాడు రఫ్‌గా.

తడవు చేయకుండా తలలు ఊపారు వాళ్ళు.

లాల్చీజేబులో నుంచి పొగాకు ఉండని తీసి, పొగచుట్ట ప్రిపేర్ చేసుకుంటూ చెన్నకేశవులు వంక చూశాడు ప్రెసిడెంటు.

'మా బాగా చెప్పారు, పద్ధతిగా చెప్పారు' అంటూ తమ గ్రామస్థులకు చేయి ఊపాడు అతను.

ఎదుట ఎంతమంది ఉన్నా లెక్క చెయ్యకుండా కలబడేందుకు సిద్ధంగా వచ్చిన ఆ జనమంతా తేలికగా నిట్టూర్చి వెనక్కి తిరిగారు.

తూర్పుదిక్కు తెల్లబడేవరకూ కంకరరోడ్డు మీదనే కూర్చున్నారు ఆ వ్యక్తులు. వెలుగువచ్చిన తర్వాత నీరసంగా కనిపిస్తున్న తమ సహచరుడిని వంతుల వారీ చేతుల మీద మోసుకుంటూ మెయిన్‌రోడ్డు వైపు నడిచారు.

•••

'నాకు ఆకలేస్తోంది. ఏదైనా తినకపోతే కళ్ళు తిరిగి కింద పడిపోతాను' తన దృష్టిని రోడ్డు మీది నించి తిప్పకుండా, డ్రైవింగ్ మీదనే దృష్టి పెట్టి - వెట్టికి చెప్పింది పిచ్చమ్మి.

పొడవాటి ఆమె తలకట్టు విసురుగా తగులుతున్న గాలికి చెల్లాచెదురై పట్టు తివాచీ మాదిరి పరుచుకుంటున్నది జీప్ వెనుక భాగాన్ని.

**నలుగురు రౌడీలను తప్పుదోవ పట్టించి వెట్టిని కాపాడిందా అమ్మి. రౌడీల నుండి లాక్కున్న జీపును అవలీలగా నడుపుతూ వెట్టిని ఎక్కించుకుని ఆ గ్రామం నుంచి అతన్ని దూరంగా తీసుకొచ్చేసింది. బైకులు వేసుకుని జీపును తరమటం మొదలెట్టారు ఆ రౌడీలు. అదికూడా పసిగట్టి పొదల్లో జీపును ఆపి వెట్టిని కాపాడిందామె! ఇంతకూ అసలు ఆ అమ్మి ఎవరు? ఎక్కణ్ణించి వచ్చింది? ఆమె మహిమలున్న నాగమాతా? కాదా?**

తన జీవితమంతా మోటార్ వెహికల్స్ నడుపుతూనే గడిపినట్లు అవలీలగానే హేండిల్ చేస్తోంది ఆమె ఆ జీప్‌ని.

'తల్లీ... ఎవరు నువ్వు?' కంకర రోడ్డును వదిలి, మెయిన్ రోడ్డుమీదికి వచ్చిన క్షణం నుంచీ తన మెదడును తొలిచేస్తున్న మాటను అప్పుడు అడిగాడు అతను.

'నేనా? నేను నేనే... పిచ్చమ్మిని' ఒక్క సెకను కాలం ఓరగా అతనివైపు చూసి, వెంటనే రోడ్డు మీదికి చూస్తూ చెప్పింది ఆమె.

'పిచ్చమ్మలెవరూ తమకు పిచ్చి ఉందని చెప్పుకోరు. చెప్పారంటే అందుకు ఏదోకారణం ఉండే ఉంటుంది' అన్నాడు వెట్టి.

'కారణాల గురించి మాట్లాడితే ఒకటి కాదు వందలకు వందలు బయటికి వస్తయ్‌గాని, ఆకలి వేస్తోందని అన్నాను గదా.. వినబడలేదా?' అన్నది ఆమె.

తనను గురించి చెప్పటం ఆమెకు ఇష్టం లేదని అనిపించింది వెట్టికి. పట్టిపట్టి అదేపనిగా అడిగితే మరింత మొండిగా మాట్లాడుతుందని కూడా అనిపించి, 'తల్లీ.. నా జేబులు ఖాళీ... దమ్మిడీల మొఖం చూసి చాలాకాలం అయ్యింది' చినిగిపోయి ఉన్న ప్యాంటు జేబుల్ని, మరకలుపడి పరమ అసహ్యంగా కనిపిస్తున్న షర్టు జేబును తడుముకుంటూ చెప్పాడు.

'నేనంటే పిచ్చమ్మిని కాబట్టి ఇష్టం వచ్చినట్టు తిరుగుతున్నాను. నీకేమయింది? నువ్వెందుకు తిరుగుతున్నావు?' అడిగింది ఆమె.

'చెప్పాను కదా తల్లీ.. నువ్వు మొట్టమొదట కనిపించగానే వివరంగా చెప్పాను. బహుశా మర్చిపోయి ఉంటావు.' అంటూ చిన్నగా నవ్వాడు వెట్టి.

'ఎందుకు నవ్వు?' అడిగిందామె.

'నన్ను తరుముతున్న వాళ్ళని అడ్డుకుంటానని గట్టిగా చెప్పావు. అంతుచూస్తానని కూడా నువ్వు అన్నట్టు నాకు గుర్తు' వినోదంగా చూస్తూ చెప్పాడు.

'అడ్డుకున్నాను కదా..'

అదిరిపడి ఆమె ముఖంలోకి చూశాడు వెట్టి.

'ఆశ్చర్యం దేనికి? ఆళ్ళని ఆపింది ఎవరు? ఆళ్ళ జీప్‌ని ఇదిగో.. ఇలా లాక్కొచ్చింది ఎవరు?' అడిగింది ఆమె.

ఆచార్లుగారి ఇంటి పక్కన పాకలో ఉండగా, తనను అదే పనిగా బాధపెట్టిన జ్వరం తిరిగి తన ఒంటిమీదికి వచ్చేసిన అనుభూతి కలిగింది వెట్టికి.

నాగమ్మ గుడి దగ్గర్నించి ఆమె కంకరరోడ్డు వైపు పరిగెత్తుకుపోయి ఉండకపోతే, కచ్చితంగా గ్రామంలోకి వచ్చేసి ఉండేవాళ్ళు ఆ జీప్‌లో వచ్చిన వాళ్ళు. తనను చుట్టుముట్టి కాళ్ళు చేతులు విరగదీసి జీప్‌లోకి నెట్టేసేవాళ్ళు.

'నిజం ఏమిటో తెలిసేసరికి చెమటలు పట్టేస్తున్నాయ్ కదూ?' చిరునవ్వు నవ్వుతూ అడిగింది ఆమె.

'ఎవరివి తల్లీ నువ్వు?' మరోసారి బహు మర్యాదగా అడిగాడు అతను.

'నిమిషానికి ఒకసారి అడిగిన మాటనే అడిగినా మెదడు తినద్దు. నాకు మహాచిరాకు. ముందు జరగాల్సింది ఏమిటో చూడు' విసుగునిండిన కంఠంతో హెచ్చరించి, ఉన్నట్లుండి జీప్‌ని రోడ్డు పక్కకు తీసి, ఇంజన్ ఆఫ్ చేసేసింది ఆమె.

సీటులో నుంచి కిందికి దిగి చుట్టూ చూశాడు అతను. ఎటుచూసినా చెట్లు చేమలు తప్ప చిన్న పాటి తాటాకుల పాక కూడా కనిపించడం లేదు. ఆకలి తీర్చుకోవటానికి అవసరమైన వసతులు లేని ప్రదేశం అది.

'వెళ్ళు... వెళ్ళి తినటానికి ఏదైనా తీసుకురా... వెళ్ళు' సీటు వెనక్కి వాలి కనులు మూసుకుంటూ చెప్పింది ఆమె.

కదలకుండా అక్కడే నిలబడి ఉంటే, ఆమె నోటివెంట ఎటువంటి మాటలు బయటికి వస్తాయో అతని ఊహకి అందలేదు.

అతను నిలబడిన ప్రదేశానికి పాతిక అడుగుల దూరంలో ఎత్తుగా ఎదిగిన చింతచెట్ల మధ్యన కనిపించింది చిన్న కాలిబాట.

జనం ఎవరో ఒకరు తరచుగా తిరిగితే తప్ప కనిపించవు అటువంటి బాటలు. జారిపోతున్న ప్యాంటును పైకి లాక్కుంటూ అటుకేసి కదిలాడు అతను. పావుగంట నడిచిన తర్వాత ఎదుట ప్రత్యక్షం అయింది ఒక మొక్కజొన్న తోట...

ఒక పక్కగా ఉన్న మంచెమీద నిలబడి, విరగ కాసిన మొక్కజొన్న పొత్తులను పాడు చేయటానికి వచ్చే కోతుల మందల్ని అదిలించే ప్రయత్నం చేస్తున్నాడు ఒక వృద్ధుడు.

అతను వాయించిన రేకుడబ్బా మోతల్ని లెక్క చెయ్యడం లేదు అవి. వడిశెలలో పలుకురాళ్ళు పెట్టి బలంగా విసురుతున్నా, పట్టించుకోవడం లేదు.

వెట్టి చూస్తున్న సమయంలోనే వృద్ధుడు విసిరిన రాయి సూటిగాపోయి తన తల్లితో పాటు చిందులు తొక్కుతున్న ఒక పిల్లకోతికి తగిలింది.



**మెరుపు మెరిసినప్పుడు దానిచుట్టూ ఉన్న గాలి సూర్యుడికంటే ఐదురెట్లు ఎక్కువ వేడిగా ఉంటుంది.**

ప్రాణాలు పోయే దెబ్బ కాదది. అయినాసరే కీచుగా అరిచి వెల్లకిలా పడిపోయింది అది. ఆ దృశ్యాన్ని చూసేసరికి విపరీతమైన కోపంతో కీసర బాసరగా అరుస్తూ మంచె దగ్గరికి బయలు దేరాయి మందలో ఉన్నవన్నీ.

వృద్ధుడి ముఖంలోని భయం చాలా స్పష్టంగా కనిపించింది వెట్టికి. చేతిలో ఉన్న వడిశెలను వది లేసి, కింది నుంచి పొడవాటి కర్ర తీశాడు అతను. మంచె మీదినుంచి జర్రున కిందికి జారి, కాలిబాట వైపు పరిగెత్తుకు వచ్చాడు.

ఆలస్యం చేస్తే ఆ మంద అతనిమీద దాడి చేయడం తప్పనిసరి అని అర్థమై, తన ప్యాంటు జేబులోనే ఉన్న నాటు తుపాకీ తీశాడు వెట్టి. బారెల్‌ని గాలిలోకి ఎత్తి ట్రిగ్గర్ నొక్కాడు.

గుండెలు జలదరించే శబ్దంతో పేలింది అది. వృద్ధుడి అంతు చూడాలన్నంత కచ్చతో వచ్చిపడు తున్న మంద కాస్తా, చత్రాతి మీద కొట్టిన చిల్ల పెంకుల మాదిరి చెల్లాచెదరైపోయింది. ఒకటి నుంచి పది అంకెలు లెక్కబెట్టేలోపల దూరంగా పోయి అదృశ్యమయింది.

'సమయానికి వచ్చి నన్ను కాపాడావు అబ్బయ్యా. నువ్వు రాకపోయినట్లయితే ఇవాళ నన్ను నమిలి మింగేసేవి ఎదవ కోతులు' కర్రను వదిలి, నేల మీద కూర్చుంటూ ఆయాసంగా అన్నాడు వృద్ధుడు.

'పొత్తులు పక్వానికి వచ్చి ఉంటాయి. విరిచేసి ఇంటికి తోలుకు పోవచ్చు. ఆలస్యం చేస్తే సగానికి సగం పంట నాశనమై పోతుంది కదా" దగ్గర్లో ఉన్న ఒక మొక్కకి మొలిచి ఉన్న పొత్తుల్ని పట్టు కుని చూస్తూ అన్నాడు వెట్టి.

ఆ పని 'ఇయ్యాల చేద్దామని అనుకున్నాం. మా అబ్బడే ఇంకారాలే. ఎటుపోయినాడో ఏమో... కాపలా కాయలేక నా పని అయిపోతోంది' చిరాకుగా చెప్పి కోతులు వెళ్ళిన వైపు చూశాడు వృద్ధుడు.

'నాలుగు పొత్తులు కాల్చి ఇవ్వు, నేను నీకు సాయం చేస్తా' తడుముకోకుండా చెప్పాడు వెట్టి.

"నాలుగేమిటి అబ్బయ్యా. నీకు కావల్సినన్ని కాల్చుకో' అంటూ తన దుస్తుల్లో నుంచి అగ్గి పెట్టెను తీసి, తోటకు పది గజాలు ఇవతలగా చెత్తనుపోగేసి, చిన్న మంట రగిల్చాడు వృద్ధుడు.

ఉన్నవాటిలో కొంచెం లేతగా ఉన్న పొత్తుల్ని విరిచి ఆ మంటలో పడవేశాడు వెట్టి. వాటిని చక్కగా కాల్చేపని వృద్ధుడికే అప్పగించి తను చేలోకి అడుగు పెట్టాడు.

●●●

వేగంగా వచ్చి ఆగింది ఆ కారు. వెనుక సీట్లో నుంచి కిందికి దిగి, ఎదురుగా ఉన్న బిల్డింగ్ దగ్గ రికి పోయారు నలుగురు దృఢకాయులు.

పాతకాలపు భవంతి అది. పెద్దపెద్ద తలు పులు, రకరకాల అలంకరణలతో ఖరీదైన కట్టడం మాదిరిగానే కనిపిస్తోంది.

'ఏంటి? ఏమయింది వెళ్ళిన పని?' కారు దిగి ద్వారం దగ్గరికి వచ్చిన వారిని చూడగానే అడి గాడు అక్కడ నిలబడి ఉన్న మరో వ్యక్తి.

'పెద్దమ్మ యాడ ఉన్నట్టు?' అడిగాడు వారిలో ఒకతను.

'లోపల్కిబొండి.. తాడిపర్తి దగ్గర్నించి ఎవరో వచ్చారు. మాట్లాడుతోంది' అన్నాడు ఆ వ్యక్తి.

దుస్తుల మడతల్ని సరిచేసుకుంటూ లోపలికి పోయారు వాళ్ళు. ఆరు గదుల్ని దాటి విశాలమైన హాల్లోకి అడుగుపెట్టారు.

పాతకాలపు జమిందార్లు సభ తీర్చే ప్రదేశం మాదిరిగా ఉన్నది అది. నగిషీలు చెక్కబడిన టేకు కుర్చీలో కూర్చొని కనిపించింది ఆ భవ నానికి ఓనర్ అయినటువంటి పెద్దమ్మ.

'ఏరా? ఏమయింది? ఏమైనా తెలిసిందా? ఎక్కడయినా కనిపించిందా?' లోపలికి వచ్చిన వారిని చూడగానే ఆత్రుతగా అడిగింది.

తలలు అడ్డం తిప్పి, సూటిగా ఆమె వంక చూడలేకపోతున్నట్లు తలలు వంచుకున్నారు వాళ్ళు.

'చీమకుర్తి, మడకశిర ఊళ్ళు వెతికాము తల్లీ... ఎక్కడా చిన్నపాటి జాడ కూడా తెలియలేదు. మంత్రం వేసినట్టు మాయమైపోయింది' తలలు వంచుకునే రిపోర్టు చేశారు.

అంతకుముందు వరకూ ఎంతో హుందాగా ఉన్న పెద్దమ్మ ముఖం ఒక్కసారిగా కళ తప్పింది. కళ్ళ వెంట బొటబొటా బయటికి వచ్చాయి కన్నీళ్ళు.

'తనంత తానుగా ఎన్నడూ ఒక్క అడుగు కూడా బయటపెట్టి ఎరుగదు. ఎక్కడికయినా వెళ్ళదలుచుకుంటే ముందు పదిమంది వెనక పదిమంది తోడుగా కదిలేవాళ్ళు. ఏమయి పోయిం దిరా ఇప్పుడు..' గద్గద స్వరంతో అన్నది.

ఒకళ్ళ ముఖం ఒకళ్ళు చూసుకున్నారు ఆమెతో మాట్లాడటానికి వచ్చిన పెద్ద మనుష్యులు ఇద్దరు.

'అమ్మా... ఏమయిందీ? ఏమిటి సంగతి?' చిన్నగా అడిగాడు వారిలో ఒకతను.

పెద్దమ్మ వెనకాల నిలబడి ఉన్న తెల్లటి పంచె, జేగురు రంగు లాల్చీ వేసుకున్న ఆమె మేనేజరు, 'అమ్మాయిగారు పోయిన నెల మా బత్తాయితోట దగ్గరికి పోతానని చెప్పి వెళ్ళారు. తిరిగి ఇంటికి రాలేదు. అదీ విషయం..' చిన్న కంఠంతో చెప్పాడు.

ఒకరి ముఖం ఒకళ్ళు మళ్ళీ చూసుకుని కుర్చీల్లో నుంచి లేచారు ఆ పెద్దమనుష్యులు. 'కర్నూలు దాకా మాకు తెలిసిన వాళ్ళున్నారు. అందరికీ కబురు అందిస్తాం. తప్పకుండా కనిపిస్తారు అమ్మాయిగారు. మీరు బాధపడకండి తల్లీ. పెద్ద వారు. మీకు చెప్పేంతటి వాళ్ళం కాదుకాని, ధైర్యంగా ఉండండి. మేము మరోసారి వచ్చి కలుసు కుంటాం..' అంటూ నమస్కారం చేసి, బిల్డింగ్ బయటికి వచ్చేశారు.

దూరంలో ఉన్న ఒక పెద్ద చెట్టు కింద ఆగి ఉన్నది వాళ్ళు వచ్చిన జీపుకారు. చేయి ఊపే సరికి దాన్ని కదిలించి వారి దగ్గరికి తీసుకు వచ్చాడు డ్రైవర్.

'ఏరా... ఇక్కడ గోల ఏంటో నీకేమైనా తెలిసిందా?' జీపు కదిలి, ఊరి బయటికిపోతున్న సమయంలో అడిగాడు ఒక పెద్దమనిషి డ్రైవర్‌ని.

'ఒక్కతే కూతురు ఈ పెద్దమ్మగారికి. ఏడేళ్ళ క్రితం భర్త పోయాడు. అప్పటినుంచీ మతి చలిం చిందిట. తన ఒంటిమీదికి నాగమ్మతల్లి వస్తుం దని ఒకసారి, తనే నాగమ్మనని ఇంకోసారి, అంద రినీ ఆట పట్టించటానికి తను నటిస్తున్నానని మరోసారి వైనవైనాలుగా చెబుతుందిట. ఇప్పుడు ఇంట్లోనుంచి పారిపోయిందట. వెదకలేక చచ్చిపో తున్నారు" వాళ్ళు పెద్దమ్మతో మాట్లాడుతున్న సమయంలో తను తెలుసుకున్న మాటల్ని వివ రంగా చెప్పాడు డ్రైవర్.

'నూటయాభై కోట్ల ఆస్తి. ఎవరికి పెడుతుందో' అన్నాడు ఒక పెద్దమనిషి.

'ఎవరికేమిటి సారూ? పారిపోయిన అమ్మికి కూతురు ఉంది. పద్దెనిమిదేళ్ళు. ఏదో కాలేజీలో చదువుతోంది' అన్నాడు డ్రైవర్.

'ఏ కాలేజీలో చదువుతోందిరా?' అడిగాడు రెండో పెద్ద మనిషి.

'అడగలేదు సారూ. ఈసారి వచ్చినప్పుడు పూర్తి వివరాలు తెలుసుకుంటా' సమాధానం ఇచ్చాడు డ్రైవర్.

●●●

'నాలుగు మొక్కజొన్న పొత్తులు నా ముఖం

## వాళ్ళిద్దరూ విడిపోతున్నారా?



సరిగ్గా రెండు సంవత్సరాల క్రితం ప్రేమిం చిన వాడిని మనువాడింది అమలాపాల్! పెళ్ళ యిన తరువాత కూడా భర్త విజయ్ ప్రోత్సా హంతో సినిమాలు చేస్తోంది కూడా! ఇద్దరిదీ అన్యోన్యమైన జోడీ అన్న పేరు కూడా తెచ్చుకు న్నారు. ఇంత మంచి జోడీకి ఏమైందో తెలి యదు కానీ ఇద్దరి మధ్యా విభేదాలు వచ్చా యన్న పుకార్లు కోలీవుడ్‌లో బాగా షికారు చేస్తున్నాయి. మొన్న మొన్నటి వరకూ అన్ని సినిమా వేడుకలకు కలిసి కనిపించిన ఈ జంట ఉన్నట్టుండి కలిసి కనిపించడం మానే సింది. కొన్ని ఫంక్షన్లకు ఇద్దర్లో ఎవరో ఒకరే వస్తున్నారట! దీంతో ఇద్దరి మధ్యా గ్యాప్ వచ్చిందా? అన్న అనుమానాలు వ్యక్తం అవుతు న్నాయి. ఇన్ని వార్తలు షికారు చేస్తున్నా, ఇద్దరిలో ఎవరూ నోరు మెదపడం లేదు.

మీద పడేసి నీ దారిన నువ్వుపోతే సరిపోయిందని అనుకుంటున్నావా?' మధ్యాహ్నం మూడుగంటల వేళలో నీరసంగా నడుచుకుంటూ జీపుదగ్గరికి వచ్చిన వెట్టిని నిలబెట్టి కోపంగా అడిగింది పిచ్చమ్మ.

జ్వరం పూర్తిగా ఒంటిని వదిలిపెట్టి వెళ్ళిపోవటం వల్ల చెమటలతో తడిసిపోయి ఉంది అతని షర్టు. ఉప్పు తేలి అంతకుముందు కంటే మూడు రెట్లు భయంకరంగా కనిపిస్తోంది.

'నువ్వు నా పక్కన కూర్చుంటే నేను ఊపిరి ఆడక చచ్చిపోతాను. నీ అవతారం ఎలా ఉందో తెలుసా?' ముక్కును మునివేళ్ళతో గట్టిగా మూసుకుంటూ అడిగింది ఆమె.

జీప్ బోనెట్‌కి చేరగిలబడుతూ చిన్నగా నవ్వాడు వెట్టి. ప్యాంటు జేబులో నుంచి మూడు యాభై రూపాయల నోట్లు తీసి చూపించాడు.

'ఒక్క దమ్మిడీ కూడా లేదని అన్నావు. ఎక్కడివి ఈ నోట్లు? ఎవరినైనా కొట్టి తీసుకున్నావా?' అనుమానంగా, ఆశ్చర్యంగా రెండు రకాలుగానూ చూస్తూ అడిగింది ఆమె.




'దారిదోపిడీలు చేయాలని అనుకుని ఉన్నట్లయితే నా పరిస్థితి బ్రహ్మాండంగానే ఉండి ఉండేది. ఆ పని మహాపాతకమని అనుకుని, ఆ మాటను గట్టిగా చెప్పటం వల్లనే ఇప్పుడు ఇలా తయారైపోయాను. కష్టార్జితం తల్లీ. వద్దు వద్దన్నా, ఆ పెద్దాయన కొడుకు నాకు కూలీ కింద ఇచ్చాడు' అంటూ జీప్‌లో కూర్చున్నాడు వెట్టి.

మరొక్కమాట కూడా మాట్లాడకుండా ఇంజన్ స్టార్ట్ చేసింది పిచ్చమ్మ. యాక్సిలేటర్‌ని అడుగు కంటూ అదిమి మహావేగంతో నడపటం మొదలుపెట్టింది.

'తిండీతిప్పలు లేవు. నీరసం ముంచుకు వచ్చేస్తోంది. నువ్వు కూడా ఏమీ తీసుకోలేదు. ఇంత స్పీడు అవసరమా?' అడిగాడు అతను. డేష్ బోర్డుకు అడ్డంగా ఉన్న ఒక ఐరన్ రాడ్డును గట్టిగా పట్టుకుంటూ.

'నీ చెమట కంపు భరించటం కంటే తల్లకిందులుగా పల్టీలు కొట్టడం చాలా మంచిదనిపిస్తోంది. మాట్లాడకుండా కూర్చో...' అంటూ మరి కొంచెం వేగం పెంచింది ఆమె. రెండు కిలోమీటర్ల దూరం వెళ్లిన తర్వాత ఉన్నట్లుండి పక్కకు తిప్పి, రోడ్డు పక్కనే ఉన్న పొదల్లోకి పోనిచ్చి, ఇంజన్ ఆపేసింది.

గుండెల మీదనుంచి పెద్దబరువు దిగిపోయినట్లు నిట్టూరుస్తూ, సీట్లో నుంచి కిందికి దిగబోయిన అతన్ని చూపులతోనే వారించింది ఆమె. తలను రోడ్డువైపు ఊపింది.

ఆశ్చర్యాన్ని అణుచుకోవటానికి ప్రయత్నం చేస్తూ అటుకేసి చూసిన వెట్టికి సరిగ్గా పది నిమిషాల తరువాత వేగంగా వస్తూ కనిపించాయి రెండు మోటార్ సైకిళ్ళు. ఒక దాని మీద నలుగురు, రెండవదాని మీద ముగ్గురు కనిపించేసరికి మతిపోయినంత పని అయింది అతనికి.

'పోనీ. త్వరగా పోనీ. ఆలస్యం చేస్తే ఇంకా దూరం వెళ్ళిపోతారు. పోనీ' బిగ్గరగా అరిచి మొదటి బండిని నడుపుతున్న రైడర్‌ని హెచ్చరిస్తున్నాడు వెనుక ఉన్న వారిలో ఒక మనిషి.

'ప్రాణాలుపోయే కాటుపడినా బుద్ధి రాలేదు వాడికి. భూతం అరిచినట్టు ఎలా అరుస్తున్నాడో చూడు' నిర్వికారంగా చెప్పింది పిచ్చమ్మ.

'అమ్మా, వాళ్ళు మనల్ని వెంటాడుతున్నట్టు ఎలా తెలిసింది నీకు?' ఆశ్చర్యం అణుచుకోవడం చేతకాక సూటిగా అడిగేశాడు వెట్టి.

'నాగమ్మకి తెలియని విశేషాలు ఉంటాయా? నాకు తల వెనక కూడా ఉంటాయి కళ్ళు' గంభీరంగా చెప్పింది ఆమె.

తెరిచిన నోటిని ఠప్పున మూసేసుకున్నాడు వెట్టి. నోరు తెరిచి మరొక్కమాట మాట్లాడితే ఆమె మళ్ళీ తన అవతారపు దెబ్బని చూపిస్తుందన్న భయం అతన్ని బెదర గొట్టేసింది.

'మనం ఇప్పటికిప్పుడు రోడ్డు ఎక్కితే, వాళ్ళకి దొరికిపోతాం. ఒక గంటో రెండు గంటలో ఇక్కడే ఆగడం మంచిది' అంటూ సీటులో నుంచి లేచి చుట్టూ చూసింది ఆమె.

పది క్షణాల తరువాత ప్రత్యక్షమయింది అందమైన చిరునవ్వు ఆమె పెదవుల మీద. 'అదిగో... ఆ పక్కన ఉందొక చేను. నీళ్ళ మోటార్ కూడా ఉన్నట్టుంది. పదపద' అంటూ అతని సమాధానం కోసం ఎదురు చూడకుండా అటు దారి తీసింది.

●●●

'ఏ ఊరు బాబూ ఇది?' సాయం సమయంలో ఎదురైన ఒక ఊరిమధ్యలో తమను ఎక్కించుకు వచ్చిన పిల్లగాళ్ళను అడిగారు వెనక కూర్చున్న వ్యక్తులు.

'తంబేడు. పోలీస్‌స్టేషన్ కావాలని అన్నారు గదా. అదిగో.. ఆ బిల్డింగ్... వెళ్ళండి' అంటూ తమ బైక్స్‌ని ఇంకో వీధి వైపు తిప్పారు ఆ పిల్లగాళ్ళు.

చేతులు ఊపి వారి సాయానికి కృతజ్ఞతలు తెలియచేస్తున్నారు ఆ వ్యక్తులు.

'ముందు మనం ఫోను చెయ్యాలిరా.. ఫోన్ చేసిన తర్వాత స్టేషన్‌కి పోవాలి' అంటూ తన ప్యాంటు జేబులో నుంచి ఫోన్ తీసి ఒక నంబర్‌ని ప్రెస్ చేశాడు వారిలో ఒకతను.

రింగ్ పూర్తి అవుతూ ఉండగా అవతలినుంచి వినవచ్చింది కంఠం ఒకటి. 'ఏమయింది? పట్టుకున్నారా?' అని.

'దొరికినట్టే దొరికి జారిపోయినాడయ్యా' అన్నాడు ఆ వ్యక్తి.

అవతలివైపు నుంచి దారుణమైన భాషతో తీవ్రమైన తిట్లు వినిపించటం మొదలయ్యేసరికి చెవికి దూరంగా పెట్టి పట్టుకున్నాడు ఫోన్‌ని.

'ఇదిగో... ఇప్పుడే చెపుతున్నా. వాడిని పట్టుకు రాకపోతే మీకు పుట్టగతులు ఉండవు. కాళ్ళకి చేతులకి సంకెళ్ళు వేసి, వాడు చేసిన పనుల్నే మీతో కూడా చేయిస్తా. అర్థం అయిందా?' తిట్టితిట్టి ఆయాసం వచ్చింది కాబోలు దురుసుగా అడిగింది అవతలి కంఠం.

'అర్థం అయిందయ్యా. ఆ పని మీదనే ఉన్నాం. తొందరగానే పూర్తి అయిపోతుంది' అంటూ ఫోన్ ఆఫ్ చేసి ముఖం మీద ప్రత్యక్షం అయిన చెమటను షర్టు భుజానికి తుడుచుకున్నాడు ఆ వ్యక్తి.

'జీప్ పోయిందని చెప్పలేదేమిటి? పోలీసులకు అక్కడినుంచే డైరెక్షన్లు వచ్చి ఉండేవి కదా..' అన్నాడు అతని సహచరుల్లో ఒకతను.

'వాడు... ఆ వెట్టిగాడు మనకి కనిపించనేలేదు. ఏదో కర్మకాలి డ్రైవర్‌కి కనిపించినట్టే కనిపించి ముఖం పగలగొట్టేశాడు. ఆ మాట చెప్పినా, ఆడు జీపుని ఎత్తుకెళ్ళాడని తెలిసినా మనకి చివాట్లు ఇంకా ఎక్కువ అయిపోతాయ్. పోలీసులకి మనమే చెప్పుకుందాం. ఫోన్లు వద్దు' అంటూ దూరంలో ఉన్న స్టేషన్ బిల్డింగ్‌వైపు బయలు దేరాడు అతను.

●●●

సడన్‌బ్రేకుతో జీపు ఆపి, అతి నెమ్మదిగా, చాలా నెమ్మదిగా పది అడుగుల దూరంలో ఉన్న ఒక పెద్ద సందులోకి పోనిచ్చింది పిచ్చమ్మి.

'ఏమయింది? మళ్ళీ ఏదైనా సిగ్నల్ అందిందా?' అంతకుముందు తన తల వెనుక కూడా కళ్ళు ఉన్నాయని చెప్పిన మాటని జ్ఞప్తికి తెచ్చుకుంటూ అడిగాడు వెట్టి.

తలతోనే వీధి అవతలికి చూపించింది ఆమె.

అటుచూసి, అదిరిపడ్డాడు అతను. ఒకరి వెనుక ఒకరుగా పోలీస్ స్టేషన్లోకి పోతున్నారు మోటార్ బైక్స్ మీద తరుముకుంటూ వచ్చినవాళ్ళు.

**(ఇంకావుంది)**



## కాఫీతో వినికిడి సమస్య?

కంగారు పడకండి. ఇది అందరికీ వర్తించదు. భారీ శబ్దాలను ప్రతిరోజూ చాలా దగ్గరగా వినేవారికి కాఫీ అలవాటు ఉన్నట్టయితే ఈ అలవాటు మానుకోవాలని సూచిస్తున్నారు కెనడాలోని మెక్‌గ్రిల్ యూనివర్సిటీ పరిశోధకులు. నిర్మాణ రంగంలో పనిచేసేవారు, భారీ పేలుళ్ళు, పబ్బులు వంటి ప్రదేశాలలో పనిచేసేవారి చెవులు సక్రమంగా పనిచేయవని వీరు అంటున్నారు. రెండు మూడు రోజుల వరకూ ఆ శబ్దాల హోరు చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే ఉంటుందనీ, ఇలాంటి సమయంలో కాఫీ తాగితే వినికిడి శక్తి తగ్గే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. ఇదే విషయం మీద వీరు కొంతమందిపై పరిశోధనలు నిర్వహించారు. వీరందరూ భారీ శబ్దాల దగ్గర విధులు నిర్వర్తించేవారే కావడం విశేషం. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి పని స్థలంలోనే కాఫీ ఇచ్చారు. రెండో గ్రూపు వారికి కొన్ని గంటల అనంతరం కాఫీ ఇచ్చారు. అనంతరం వీరి వినికిడి శక్తిని పరిశీలించగా, భారీ శబ్దాలు వింటూ అదే సమయంలో కాఫీ తాగిన వారిలో క్రమేపీ వినికిడి శక్తి నశించిన విషయాన్ని వీరు గుర్తించారు. కాఫీ తాగని వారిలో వినికిడి శక్తి యథాతథంగా ఉందని పరిశోధకులు అంటున్నారు. వీరిలో వినికిడి శక్తి తగ్గడానికి కాఫీనే కారణమా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద వీరు పరిశోధనలు నిర్వహిస్తున్నారు. భారీ శబ్దాల దగ్గర పనిచేసేవారు కాఫీకి దూరంగా ఉంటేనే మంచిదని వీరు సూచిస్తున్నారు.




## జ్ఞాపక శక్తి పెంచే దాల్చిన చెక్క

దాల్చినచెక్కను ఆహారపదార్థాల తయారీలో వాడడం వలన కలిగే ఆరోగ్య ప్రయోజనాల గురించి అందరికీ తెలిసిందే! ఇది మెదడు పనితీరును మెరుగుపరిచి జ్ఞాపకశక్తిని పెంచుతుందన్న విషయం కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం పరిశోధకులు నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. మెదడు మొద్దుబారిపోయిన ఎలుకల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీటికి ప్రతిరోజూ ఆహారం ద్వారా దాల్చినచెక్కను అందించి అనంతరం వాటి మెదడు తీరును పరిశీలించారు. ఎలుకల్లో జీవ రసాయన క్రియల్లోనూ, మెదడు నిర్మాణంలోనూ మార్పులను వీరు గమనించారు. జ్ఞాపకశక్తి పెరగడానికి దోహదపడే సిఆర్ఈబి ప్రోటీన్లు ఎలుకల మెదడులో పెరగడాన్ని వీరు గుర్తించారు. అంతేకాకుండా ఆ ఎలుకలు అంతకు ముందు కన్నా ఉత్సాహంగా తిరగడం పరిశోధకుల దృష్టికి వచ్చింది. ఎలుకల్లో ఈ మార్పునకు కారణం దాల్చినచెక్క అని వీరు స్పష్టం చేస్తున్నారు.

## వేడి నీటి స్నానం వ్యాయామంతో సమానం

ప్రతిరోజూ వ్యాయామం చేయని వారికి ఇది శుభవార్త అంటున్నారు లండన్ పరిశోధకులు. వేడి నీటి స్నానం శరీరంలోని క్యాలరీలను కరిగించి వ్యాయామం చేసిన ఫలితాన్ని ఇస్తుందన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. ఒక అరగంట పాటు వ్యాయామం చేస్తే ఎన్ని క్యాలరీలు ఖర్చు అవుతాయో కొద్ది నిమిషాల పాటు వేడినీటి స్నానం చేసినా దాదాపు అన్ని క్యాలరీలు ఖర్చు అవుతాయని వీరు చెబుతున్నారు. వేడినీటి స్నానం కారణంగా రక్తప్రసరణ సక్రమంగా జరగడంతోపాటు రక్తంలో గ్లూకోజ్ స్థాయిలు అదుపులో ఉంటాయనీ, అంతేకాకుండా గుండె సంబంధ వ్యాధులు వచ్చే అవకాశాలు బాగా తగ్గుతాయని అంటున్నారు. దాదాపు అరగంట పాటు వేడినీటి స్నానం కారణంగా 140 క్యాలరీలు ఖర్చు అవుతాయనీ, దాదాపు 30 నిమిషాల పాటు బ్రిస్క్ వాక్ చేస్తే ఇన్ని క్యాలరీలు ఖర్చు అవుతాయని అంటున్నారు.



## షుగర్ రిస్క్ తగ్గించే వాల్‌నట్స్

అన్‌శాచురేటెడ్ ఫ్యాట్ కలిగిన వాల్‌నట్స్, సోయాబీన్ వంటి పదార్థాలను ఎక్కువగా తీసుకోవడం ద్వారా టైప్-2 డయాబెటిస్ వచ్చే అవకాశాలను చాలావరకూ తగ్గించుకోవచ్చు అంటున్నారు కేంబ్రిడ్జి యూనివర్సిటీ పరిశోధకులు. అన్‌శాచురేటెడ్ ఫ్యాట్ రక్తంలో గ్లూకోజ్ స్థాయిని తగ్గించడానికి దోహదపడుతుందని వారు చెబుతున్నారు. సుమారు ఐదువేల మంది షుగర్ వ్యాధిగ్రస్థుల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిలో కొందరికి డైటరీ ఫ్యాట్, కార్బోహైడ్రేట్స్ ఉన్న ఆహారం అందించారు. మరికొందరికి సోయాబీన్, వాల్‌నట్స్, రిఫైన్డ్ గ్రెయిన్స్ ఇచ్చారు. అనంతరం వారి గ్లూకోజ్ లెవెల్స్ పరిశీలించారు. రెండో గ్రూపు వారిలో గ్లూకోజ్ స్థాయి అదుపులో ఉన్న విషయాన్ని వీరు గుర్తించారు.

-అవినాష్



# గేమ్ ఆఫ్ లైఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి 6

**సాయంత్రం సమయం. ఆ పోష్ కాలనీలో ప్లేగ్రౌండ్ పక్కన ఇసుకలో కూర్చున్నాడు అయిదేళ్ళ కుర్రవాడు నిమిష్. ఫ్రెండ్స్ కోసం ఎదురు చూస్తున్నాడు. ఇంతలో నలుగురు ఇంటర్ విద్యార్థులు అటుగా వచ్చారు. ఒంటరి పిల్లాణ్ణి చూడగానే ఆటపట్టించాలనిపించింది వాళ్ళకి. జేబుల్లోంచి కొన్ని నాణాలు తీశారు. "ఒరేయ్ నిమ్మీ ఏమిటిరా, ఒక్కడివే కూర్చున్నావ్?" అన్నాడొకడు.**

"నా ఫ్రెండ్సింకా రాలేదు" అన్నాడు నిమిష్.

"ఈలోపు మనం ఒక ఆట ఆడుకుందామా?"

తలపైకెత్తి చూశాడుగాని మాట్లాడలేదు నిమిష్.

వాళ్ళలో ఓ కుర్రవాడు రెండు నాణాల్ని చూపి "వీటిని చూడరా" అన్నాడు. రెండు రూపాయలు, అయిదు రూపాయల నాణాలవి.

రెండు రూపాయల నాణెం తెల్లగా విశాలంగా ఉంది. అయిదు రూపాయల నాణెం దానికంటే చిన్నగా ఉంది గాని కొద్దిపాటి మందం.

"ఈ రెంటిలో నీకు ఏది నచ్చితే దాన్ని తీసుకో".

రెండు నాణాలవేపూ పరిశీలనగా చూశాడు నిమిష్. పెద్దగా విశాలంగా ఉన్న రెండు రూపాయల నాణెం తీసుకున్నాడు.

కుర్రవాళ్ళు పగలబడి నవ్వారు. "మళ్ళీ ఇంకోసారి ఆడదాం" అంటూ మళ్ళీ వాటినే చూపించారు. ఈసారి కూడా రెండు రూపాయల నాణాన్నే తీసుకున్నాడు. ఆ పిల్లలకు డబ్బు పెద్ద లెక్క కాదు. ఆనందమే ముఖ్యం.

పెద్దగా నవ్వులు నవ్వుతూ "మళ్ళీ ఆడదాం" అన్నారు. అలా మాటిమాటికీ నిమిష్ రెండురూపాయల నాణాన్నే తీసుకుంటున్నాడు. వాళ్ళు విసుగెత్తిపోయారు. "హౌలా గాడురా, రెండురూపాయలు, అయిదు రూపాయల నాణాలకు తేడా తెలియదు" అంటూ అక్కడనుంచి వెళ్ళిపోయారా కుర్రాళ్ళు.

ఒక పెద్దమనిషి ఇదంతా గమనించాడు. పిల్లవాడి దగ్గరకొచ్చి "ఏరా, వాళ్ళలా నవ్వుతుంటే కూడా నీకు ఏది పెద్ద నాణెమో తెలియలేదా?" అన్నాడు.

దానికి నిమిష్, "తెలుసు! నేను మొదటే అయిదు నాణెం తీసుకుంటే ఆట ఆగిపోయేది. ఇప్పుడు చూడు నాకు ఐదు కాదు, పదహారు రూపాయలొచ్చాయి" అన్నాడు.

జంతువులు తమకు ఆకలి వేసినప్పుడో ప్రమాదం ఎదురవుతుందని ఫీలైనప్పుడో దాడులు చేస్తాయి.

మనుషులు అట్లాకాదు. అవసరంతో వాళ్ళకి పనిలేదు. చిన్నచిన్న మానసికానందాల కోసం వేరేవాళ్ళ జీవితాలతో ఆడుకోటానికి ఏమాత్రం సంకోచించరు. ఈ నాణేలాట పరాచికపు ఆట. కాని లోకంలో మనుషులు ఎన్నో రకాలు. డబ్బుండి ఒళ్ళుబలిసి కొట్టుమిట్టాడే వాళ్ళు. వాళ్ళలో రకరకాల చపలత్వాలుంటాయి. ముఖ్యంగా ఆడవాళ్ళ విషయంలో. ఇలాంటివాళ్ళే కాకుండా మనల్ని చిన్నబుచ్చే ఘటనలెన్నో ఎదురవుతూ ఉంటాయి.

నగరంలో మనకు తెలియనివాళ్ళు ఎదురవుతారు. ఎప్పుడు వాళ్ళల్లో చపలత్వం ప్రకోపిస్తుందో తెలియదు. ఉదాహరణకు మీరు జాగ్రత్తగా వాహనంపై వెళుతుంటారు. వేరెవరో కారో,

## కుంటిసాకులు అపనమ్మకాలు పక్కకు నెట్టు

బైకో అతివేగంగా నడిపి డివైడర్‌ని ఢీకొట్టి వాహనంతో పాటు, మీ మీదపడి తన కాళ్ళు చేతులు విరగటానికో మీ బుర్ర బద్దలు కావటానికో కారణం కావచ్చు. అప్పుడు మీరేమంటారు? జీవన పోరాటంలో అనివార్యంగా ఎదుర్కోవాల్సిన, ఊహించని మరెన్నో ఇలాంటి సంఘటనలు ఉంటాయి. ఒక్కోసారి వాటిని డీల్ చేయడం కష్టసాధ్యం. దుర్భరంగా ఫీలవుతాం. అందుకే ఆయా సందర్భాలలో అందుబాటులో ఉన్న అవకాశాల్ని ఆసరా చేసుకుంటూ మన దృక్పథాల్ని సమయానుగుణంగా సరిచేసుకుంటూ యాక్షన్‌ప్లాన్ రూపొందించుకోవాలి.



### యాటిట్యూడ్‌ని సరిచేసుకోవటం

జీవితం ఒక గేమ్‌లాంటిది. ఆ గేమ్‌లో మన ప్రమేయం ఉండదు. అంతా నా తలరాత, అదృష్టం అనే దృక్పథంతో ఉన్నామంటే మన ఓటమిని మనం కొని తెచ్చుకున్నట్టే అవుతుంది. Born Loserగా మిగిలిపోతారు.

అలా కాకుండా, పోరాడతాను, జరుగుతున్న సంఘటనల మీద నా ప్రభావం చూపిస్తా! అనుకుంటే మాత్రం లైఫ్ గేమ్‌లో మనమే ప్లేయర్ గా మారిపోతాం. జీవితాన్ని మన చెప్పు చేతల్లో ఉంచుకోగలుగుతాం. జీవితపు నావను మనం కోరుకున్న గమ్యంవైపు నడిపించగలుగుతాం.

అలా గమ్యం చేరుకోవాలంటే, మనకీ, విజయానికీ మధ్య ఒక దూరం ఉంటుంది. ఆ దూరాన్ని దృక్పథం (Attitude) అంటాం. సరైన దృక్పథం ద్వారా, అవసరానుగుణంగా ఆ దృక్పథాన్ని సరిచేసుకోవటం ద్వారా మాత్రమే మనకు కార్యసిద్ధి చేకూరుతుంది.

పాజిటివ్ దృక్పథంతో ఉంటేనే త్వరగా విజయాన్ని చేరుకో గలుగుతాం. నెగెటివ్ దృక్పథం ఉంటే ఆలస్యంగా విజయాన్ని చేరుకుంటాం. లేక అసలు విజయతీరం చేరుకోలేకపోవచ్చు కూడా! మన జీవితం మన చెప్పుచేతల్లో ఉండాలంటే మన దృక్పథాన్ని (Attitude) మన అదుపులో ఉంచుకోవాలి.

యాటిట్యూడ్‌లో మన ఆలోచనలు, అనుభూతులు చేపట్టే చర్యలు (Actions) అన్నీ వస్తాయి. వీటన్నిటి మీద మనకు అదుపు ఉండాలి.

మనపట్ల, మన చుట్టూ ఉండే మనుష్యుల పట్ల ఆలోచనల్ని సరిగ్గా ట్యూనప్ చేసుకోవాలంటే ఎప్పటికప్పుడు మనం అనుసరించే దృక్పథాన్ని సరిచేసుకుంటూ పోవాలి.

## సెల్ఫ్-టాక్ (Self Talk)

జీవితంలో అనుక్షణం మనం ఏదో రకమైన సంభాషణ చేస్తూనే ఉంటాం. అంటే కమ్యూనికేషన్ (Communication). ఇంట్లో ఉన్నప్పుడు కుటుంబసభ్యులతో సంభాషిస్తుంటాం. వృత్తి ఉద్యోగాల్లో ఉన్నప్పుడు కస్టమర్లతో, సాటి ఉద్యోగులతో మనకింది వాళ్ళతో, పైవాళ్ళతో మాట్లాడుతూ ఉంటాం. ఒంటరిగా ఉన్నప్పుడు మనలో మనం మాట్లాడుకుంటూ ఉంటాం. ఇది ఎవరికి వాళ్ళకి సెల్ఫ్-టాక్. స్వయం భాషణం. నిజం చెప్పాలంటే ఎవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు కూడా మనలో మనం ఎంతో కొంత మాట్లాడుకుంటూనే ఉంటాం.

మన ఆలోచనలు, అనుభూతులు, అభిప్రాయాలు, ఐడియాలు, ఆఖరికి మన దృక్పథం, వీటన్నిటి గురించి ఎప్పటికప్పుడు మనతో సంప్రదించే, మనలోపల కదులుతూ ఉండే ఒక వాణి - ఒక చిన్నస్వరం - అదే సెల్ఫ్‌టాక్!

జీవితపు ప్రతి నిమిషంలోనూ మనం 30 నుంచి 50 సెకన్లపాటు సెల్ఫ్-టాక్ చేస్తుంటామని ఒక అంచనా.

పాజిటివ్ దృక్పథంగాని, నెగెటివ్ దృక్పథంగాని మనస్సులో ఉండే ఆలోచనలను బట్టి ఏర్పడుతుంది. మనస్సు నిండా చెడు ఆలోచనలు ఉంటే మనం నెగెటివ్ దృక్పథాన్ని ప్రదర్శిస్తాం. జీవితంలో జరిగే ఫలితాలు చెడుగా ఉంటాయి. ఆలస్యంగా వస్తాయి.

మనస్సునిండా మంచి ఆలోచనలు ఉంటే మనం పాజిటివ్ దృక్పథాన్ని ప్రదర్శిస్తాం. అందువల్ల మంచి ఫలితాలు వస్తాయి. అవి కూడా త్వరగా వస్తాయి. మనమీద మనకు ఉండే నమ్మకాలు, అంచనాలనుబట్టే మనకు కలిగే ఫలితాలు కూడా ఉంటాయి.

"నేను చేయలేను" అని మనస్సులో అనుకుంటే జన్మలో మనం ఇక ఆ పని చేయలేం. అసలు ప్రయత్నమే చేయకుండా అచేతనంగా ఉండిపోతాం. మరీ ప్రాణాల మీదకు వస్తే తప్ప!

## నెగెటివ్ స్థానంలో పాజిటివ్ ఆలోచనలు

ఏ కారణంవల్లనైనా మనం పుట్టి పెరిగిన పరిస్థితులను బట్టి కానీండి, మన చుట్టూ ఉండే మనుష్యులను బట్టి కానీండి, మనకు కలిగిన అనుభవాలనుబట్టి కానీండి, మన మనస్సులో నెగెటివ్ అభిప్రాయాలు, నెగెటివ్ ఆలోచనలుఉంటే వాటిస్థానంలో పాజిటివ్ ఆలోచనలను ప్రవేశ పెట్టండి. ఉదాహరణకు

| నెగెటివ్ ఆలోచనలు | వాటి స్థానంలో ప్రవేశ పెట్టాల్సిన పాజిటివ్ ఆలోచనలు |
|---|---|
| • నేనో నష్టజాతకుడిని, ఏ పని చేయబోయినా అపజయమే. | • నేనింకా విజయానికి చేరువ కాలేదు. దానికీ టైమొస్తుంది. |
| • నేనింతవరకూ ఏమీ సాధించలేదు. | • ప్రయత్నిస్తూ ఉన్నాను. పాఠాలు నేర్చుకుంటున్నాను. |
| • పెద్దపొరపాటు చేశాను. తప్పు జరిగిపోయింది. | • ప్రయత్నించేంత కాన్ఫిడెన్స్ వచ్చింది. |
| • కోరుకున్నదానిని పొందలేక పోతున్నాను. | • మరో విధంగా - డిఫరెంట్‌గా ప్రయత్నిస్తాను. |
| • నేనుత్త చవటను. ఏమీ చేయలేకపోతున్నాను. | • నేనింకా పర్‌ఫెక్ట్ కాలేదు. ఇంకా నేర్చుకోవాలి. |
| • టైమంతా వేస్టు చేశాను. | • ముందు ముందు సక్సెస్‌ని సాధించేందుకు కాలాన్ని ఇన్వెస్ట్ చేశాను. |
| • దీనినింక ఆపేసి వేరే పని చేయాలి. | • ఇంకా స్మార్ట్‌గా చేయాలి. |
| • నా ఆలోచన బాగాలేదు. చెడ్డ ఐడియా.. | • మరింత మంచి ఐడియా కోసం ప్రయత్నిస్తాను. |

**ఆలోచించేటప్పుడు ఇతరులతో పోల్చుకుంటాం. నేనుత్త చవటని, నాకేం చేత కాదు, నష్టజాతకుణ్ణి అనుకుంటూ దిగజారిపోతాం. ఈ ఆలోచనలవల్ల నిజంగానే నష్టజాతకుడిగా మిగిలిపోతాం. మనలో ప్రయత్న లోపం ఉండకూడదు. ఎంతపెద్ద కష్టం వచ్చినా దృక్పథాన్ని సవరించుకుంటూ ముందుకెళ్ళాలి. మరి మన దృక్పథాన్ని సవరించుకోవాలంటే మనమేం చెయ్యాలి?**



అలా కాకుండా, "దానిని నేను తప్పకుండా సాధిస్తాను. సాధించగలను" అనుకుంటే అందుకు తగ్గ ప్రయత్నాన్ని కాన్ఫిడెంట్‌గా ముమ్మరంగా సాగించగలుగుతాం. ఏ రకమైన కుంటిసాకులు, అపనమ్మకాలు లేకుండా ముందుకు సాగుతాం. అనుకోవాలి.

"నేను చేయగలను. నేను ఏం సాధించాలనుకుంటున్నానో దానిని తప్పకుండా సాధిస్తాను" అనే రీతిలో మన సెల్ఫ్ టాక్ ఉండాలి.

## ఇతరులతో పోల్చి చూసుకోవటం

ఎక్కువగా వేరేవాళ్ళతో పోల్చి చూసుకోవటం వల్ల, కంపేర్ చేసుకోవటం వల్ల నెగెటివ్ ఆలోచనలు ఏర్పడుతుంటాయి. ఇతరులు లేక ఫలానా వ్యక్తి మనకంటే బెటర్‌గా ఉన్నాడు అనుకున్నప్పుడు పోల్చి చూసుకోవటం జరుగుతుంది.

పోల్చిచూసుకోవటం నెగెటివ్‌గానూ ఉండవచ్చు. పాజిటివ్‌గానూ ఉండవచ్చు. పాజిటివ్‌గా పోల్చి చూసుకోవటమనేది పులిని చూసి నక్కవాత పెట్టుకోవటంలా ఉంటుంది. ఎన్టీఆర్ ముఖ్యమంత్రి అయినప్పుడు అంత దీటుగా ఫ్యాన్ ఫాలోయింగ్ ఉన్న నేను ముఖ్యమంత్రిని కాలేనా అన్న భావంతో, ప్రోద్బలంతో చిరంజీవి ప్రజారాజ్యం పార్టీ పెట్టి చతికిలబడటాన్ని చూశాం.

ఇది పాజిటివ్‌గా పోల్చుకోవటం అన్న మాట. ఇక నెగెటివ్‌గా పోల్చుకోవటానికి వస్తే అది ఎప్పుడూ ఆ మనిషిని అధఃపాతాళానికి నెట్టేస్తుంది. తన మీద తనకు నమ్మకాన్ని చంపేస్తుంది. ఏ రంగంలోనైనా సరే ఒక మనిషి తనను తాను మరో మనిషితో పోల్చి చూసుకోవటం పెద్దతప్పు. శుద్ధ దండగ. అది ఎప్పుడూ అపకారాన్నే కలగజేస్తుంది. ఈ పోల్చి చూసుకోవటం ఎక్కువగా సెల్ఫ్-టాక్ మూలంగా ఏర్పడుతుంది. మనస్సులోంచి అలాంటి స్వరం వినిపిస్తున్నప్పుడు ప్రారంభంలోనే దాని గొంతును నొక్కేయాలి.

"నేను నేనే. వాడు వాడే. వాడి ప్రత్యేకతలు వాడివి, నా ప్రత్యేకతలు నావి. నా ధోరణిలో నేను స్పెషల్. ఒకరితో నాకు పోలికేంటి?" అనుకోవాలి.

పోల్చిచూసుకోవటం అనే జబ్బు లేదా ఆ అవలక్షణం ఉన్నవాళ్ళు దాని నుంచి బయటపడటం అంత తేలికకాదు. కొంత ప్రయత్నం కావాలి. తనమీద తనకు నమ్మకం, గౌరవం ఉండాలి. అసలు అవి లేనివాళ్ళే ఇతరులతో తనను మాటిమాటికీ పోల్చి చూసుకుంటూ ఉంటారు.

*(ఇంకావుంది)*

# వంటలు

## ● చిలగడదుంప పూరీ



**కావలసిన పదార్థాలు:** చిలగడదుంపలు - పావుకిలో ( ఉడికించి తొక్కతీసి బాగా మెదపాలి), బెల్లం తురుము - పావుకప్పు, గోధుమపిండి - కప్పు, ఉప్పు - తగినంత, యాలకుల పొడి - టీ స్పూను, నీరు - పిండి కలపడానికి తగినంత

**తయారీ పద్ధతి:** ఒక గిన్నెలో కొద్దిగా నీరు, బెల్లంతురుము వేసి గరిటెతో కలిపి కరిగించి వడకట్టాలి. అదే పాత్రలో మెత్తగా చేసిన చిలగడదుంప ముద్ద, యాలకుల పొడి, గోధుమపిండి వేసి బాగా కలపాలి. తగినంత నీరు జతచేసి పూరీ పిండి మాదిరిగా కలిపి అరగంట పాటు పక్కన ఉంచాలి. పిండిని చిన్న ఉండలుగా చేసి పూరీలు ఒత్తుకోవాలి. బాణలిలో తగినంత నూనె పోసి కాగాక, ఒక్కో పూరీ వేసి వేయించి తీయాలి. తియ్యతియ్యని చిలగడదుంప పూరీలు రెడీ.

## లాచా పరాటా

**కావలసిన పదార్థాలు:** గోధుమపిండి - రెండు కప్పులు, నెయ్యి - సరిపడా, ఉప్పు - రుచికి సరిపడ, నూనె - టేబుల్ స్పూన్

**తయారుచేసే పద్ధతి:** ముందుగా గోధుమ పిండిలో ఉప్పు, నూనె, తగినన్ని నీళ్ళు పోసి ముద్దలా చేసి తడిబట్ట కప్పి అరగంటసేపు పక్కన పెట్టుకోవాలి. తరువాత పిండిని ఉండలుగా చేసి ఐదారు అంగుళాల చపాతీలు చేయాలి. ఇప్పుడు కరిగించిన నెయ్యిని చపాతీ మీద మొత్తంగా రాయాలి. తరువాత చాకుతో రెండున్నర అంగుళాల వెడల్పుతో పొడ



వుగా కోయాలి. వీటన్నింటినీ ఒకదాని మీద ఒకటి పరచాలి. అలా పరిచేటప్పుడు ప్రతీ దానిమీద నెయ్యి రాయాలి. ఇలా పరిచిన దానిని ఒకవైపు నుండి గుండ్రంగా చుట్టాలి. ఇప్పుడు దీన్ని కర్రతో పరాటాల్లా వత్తాలి. ఇప్పుడు స్టవ్ మీద పెనం పెట్టి వెన్న వేస్తూ తక్కువ మంటతో రెండువైపులా కాల్చి తీయాలి. అంతే, లాచా పరాటా రెడీ.

## ● పన్నీర్ కుల్చా



**కావలసిన పదార్థాలు:** మైదా - రెండు కప్పులు, పాలు - అరకప్పు, పెరుగు - పావుకప్పు, పంచదార - అర టీ స్పూను, బేకింగ్ పౌడర్ - ముప్పావు టీ స్పూన్, నువ్వులు - మూడు టీ స్పూన్లు, నెయ్యి - రెండు స్పూన్లు, తురిమిన పన్నీర్ - పావుకప్పు, ఉల్లిగడ్డ - ఒకటి, పచ్చిమిరపకాయలు - రెండు, చాట్‌మసాలా - ఒక టీ స్పూన్, కారం - ఒక టీ స్పూన్, ఉప్పు - తగినంత

**తయారుచేసే పద్ధతి:** పాలు వేడిచేసి చల్లార్చుకోవాలి. మైదాలో బేకింగ్ పౌడర్, ఉప్పు వేసి కలపాలి. దీంట్లో పంచదార, చల్లని పాలు, పెరుగు వేసి ఉండలు కట్టకుండా బాగా కలుపుకోవాలి. దీనిపై ఒక మెత్తని వస్త్రం కప్పి రెండుగంటలపాటు పక్కన పెట్టాలి. ఈలోపు పచ్చిమిరపకాయలను, ఉల్లిగడ్డను చిన్నగా కట్ చేసుకోవాలి. ఒక గిన్నెలో పన్నీర్, ఉల్లిపాయ ముక్కలు, పచ్చిమిరపకాయలు, కారం, చాట్‌మసాలా వేసి కలపాలి. ఇప్పుడు మైదాను తీసుకొని చిన్నచిన్న ఉండలుగా చేసి చపాతీల్లా ఒత్తుకోవాలి. దీంట్లో పన్నీరు మిశ్రమాన్ని పెట్టి మళ్ళీ చిన్న ముద్దలా చేయాలి. మళ్ళీ కొద్దిగా పిండి, నువ్వులు వేస్తూ చపాతీల్లా చేసుకోవాలి. ఇలా పిండి మొత్తాన్ని చేసుకొని పక్కన పెట్టుకోవాలి. తర్వాత పెనం పెట్టి కొద్దిగా నెయ్యి వేస్తూ సన్నని మంట మీద రెండువైపులా కాల్చుకోవాలి. వేడి వేడి పన్నీర్ కుల్చా రెడీ! వీటిని బఠాణీలతో చేసిన ఏ కూరతోనైనా లాగించేయొచ్చు.

## సొరకాయ తెప్లా

**కావలసిన పదార్థాలు:** సొరకాయ తురుము - ఒక కప్పు, గోధుమపిండి - ఒక కప్పు, పచ్చిమిర్చి - ఒకటి, ఉప్పు- తగినంత, నూనె - ఒక టీ స్పూన్, కొత్తిమీర తురుము- ఒక టేబుల్ స్పూన్, కసూరీ మేథీ - ఒక టేబుల్ స్పూన్, కారం - పావు టీ స్పూన్, పసుపు - చిటికెడు, చాట్‌మసాలా - పావు టీ స్పూన్, నెయ్యి లేదా నూనె - రెండు టేబుల్ స్పూన్లు (తెప్లా పైన పూసేందుకు)

**తయారుచేసే పద్ధతి:** గోధుమ పిండిలో సొరకాయ తురుము, ఉప్పు, పచ్చిమిర్చి తరుగు, కొత్తిమీర తురుము, కసూరీమేథీ, కారం, పసుపు, చాట్ మసాలా, నూనె వేసి ముద్దలా కలపాలి. సొరకాయలో నీళ్ళు ఉంటాయి కాబట్టి పిండి కలిపేటప్పుడు ప్రత్యేకించి నీళ్ళు పోయనక్కర్లేదు. ఒకవేళ పిండి మరీ జారుగా అయితే మరికొంచెం గోధుమపిండి కలపండి. మెత్తటి ముద్ద తయారుచేసుకున్న తరువాత చిన్న చిన్న ఉండలు చేయాలి. ఆ తరువాత రొట్టెల పెనాన్ని వేడిచేయాలి. అది వేడెక్కుతుండగానే గోధుమపిండిలో ఉండల్ని దొర్లించి రొట్టెల కర్రతో నాలుగైదు అంగుళాల వెడల్పులో గుండ్రంగా వత్తాలి. వీటిని వేడెక్కిన పెనం మీద వేసి కాల్చాలి. పైన నూనె పూసి చివర్లను గరిటెతో నొక్కుతూ కాల్చాలి. ఇలానే రెండోవైపు కూడా చేయాలి. రెడీ అయిన తెప్లాలను మీకు నచ్చిన కూర లేదా పచ్చడితో తినొచ్చు.



# హోమియోకేర్ ఇంటర్నేషనల్‌లో థైరాయిడ్ సమస్యలకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్నేషనల్



నేటికాలంలో ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 200 మిలియన్ల మంది ఏదో ఒక థైరాయిడ్ సమస్యతో బాధ పడుతున్నట్లు తేలింది. ఆధునికతతోపాటు మారుతున్న మానవుని జీవన విధానం, వ్యాయామం లేకపోవడం, అధిక మానసిక ఒత్తిడి, పౌష్టికాహార లోపం మరియు వంశపారంపర్యత వంటి అంశాలన్నింటి వలన ఎంతో మంది థైరాయిడ్ సమస్యలకు గురి అవుతున్నారు. కాబట్టి ఈ వ్యాధి పట్ల అవగాహన పెంచుకుని తగు జాగ్రత్తలు తీసుకోవడం ద్వారా ఈ థైరాయిడ్ సమస్యలకు గురి కాకుండా కొంతవరకు జాగ్రత్త పడవచ్చును.

మానవ శరీరంలోని అతి ముఖ్యమైన గ్రంథులలో థైరాయిడ్ గ్రంథి ఒకటి. ఇది మెడ ముందు భాగంలో, కంఠానికి దగ్గరగా సీతాకోకచిలుక ఆకారంలో శ్వాసనాళానికి ఇరుప్రక్కలా ఉంటుంది. ఇది T3, T4 అనబడే థైరాయిడ్ హార్మోన్‌లను విడుదల చేస్తుంది. శరీర ఎదుగుదల, శ్వాస వ్యవస్థ, గుండె, నాడీమండలం పనితీరు, జీర్ణక్రియ, బేసల్ మెటబాలిక్ రేట్ మరియు సంతాన ఉత్పత్తి వ్యవస్థ వంటి అన్ని రకాల జీవవ్యవస్థల పైన ఈ థైరాయిడ్ హార్మోన్‌ల ప్రభావం ఉంటుంది.

సాధారణంగా ఈ గ్రంథి, మెదడులోని పిట్యుటరీ గ్రంథి నియంత్రణలో ఉంటుంది. శరీరంలో తగినన్ని థైరాయిడ్ హార్మోన్‌లు లేనప్పుడు, ఆ అవసరాన్ని గ్రహించిన పిట్యుటరీ గ్రంథి TSH (Thyroid Stimulating Hormone)ను విడుదల చేస్తుంది. ఇది థైరాయిడ్ గ్రంథిని ఉత్తేజ పరచడం ద్వారా, థైరాయిడ్ గ్రంథి T3, T4 హార్మోన్‌లను ఉత్పత్తి చేసి, వాటిని రక్త ప్రవాహంలోకి పంపుతుంది. తద్వారా ఆ హార్మోన్‌లు శరీరంలోని అన్ని కణాలకు చేరుకుని, తిరిగి యథావిధిగా అన్ని జీవక్రియలపై తమ ప్రభావం చూపుతాయి. ఇలా నిరంతరం మన శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు తగిన స్థాయిలో ఉండే వ్యవస్థ విఫలమైనప్పుడు థైరాయిడ్ హార్మోన్‌ల ఉత్పత్తి తక్కువ లేదా ఎక్కువ అవడం ఒక ఖచ్చితమైన సమస్యగా పరిణమిస్తుంది. ఈ రకమైన అసమతుల్యత హైపోథైరాయిడిజం లేదా హైపర్‌థైరాయిడిజం మరియు గాయిటర్ వంటి దీర్ఘకాలిక సమస్యలకు దారి తీస్తుంది.

**(1) హైపోథైరాయిడిజం:** ఇది సర్వసాధారణంగా ఎక్కువ మందిలో కనిపించే సమస్య. శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడంతో తలెత్తే ఈ సమస్యను హైపోథైరాయిడిజం అని అంటారు. ఇది పిల్లలలో మరియు స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది.

**లక్షణాలు:** పిల్లలలో: బుద్ధి మాంద్యం, ఎదుగుదల లోపం, జ్ఞాపకశక్తి లేకపోవడం, మలబద్ధకం, చురుకుదనం కోల్పోవడం, వయస్సుకు మించి లావుగా ఉండటం, ముఖం వాపునకు గురి కావటం, ఎక్కువగా నిద్ర పోవడం వంటి లక్షణాలు ఏర్పడతాయి.

**యుక్త వయస్కులలో:** అలసట, చలికి తట్టుకోలేకపోవడం, మలబద్ధకం, చర్మం పొడిబారడం, బరువు పెరగడం, ముఖంలో వాపు, కీళ్ళలో నొప్పి-వాపులు, కండరాల బలహీనత మరియు నొప్పి, గొంతు బొంగురు పోవడం, జుట్టు రాలిపోవడం, రజస్వల ఆలస్యమవడం, నెలసరిలో అధిక లేదా అల్ప రక్తస్రావం, జ్ఞాపకశక్తి తగ్గిపోవడం, సంతానలేమి లోపాలకు గురి కావటం వంటి లక్షణాలను గమనించడం ద్వారా 'హైపోథైరాయిడిజం'ను సులువుగా గుర్తించవచ్చు.

**(2) హైపర్‌థైరాయిడిజం:** థైరాయిడ్ గ్రంథి ఎక్కువ మోతాదులో 'థైరాక్సిన్'ను విడుదల చేయడం వలన ఈ సమస్య ఏర్పడుతుంది.

**లక్షణాలు:** ఆకలి ఎక్కువగా లేదా తక్కువగా కావడం, ఆహారం సరైన మోతాదులో తీసుకున్నా కూడా శరీర బరువు తగ్గటం, నిద్రలేమి, గుండెదడ, చెమటలు పట్టడం, విరేచనాలు, చేతులు వణకడం, నీరసంగా ఉండటం, నెలసరి త్వరగా రావడం, ఋతుచక్రములో అధిక రక్తస్రావం కావడం, వెంట్రుకలు రాలిపోవడం, సంతానలేమి లోపాలు తలెత్తడం వంటి లక్షణాలను గమనించవచ్చు.

**(3) గాయిటర్:** థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని 'గాయిటర్' అని అంటారు. కొన్ని సందర్భాలలో థైరాయిడ్ గ్రంథి సాధారణ పరిమాణం కంటే రెండింతలు ఎక్కువగా పెరిగి, స్వర పేటికపై ఒత్తిడి కలిగించడం వలన స్వరంలో మార్పు వస్తుంది. గాయిటర్‌లో థైరాయిడ్ హార్మోన్‌లు (T3, T4) సాధారణ స్థితిలో ఉన్నప్పటికీ గాయిటర్ లేనట్లుగా నిర్ధారించలేము.



**లక్షణాలు:** గొంతు క్రింద వాపు వచ్చి మింగడానికి కష్టంగా ఉండటం, స్వరంలో మార్పులు, శ్వాస తీసుకోవడంలో ఇబ్బంది, దగ్గు, ఎక్సాప్తాల్మిక్ గాయిటర్‌లో కనుగుడ్లు బయటకు పొడుచుకు వచ్చినట్లుగా ఉండటం వంటి లక్షణాలు ఏర్పడతాయి.

**కారణాలు:** గాయిటర్ లోపం ఉత్పన్నమవటానికి గల ముఖ్య కారణం "అయోడిన్" అనే మూలకం యొక్క లోపం, గ్రేవ్స్ డిసీజ్, పిట్యుటరీ గ్రంథి ట్యూమర్లు మరియు థైరాయిడ్ క్యాన్సర్ దీనికి కారణాలుగా చెప్పవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** థైరాయిడ్ ప్రొఫైల్ – T3, T4, TSH; యాంటీ థైరాయిడ్ యాంటీ బాడీస్, USG ఆఫ్ థైరాయిడ్ గ్లాండ్; గొంతు యొక్క సి.టి. స్కాన్ వంటి పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్నేషనల్‌లో రోగి శరీరతత్వాన్ని బట్టి మరియు వ్యాధి లక్షణాలను బట్టి, జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ సిమిలిమం చికిత్సా విధానంతో, హైపోథెలామిక్ పిట్యూటరీ థైరాయిడ్ వ్యవస్థను సరిచేయడం ద్వారా, ఎలాంటి హార్మోన్‌లను బయట నుండి అందించే పని లేకుండా మరియు జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండానూ ఈ థైరాయిడ్ సమస్యలను సంపూర్ణంగా నయం చేయడం జరుగుతుంది.

# మానవత్వం పరిమళించిన వేళ

-శ్రీమతి తనికెళ్ళ కల్యాణి

**ప్రసాద్ బ్యాంక్ నుండి వచ్చి కాఫీ కలుపుకుని తాగాడు. అర్ధాంగి పుట్టింటికి వెళ్ళడంతో చెయ్యి కాల్చుకోక తప్పలేదు. పనిమనిషి బంగాళాదుంపలు తరిగి వెళ్ళింది. అన్నం వండుకుని, వేపుడు చేసుకోవడం ప్రసాద్ పని.**

**టి.వి. పెట్టుకుని చూస్తున్నాడు. ఫిబ్రవరి నెల...చలి ఇంకా తగ్గలేదు. బయటికి వెళ్ళి ఫ్రెండ్స్‌ను కలవబుద్ధి కాలేదు. ఒక్కొక్కసారి మనిషి ఏకాంతాన్ని కోరుకుంటాడు.**

ప్రదీప్ నుండి ఫోన్... తమ్ముడి ఫోన్‌కాల్ చూడగానే ప్రసాద్‌లో చైతన్యం.

ప్రదీప్ నవ్వుతూ అడిగాడు. "ఏం చేస్తున్నావురా?"

ప్రసాద్ నవ్వాడు. "వదిన లేదు కదా, స్వయం పాకం. ప్రస్తుతం టి.వి. చూస్తున్నాను."

"అదృష్టవంతుడివిరా! నాలుగు రోజులు ఏ సతాయింపులూ ఉండవు. నా షాపు బిజీ, నేను బిజీ! పండగకి ఒకరోజు వెళ్ళిరావడం తప్ప కుదరదు. మీ మరదలు నాతోనే లంకె పెట్టుకొని కూర్చుంటుంది" నిట్టూర్పు విడుస్తూ అన్నాడు ప్రదీప్.

ప్రసాద్ నవ్వి "నీ మీద ప్రేమరా! మీ వదిన



లాగ పిల్లలను తీసుకొని తరచుగా వెళ్ళదు" అన్నాడు.

"ప్రేమా? గాడిదగుడ్డా? మన బాబుగారిలాగ ఎవరినైనా తెస్తానని భయం. ఆయన పోయినా ఆయన జీవితకథను తలుచుకుని, భయపడుతూనే ఉంటార్రా!" ప్రదీప్ కోపంగా అన్నాడు.

మళ్ళీ అతడే అన్నాడు. "చాలీచాలని తిండి, అమ్మ ఏడుపు, మన అర్ధాంతర చదువులు, అన్నీ ఆయన ధర్మమే కదురా"!

ప్రసాద్ ఏమనగలడు? ఏం చెపితే తన వాళ్ళు కష్టాలు మరిచిపోతారు.

మంచిమార్కులతో ఇంటర్ పాసైన తమ్ముడు, ఇలా ప్రైవేటుగా డిగ్రీ చదివి "ఇంటర్‌నెట్" సెంటర్ పెట్టుకున్నాడు. "మీ సేవ" కూడా చేస్తున్నాడు. తెలివితేటలుండి, ఉత్సాహం ఉండి, బాగా చదువుకోవాలనే కోరిక ఉండి తను, తమ్ముడు ఇబ్బందులు పడ్డారు. చదువుకి స్వస్తి పలికి, బ్యాంక్ పరీక్షలు రాసి సెలక్టయ్యాడు తను.

తమ్ముడు అలిగి, ఇంట్లో నుండి వెళ్ళిపోయి, ఫ్రెండ్స్ సహాయంతో, బ్యాంక్‌లోన్ తీసుకొని ఇంటర్‌నెట్ సెంటర్ పెట్టాడు. తను ఉద్యోగంలో చేరాక, వాడి బయటి అప్పులు తీర్చాడు.

"అక్కకి, వాళ్ళకి ఫోన్ చేశావా? ప్రదీప్ అడిగాడు. ఊ..." అన్నాడు ప్రసాద్.

భారతక్క అదృష్టవంతురాలురా! బావగారు చెన్నై కంపెనీలో పని చేస్తున్నారు.

మిగిలిన ఇద్దరు చెల్లెళ్ళనూ తలుచుకుంటే బాధ కలుగుతుంది.

ఇద్దరు పిల్లలున్న టీచర్‌కి భార్యపోతే, శ్రీలక్ష్మిని ఇచ్చి చేశారు. రెండో పెళ్ళి అయినా అతడు కట్నం కావాలంటే, యాభై వేలు చేతిలో పెట్టారు.

మాధవి ఒంటరిగా హైదరాబాద్‌లో చిన్న ఉద్యోగం చేస్తోంది. తల్లి దాని దగ్గరే ఉంది.

ఒక మనిషి వ్యసనం కుటుంబాన్నే భ్రష్టు పట్టించింది. ఇంటి యజమానికి బలహీనత ఉంటే కుటుంబం నవ్వుల పాలవుతుంది. దారి తప్పుతుంది.

రాజమండ్రిలో పేరున్న లాయర్ తన తండ్రి నారాయణరావు. కేసు గెలిచినప్పుడల్లా ఇంట్లో పండుగే! అమ్మను అందలం ఎక్కించడమే!

"భాగ్యలక్ష్మీ! నువ్వు నా అర్ధాంగివి మాత్రమే కాదు. నా భాగ్యదేవతవి" అంటూ అమ్మను పొగుడుతూంటే అమ్మ సిగ్గుపడేది.

దబ్బపండులాంటి శరీరఛాయతో, చక్కని రూపురేఖలతో అమ్మ అమాయకంగా ఉండేది. ఆవిడకి అమాయకమే ఆభరణం. నాన్నగారి మాటే వేదం.

"భాగ్యం! ముగ్గురు అమ్మాయిలను, ఇద్దరే అబ్బాయిలను కన్నావు. ఆపరేషన్ చేయించుకోకపోతే మరొక అబ్బాయి పుట్టేవాడు కదా! ఆరుగురు పిల్లలతో నా జీవితం బలే ఉండేది" అనేవాడు నారాయణరావు భార్య బుగ్గపై చిటిక వేసి. ఆవిడ ఎవరన్నా చూస్తున్నారా అని చుట్టూ చూసేది. అదొక సరసాల సంసారం, సరాగాల దాంపత్య జీవనం.

పిల్లలు ఏవి అడిగినా, నారాయణరావు సాయంత్రానికి తెచ్చి ఇచ్చేవారు. వాళ్ళతో ఆనందంగా కాలం గడిపేవారు.

ప్రసాద్‌ను, ప్రదీప్‌ను దగ్గర కూర్చోపెట్టుకొని, మీరు ఏం చదవాలనుకుంటున్నారు? అని అడిగేవారు.

ప్రసాద్ "నేను ఎం.ఎస్ చేస్తాను అంటే ప్రదీప్ నేను ఎం.టెక్ చదువుతాను" అనేవారు.

ఆయన భార్యను పిలిచేవారు. 'ఓయ్! భాగ్యలక్ష్మీ! ఇటు రావే! నీ పని ఎప్పుడూ ఉండేదేలే! ఇటు విను. నా కొడుకుల్లో ఒకరు డాక్టరు, ఒకరు ఇంజనీరు అవుతారట.

"చదువుకోండిరా! కసిగా చదువుకోండి. మిమ్మల్ని బాగా చదివించే బాధ్యత నాది" అంటూ తలలు నిమిరేవారు.

"అన్నయ్యలకేనా? మాకు చదువు చెప్పించరా?" శ్రీలక్ష్మి తండ్రిని అడిగేది.

ఆయన ఓరగా భార్యను చూస్తూ "మీ చదువులు మీ అమ్మ ఇష్టం. 'పెళ్ళి చేయండి' అందను కోండి. వయసు వచ్చాక, ఏ డిగ్రీయో అవగానే చేసేయాలి. అమ్మ మాట సుప్రీంకోర్టు తీర్పు అనుకోండి" అనేవారు.

ఆడపిల్లలు "అదేం కుదరదు. మేమూ పెద్ద చదువులు చదువుకుంటాం! ఆ తర్వాత పెళ్ళి మాట" అంటూ డిక్లేర్ చేసేవాళ్ళు.

అంతా బావుంది. అంతా సవ్యంగా జరుగుతోంది అనుకుంటుండగానే హాయిగా, సాఫీగా సాగుతున్న సంసారనౌక తుఫానులో చిక్కుకుంది.

తమ కుటుంబానికి ఎవరిదిష్టి తగిలిందో? తమ ఐశ్వర్యం, అంతస్తు చూసి ఎవరికి కళ్ళు కుట్టాయో!

అంతా మారిపోయింది. ఊహించని మార్పు. తమ కుటుంబాన్ని దెబ్బతీసిన మార్పు.

రోజులు సక్రమంగా నడుస్తాయి. వారాలు క్రమం తప్పవు. నెలలు సాఫీగా గడిచిపోతాయి.

మనిషి మాత్రం ఎందుకు సక్రమంగా ప్రవర్తించడు? గాలి ఎటు వీస్తే అటు వెళ్ళిపోతే, అతడి ఉనికికి, వ్యక్తిత్వానికి అర్థం ఏమిటి?

ఒక యజమానిపై ఎందరు ఆధారపడతారు? ఎందరి జీవితాలు ముడిపడి ఉంటాయి? ఎందరి కలలు, భద్రత ఆశ్రయించుకుని ఉంటాయి?

బయట ఏదో పెద్దగా చప్పుడైతే ప్రసాద్ ఈ లోకంలోకి వచ్చాడు. తమ్ముడి ఫోను అతడిని ఆలోచనలలోకి నెడితే, ఈ చప్పుడు బయటకు లాగింది.

గబగబా నడిచి, గేటు తీసి చూశాడు. ఎవరీ ఆడమనిషి? మొదలు నరికిన అరటిచెట్టులాగ పడి ఉంది. చలికి సాయం వాన ఎప్పుడు మొదలైందో?

తమ వీధిలో సాయంత్రం దాటితే అలికిడి తక్కువ. ఈ రాత్రివేళ, ఎనిమిది గంటల సమయంలో, ఈ వానలో, చలిలో ఎవరు దొరుకుతారు?

పెద్దావిడే! వయసు అరవైకి దగ్గర ఉండవచ్చును. ఆవిడ చేతిలోని వైరు బుట్ట ఆవిడకి కాస్త దూరంలో పడి ఉంది.

"ఏవండీ! ఏవండీ!" అంటూ పిలిచాడు. తన ఇంటి దగ్గర ట్యూబ్ లైట్‌కి దినదినగండమే! కాస్త దూరంలో నున్న ట్యూబ్‌లైట్ కాంతి, మసగ్గా పడుతోంది.

ఎవరో స్పృహతప్పి పడిపోయారు. అతడు పక్కింటి వెంకట్‌ను పిలుచుకొని వచ్చాడు. ఈలోపు రిక్షా ఒకటి వీధిలో నుండి వెళుతోంది. ఎవరో ఆడవాళ్ళు అందులో ఉన్నారు.

అయినా ఆపి, రిక్షావాడు, వెంకట్‌ల సాయంతో పడిపోయిన ఆవిడను ఇంట్లోకి చేర్చాడు.

"బాబుగారూ! అమ్మ ఒళ్ళు కాలిపోతోంది. జ్వరం బాగా ఉంది" అన్నాడు రిక్షావాడు.

మొత్తానికి ఆవిడను పక్కనున్న పిల్లల గదిలోని మంచం మీదకి చేర్చాడు. వెంకట్‌ను వెళ్ళి డాక్టర్‌ను తీసుకుని రమ్మన్నాడు.

అప్పుడు... అప్పుడు చూశాడు ఆవిడను. అతడి గుండె రెట్టింపు వేగంతో కొట్టుకోసాగింది.

ఈవిడా? ఈ శ్యామలమ్మగారా తన గుమ్మం ముందు పడిపోయింది? అతడు కంపించిపోయాడు.

డాక్టర్‌గారు వచ్చారు. "మైగాడ్! అంత జ్వరం ఉన్న మనిషిని తడి బట్టలతో వదిలేశారా?" చివాట్లు పెట్టాడు.

బీరువా తెరిచిన ప్రసాద్‌కు తల్లి అరలోని చీరను తీసే ధైర్యం లేకపోయింది. భార్య కాటన్ చీర, జాకెట్ తీసి, వెంకట్ అమ్మగారిని పిలిపించాడు.

ఆవిడ లోపలకు వెళ్ళి ఎలాగో బట్టలు మార్చింది. "జ్వరం చూస్తే 104 ఫారెన్ హీట్ ఉంది. ఇంజక్షన్లు చేశాను. రాత్రికి కనిపెట్టుకొని ఉండండి. జ్వరం ఎక్కువైతే ఫోన్ చేయండి' అంటూ మందులు రాసిచ్చి వెళ్ళారు డాక్టర్‌గారు.

నేను డబ్బులిస్తే, వెంకట్ మందులకు వెళ్ళాడు. ఆవిడను ఇంట్లోకి తెచ్చినప్పుడే శ్యామలగారని గుర్తించి, నా మనసు వణికిపోయింది.

"ఆవిడ అదృష్టవంతురాలు. లేకపోతే ముక్కూ మొహం తెలియని ఆవిడకి ఇలాగ వైద్యం చేయిస్తారా? పాలు ఉన్నాయా?" అడిగారు వెంకట్ అమ్మగారు.

ప్రసాద్ తలూపాడు. అవసరం అనుకుంటే వెంకట్ రాత్రి పడుకోవడానికి వస్తాడని చెప్పి, ఆవిడ వెళ్ళారు.

మాత్రలు తెచ్చిన వెంకట్‌కి వేడినీళ్ళు అందించాను. అతడు ఆవిడ చేత మాత్రలు మింగించాడు.



రాత్రి నేను చూస్తానని, అవసరం అయితే పిలుస్తానని వెంకట్‌ను పంపేశాను.

గోడకి కొట్టిన బంతిలాగ నాకు చపాతీలు, కూర పట్టుకుని వచ్చాడు. తర్వాత తింటానన్నా వదలలేదు.

వెంకట్ వెళ్ళాక, తలుపులు మూసి, ఆ గది లోకి వెళ్ళాను. శ్యామలగారు ఒంటిమీద తెలివి లేకుండా పడి ఉన్నారు.

నా కళ్ళు ఆవిడను విభ్రాంతిగా చూస్తున్నాయి. ఇన్నేళ్ళకి ఇలాగ, ఇంత దీనంగా ఈవిడ కన్పిస్తుం దనుకోలేదు.

నాన్నగారు పోయిన తర్వాత ఆవిడ గొడవే మరిచిపోయాం.

విజయవాడ వెళ్ళిపోయిందని ఎవరో చెప్పారు. మళ్ళీ ఈ రాజమండ్రిలో ఈవిడ దర్శనం ఇస్తుం దనుకోలేదు.

నా బాధను ఎవరితోనైనా పంచుకోవాలని ఉంది. ప్రదీప్‌కు ఫోను చెయ్యబోయి ఆగి పోయాను.

ఆవిడను ఇంట్లోకి ఎందుకు తెచ్చావురా? అని అరుస్తాడు.

శ్యామల రాక ప్రసాద్‌ను ఊపిరాడనట్లు చేస్తోంది. ఆవిడ కనబడేలాగ, సోఫాలో గోడకి చేరబడేలాగ కూర్చున్నాడు. ఒకప్పటి శ్యామల రూపం అతడి కళ్ళముందు కదిలింది.

ఒక్క ఆడదాని వల్ల, తన కుటుంబం అస్తవ్య స్తమైంది. కుటుంబం వీధి పాలైంది.

అంతటికీ కారణం చెల్లి శ్రీలక్ష్మికి వీణ నేర్చు కోవాలనే కోరిక కలగడమే.

నాన్నగారి ఒడిలో పడుకొని, గారాలుపోతూ శ్రీలక్ష్మి అడిగింది. "నాన్నగారూ, మా ఫ్రెండ్స్ ఇద్దరు సంగీతం నేర్చుకుంటున్నారు. టీచర్‌గారికి వీణ, గాత్రం రెండూ వచ్చు. ఎవరికి ఏం కావాలో అది నేర్పుతారు. నేను వీణ నేర్చుకుంటానండీ!"

వెంటనే ఆరవ తరగతిలో చేరిన మాధవి



కూడా "నాన్నగారు, నేనూ వీణ నేర్చుకుంటాను" అంది.

"మీ చదువులు పాడవుతాయి. అక్క, నువ్వు బాగా చదవాలి కదా?" అంది భాగ్యలక్ష్మి.

"సాయంత్రం వేళ నేర్పుతారమ్మా! అక్కతో పాటు సాయంత్రం ఏడు గంటల నుండి నేనూ కూర్చొని చదువుతాను. మాట ఇస్తున్నాను. వీణ నేర్చుకుంటాను. ప్లీజ్ నాన్నగారూ! ఒప్పుకోండి" అంది శ్రీలక్ష్మి.

"ఇద్దరూ నేర్చుకుంటున్నారు కనుక మేడమ్ గారు ఇంటికి వచ్చి నేర్పుతారేమో అడగండి. నేను వింటూ ఉండవచ్చును. ఇంటర్‌లో చేరిన నాకు వీలవదు" అంది భారతి.

పిల్లలందరూ చదువులతో ఉన్నారు. ప్రసాద్ డిగ్రీ చదవనని, బి.టెక్‌లో చేరతానని చెప్పాడు.

మర్నాడు శ్రీలక్ష్మి గెంతులు. శ్యామలా మేమ్

**రాత్రివేళ ఎవరో స్త్రీ అతడి గుమ్మం ముందు స్పృహతప్పి పడిపోయింది. ఇంట్లోకి జేర్చాడామెను. డాక్టర్‌ని పిలిపించాడు. సపర్యలు చేశాడతను. ఆమె ఎవరో లీలగా అతడికి జ్ఞాపకం వచ్చింది. ఆగ్రహం, ఆవేశం, ఆవేదన, అడుగంటిపోయిన గతం ఒక్కసారిగా అతడిలో సుడులు తిరిగాయి. మెలకువ వచ్చాక అతడామెను ఏం చేశాడు? ఆమెపై ప్రతీకారం తీర్చుకున్నాడా? ఆమె ఏం సమాధానం చెప్పింది?**

ఇంటికి వచ్చి, చెపుతానన్నారన్న వార్త మోసుకొని వచ్చింది.

మంచిరోజు చూసుకొని శ్యామల నారాయణ రావుగారి ఇంటిలో కాలు పెట్టింది.

కనకాంబరం రంగు వర్క్ చీరపై గోల్డ్‌థ్రెడ్ వర్క్, గోల్డు కలర్ డిజైనరీ బ్లౌజ్ వేసుకొని, కాస్త నలుపురంగు అయినా చాలా విశాలమైన కనుదో యితో, మెడలో కాస్త బలంగా ఉండే కొబ్బరిపువ్వు గొలుసుతో ఆడంబరంగా వచ్చింది శ్యామల.

భాగ్యలక్ష్మి పిల్లల చేత పండ్లు, తమల పాకులు, చెక్కలు పెట్టి, జాకెట్ గుడ్డలు, దక్షిణ పెట్టి, శ్యామలకి నమస్కారం చేయించింది. కాఫీ తెచ్చి ఇచ్చింది.

"నా దగ్గర రెండు వీణలున్నాయి. ఒకటి ఇక్కడ ఉంచుతాను. పిల్లలకి కాస్త బాగా వచ్చాక

**ప్రపంచంలో అత్యంత విషపూరితమైన, పెద్ద పెద్ద సాలీళ్ళు ఆస్ట్రేలియాలో లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి.**

కొత్తది కొందాం" అంది శ్యామల. పిల్లలిద్దరికీ సంగీతం గొప్పతనం వివరించి, సరళీస్వరాలు ప్రారంభించారు. ఈలోపు నారాయణరావు వచ్చాడు.

అందమైన, ఠీవి అయిన ఆయన రూపం చూస్తే శ్యామలలో కలకలం రేగింది. ఆయన తన గదిలోకి వెళ్ళారు.

మీరు కూడా బాగా శ్రద్ధగా నేర్చుకున్నారు. నా లాగ ఇలాగ వీణ వాయించగలరు అంటూ "శ్రీ గణపతిని సేవింపరారే -శ్రిత మానవులారా" అంటూ సౌరాష్ట్ర రాగం వాయించింది.

గదిలోకి కాఫీ తెచ్చిన భార్యను చూసి "మేడమ్ చాలా బాగా వాయించారు కదూ" అన్నాడు.

"మన అమ్మాయిలు కూడా అంత బాగా వాయించగలిగేలా కృషి చేయాలి" అంది భాగ్య లక్ష్మి.

శ్రీలక్ష్మిని చూస్తూ "మీ వాళ్ళను నాకు పరి చయం చేయవా?" అని శ్యామల నవ్వుతూ అడి గింది.

శ్రీలక్ష్మి మామ్మను, తల్లిని పిలిచింది. అక్క భారతి అంతలో అటు రాగానే పరిచయం చేసింది.

"మరి మీ అన్నయ్యలు, నాన్నగారు...' అంది శ్యామల. మగ పిల్లలు బయటికి వెళ్ళారు. ముక్త సరిగా అంది సరస్వతమ్మ.

"నారాయణరావు, భార్యను పిలిచాడు. అటు వెడుతున్న భాగ్యలక్ష్మి వైపు కన్నార్పకుండా చూసింది శ్యామల.

మర్నాడు కాస్త ఆలస్యంగా వచ్చింది. పేపర్ చదువుతూ హాలులో కూర్చుంది. పిల్లల గదిలోకి వెళ్ళలేదు.

నారాయణరావు రావడం, ఆమె నమస్కారం చేసి, తనని పరిచయం చేసుకోవడం జరిగింది.

"మీ పాట నిన్ననే విన్నాను. నా భార్యకి మా పాపలకు నేర్పించాలని కోరిక" అన్నాడు.

"ఆవిడకే కానీ మీకు లేదా?" అంటూ పలు చగా నవ్వింది. "నా పాట మీకు నచ్చిందో, లేదో నని రాత్రంతా నాకు నిద్ర పట్టలేదు" అంది.

నారాయణరావు నొచ్చుకున్నాడు. 'అపర సర స్వతీదేవి లాగ వీణ వాయించారు. నాకు సంగీతం అంటే చాలా ఇష్టం" అన్నాడు.

అంతలో శ్రీలక్ష్మి వచ్చి ఆవిడను పిలిచింది "రండి మేడమ్" అంటూ.

"పిల్లలు మళ్ళీ చదువుకోవాలి కదా, వెళ్ళమ్మా" అంది సరస్వతమ్మ.

పిల్లలకు పాఠం పూర్తిచేసి, "ఎందరో మహాను భావులందరికీ వందనము" అంటూ కీర్తన వాయించసాగింది.

నారాయణరావు, తల్లితో "అమ్మా! మంచి మేడమ్ దొరికారు కదూ, చాలా మంచి విద్వాంసు రాలు" అన్నాడు.

భాగ్యలక్ష్మికి మాయామర్మాలు తెలియవు. ఇంట్లో చేసిన టిఫిన్, కాఫీ శ్యామలకి అందించేది. సరస్వతమ్మ ఘటికురాలే.

పిల్లలకి చదువు చెపితే చాలమ్మా, రోజూ మా కోసం వాయించనక్కరలేదు. పాఠాలు చెప్పు చాలు. రోజూ వాయించాలంటే నీకు కష్టం కదా? అంది.

మీరు, మీ కోడలు, అబ్బాయి వంటి సంగీత ప్రియులకు విన్పించాలని నా తపన అండీ!

నారాయణరావుతో తన కష్టసుఖాలు చెప్పు కునేంత వరకూ పరిచయం పెంచుకుంది.

ఇద్దరు అమ్మాయిలు, ఒక అబ్బాయి... భర్త పోయాడు. పిల్లలు తల్లి చెప్పినట్లు వింటారు. భర్త హార్ట్ ఎటాక్ వచ్చి పోయాడు.

నారాయణరావు మనసు జాలితో నిండి పోయింది. 'మా భాగ్యలక్ష్మికి కూడా గాత్రం నేర్పండి" అన్నాడు నవ్వుతూ.

"ఏమిటి భాగ్యలక్ష్మిగారూ! నేర్చుకుంటారా?"

శ్యామల నవ్వుతూ అడిగింది.

"నాకు తీరికెక్కడ? ఆయనకి, పిల్లలకి అంతా చూసేసరికి కాలం అయిపోతుంది" అంది.

"పోనీ! మీరు నేర్చుకోండి" అంది శ్యామల చిలిపిగా నవ్వుతూ! "విని ఆనందించడమే కానీ నా వల్ల కాదు" అన్నాడు.

"ఇక్కడ పిల్లల చదువులకు ఇబ్బంది. మా ఇంటికి రండి" కావలసినన్ని పాడి విన్పిస్తాను" అంది.

శ్యామల ఎత్తుగా ఉంటుంది. తీర్చిదిద్దినట్లుండే శరీరం, చాలా ఆకర్షణీయంగా ఉంటుంది.

ఏ విషయమైనా ఊరందరికీ తెలిశాకే ఇంట్లో తెలుస్తుంది.

శ్రీలక్ష్మి బిక్కమొహం వేసుకొని, ఏడుస్తూ వచ్చింది. నాలుగునెలల కాలంలో ఆ పిల్లకి మేడమ్ మీద కోపం వచ్చింది.

"మా ఫ్రెండ్స్ చెప్పారు. నాన్నగారు సంగీతం మేడమ్ ఇంటికి వెళుతున్నారట. నాన్నగారు ఆవిడను ఎక్కించుకొని కారులో తిప్పుతున్నారట.

భాగ్యలక్ష్మి రాతిబొమ్మ అయింది. శ్రీలక్ష్మి "నాకు ఈ మేడమ్ వద్దు. వీణ వద్దు. నాన్నని వాళ్ళ ఇంటికి వెళ్ళవద్దను" అంటూ ఏడ్చింది.

"ఈ మధ్య రాత్రిళ్ళు ఆలస్యంగా వస్తున్నాడు. ఇదా వీడు చేస్తున్న నిర్వాకం. రానీ!" అంది సరస్వతమ్మ.

గంధం, ఆకుపచ్చ రంగుల సమ్మేళనలో తయారైన వెండి జరీచీర, ఆకుపచ్చ జాకెట్ ధరించి, మెడలో గొలుసు పక్కన ఒంటిపేట ముత్యాల హారం ధరించి, హుషారుగా శ్యామల వచ్చింది.

"మాధవీ, లక్ష్మీ రెడీగా ఉన్నారా? 'వరవీణ మృదుపాణీ' ప్రాక్టీస్ చేశారా?" అంటూ వస్తున్న శ్యామలను "నువ్వూ ఫో... మా ఇంటికి రావద్దు" అంటూ అరిచింది శ్రీలక్ష్మి.

"మీకు ఏమైంది? పదండి" అంటున్న శ్యామలను సరస్వతమ్మ ఆపుతూ అంది "మా ఇంటికి పిల్లలకు విద్య నేర్పడానికి వచ్చావా? నా కొడుకును నీ ఇంట్లో ఉంచుకోవడానికి వస్తున్నావా? పో... నీ మొహం చూపించకు. పచ్చటి ఇంట్లో నిప్పు పెట్టావు. నువ్వు నాశనం అయిపోతావు."

శ్యామల విసవిసా వెళ్ళిపోయింది. రాత్రి తొమ్మిది గంటలకు ఇల్లు చేరిన నారాయణరావుని తల్లి నిలదీసింది.

"మనిషి జన్మ ఎత్తావా? పశువ్వా? ఐదుగురు బిడ్డలనుకని, భార్య పట్ల ద్రోహం చేస్తావా? నీకు మరొక ఆడదానిపై కోరిక బయలుదేరిందా? ఎంత సిగ్గులేని జన్మరా?" అంటూ తిట్టింది.

"అమ్మా! అది నా వ్యక్తిగత విషయం. మిమ్మల్ని పోషించనని చెప్పానా? నన్ను ఎవరూ నిలదీయనక్కర లేదు" అంటూ ఎగిరాడు.

నీళ్ళు నిండిన అమాయకమైన కళ్ళు ఆయన వైపు చూశాయి. భాగ్యలక్ష్మి రెండు వాడి బాణాల మొనలను, ఆయన మనసుకి గుచ్చిందా అన్పించిందాయనకి.

పిల్లల చదువులు, బ్రతుకులు అస్తవ్యస్తమయ్యాయి. పిల్లలు ఎదురు తిరిగి ప్రశ్నించినా, నిలదీసినా ఆయన చలించలేదు.

భాగ్యలక్ష్మి భర్త చేతిలో దెబ్బలు తింది. తిట్లు తింది. కానీ ఆవిడ పడక పిల్లలగది దగ్గరే నిశ్చలంగా ఉండిపోయింది.

శ్యామల జీవితం, వైభోగం నాలుగు రోజులు నలుగురూ చెప్పుకున్నాక మామూలై పోయింది.

ఒక వ్యక్తి బలహీనత కుటుంబాన్ని నవ్వుల పాలు చేసింది. అగచాట్లపాలు చేసింది. శ్యామల ఆస్తిమంతురాలైంది.

శ్యామల మూల్గడంతో ప్రసాద్ ఆలోచనల నుండి బయటపడ్డాడు. మాత్రలు వేసి, హార్లిక్సు పోసి మళ్ళీ పడుకోబెట్టాడు.

మర్నాటి ఉదయం జ్వరం కొంచెం తగ్గడంతో, శ్యామలకి ఒంటిమీదకి తెలివి వచ్చింది. డాక్టరు గారు వచ్చి ఇంజక్షన్లు చేసి వెళ్ళారు. హార్లిక్సు కలిపి, తీసుకొచ్చి, ఆవిడను లేపి, తాగించాడు ప్రసాద్. ఆవిడ చూపులు ప్రసాద్‌ను పరికించి చూశాయి. అతడి మొహం ప్రశాంతంగా ఉంది. ఆవిడ చూపులు వాలిపోయాయి.

సాయంత్రం శక్తినంతా కూడదీసుకొని శ్యామల మంచం మీద నుంచి లేచింది. కళ్ళు గిర్రున తిరిగాయి.

ప్రసాద్‌కు ముందు రోజు రాత్రి నుండి మనసులో కోపం, బాధ, అసహ్యం, కసి చెలరేగాయి.

హార్ట్ ఎటాక్‌తో పోయిన తండ్రి శవాన్ని శ్యామల ఇంటి నుండి తీసుకొని వచ్చిన క్షణాలు గుర్తు వచ్చాయి.

మోడులాగ బ్రతుకుతున్న తల్లి రూపం కళ్ళ ముందు నిలిచింది. పక్షవాతంతో మంచానపడి, కొడుకుని చూడటానికి కూడా ఇష్టపడని, తల్లినే అక్కున చేర్చుకొని బ్రతికిన మామ్మ గుర్తు వచ్చింది. బాబయ్యే ఆవిడ కోరిక మేరకు దహనం చేశాడు.

ఎందుకు తాను ఇంకా శ్యామలను ఇంట్లో ఉంచి వైద్యం చేయిస్తున్నాడు? ప్రసాద్ అసహనంగా ఆవిడ పడుకున్నవైపు నడిచాడు.

కానీ... అంతలో అతడి మనసులో అనూహ్యమైన మార్పు. ఆవిడ శ్యామల కాకుండా మరొకరు అయితే తాను 'సేవ' చేయడా? అసహాయ స్థితిలో, అనారోగ్యంతో ఉన్నప్పుడు ఆవిడ శ్యామల అయినా సరే సహాయపడాలి. అంతే! అదే మానవత్వం.

పనిపిల్ల వచ్చి "బాబుగారూ! ఆ అమ్మగారు ఎల్లిపోతానంటున్నారు" అంటూ పిలిచింది. ప్రసాద్ అటువైపు నడిచాడు.

"మీ కుటుంబానికి ద్రోహం చేశాను. ఆ పాపం నన్ను శిక్షించింది. నా పిల్లలు, నేను బెంగళూర్ వెళ్ళాం. వస్తూంటే మా బస్సుకి ఏక్సిడెంటై పిల్లలు ముగ్గురూ పోయారు.

నేను రెండు నెలలు హాస్పిటల్‌లో పడి ఉన్నాను. నా చెయ్యి విరిగిపోయింది. ఆపరేషన్ చేసి మూడు ముక్కలూ అతికించారు.

"ఒక కుటుంబాన్ని కష్టాలపాలు చేస్తే భగవంతుడు క్షమించడు" అనడానికి నేనే ఉదాహరణ. నా జీవితమే ఒక పాఠం.

పెద్ద మనసుతో నువ్వు ఆశ్రయమిచ్చావు. డాక్టర్‌ను పిలిచి, సేవలు చేశావు. నేను వెళుతున్నాను. నూరేళ్ళు చల్లగా, పిల్లాపాపలతో బ్రతుకు బాబూ! నాలాంటిదాన్ని ఆదరించడానికి ఎంతో గొప్ప మనసు, మానవత్వం కావాలి" అంటూ శ్యామల అతడివైపు చూసింది.

"పూర్తిగా నయమయ్యాక వెళ్ళండి" అంటున్న అతడిని ఆప్యాయంగా చూసి, వృద్ధాశ్రమంలో ఉంటున్నాను. వృద్ధులకు నాలుగు పాటలు పాడి విన్పిస్తూ ఉంటాను" అని చెప్పి కోవెలకని జ్వరంగా ఉన్నా బయలుదేరాను. ఇది నా పాలిట కోవెలయే!" అంటూ పని పిల్లను సాయంగా తీసుకొని, శ్యామల బయలుదేరింది.

మానవత్వానికి ప్రతీకగా నిలిచిన ప్రసాద్‌ను చూస్తూ, "నువ్వు క్షమించినా, నా మనసు క్షమించడం లేదు బాబూ! నీ ఎదుట నిలబడలేక, వెళ్ళిపోతున్నాను" అని మనసులో అనుకుంది శ్యామల.

*సెల్:98660 58449*

## ఇప్పుడు అన్నీ చేస్తున్నా



కంగనా నోటి వెంట వచ్చిన ఈ మాట కొందరిని షాక్‌కి గురిచేసింది. కాకపోతే కంగనా మాటల్లో అసభ్యత, అశ్లీలత ఏమీ లేవు. బాలీవుడ్‌కి వచ్చిన తరువాత చాలా సంవత్సరాల వరకూ పార్టీల్లో డ్యాన్సులు, స్టేజీ పర్‌ఫార్మెన్స్‌లు ఇవ్వడానికి ఇష్టపడేది కాదట! కానీ ఇప్పుడు మనసు మార్చుకుని గత రెండు మూడు సంవత్సరాలుగా పై రెండు పనులూ చేస్తున్నానని చెప్పుకొచ్చింది. ఈ పనుల్లో డబ్బు సంపాదన కన్నా సంతోషం పాలు కొద్దిగా ఎక్కువగా కనిపించడంతో వీటికి సై అంటోందట! ఈ విధంగా డ్యాన్సులు చేయడం వలన సంతోషం కలుగుతుందని ముందే తెలుసుకుని ఉంటే బాగుండేది కదా? అని కొద్దిగా విచారంగా కూడా ఉందట!




# క్రూర నియంతలు కళా హృదయాలు

**కడెవెడంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువ అంటారు! బంగారు పళ్ళెరానికైనా గోడ చేర్పు ఉండాలంటారు! ఎంత గొప్పవాడైనా ఎక్కడో అక్కడ లొంగిపోవాల్సిందే! ఎంతటి మహానుభావుడిలోనైనా ఏదో ఒక బలహీనత, భయం ఉంటూనే ఉంటుంది. ప్రపంచాన్ని గడగడలాడించే నియంతలో అయినా, పరమవీరచక్ర అందుకునే సాహసయోధుడిలో అయినా సున్నితమైన కళాకారుడో, చిత్రకారుడో దాగునే ఉంటాడు.**

హిట్లర్ వంటి ఫాసిస్టు నియంతల్లో గొప్ప సృజనాత్మక శక్తులున్నాయంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఈ కోవకు చెందినవారిలో బలహీనతలు, అసహ్యకరమైన అలవాట్లు కూడా ఎన్నో ఉంటాయి. అవన్నీ చదివితే ఔరా! ఇదన్నమాట వీళ్ళ రెండో యాంగిల్! అనిపించక మానదు. అదేమిటో మీరూ తెలుసుకోండి!

### ఐలవ్యూ చెప్పేందుకు భయపడిన హిట్లర్!

జర్మన్ నియంత అడాల్ఫ్ హిట్లర్. అతన్ని వ్యతిరేకించేవారు చాలామందే ఉండొచ్చు. కానీ సమర్థించేవారు ఇప్పుడు చాలామంది బయలుదేరారు. లక్షలాదిమందిని గ్యాస్ ఛాంబర్స్‌లో తోసి హతమార్చిన ఈ ఫాసిస్టు నాయకుడు కూడా ప్రేమలో పడ్డాడంటే నమ్మశక్యం కాదు! అతడి మొదటి ప్రేమికురాలు ఓ యూదు అమ్మాయి! హిట్లర్ ప్రపంచాన్నైతే గడగడలాడించాడుగానీ, ఈ అమ్మాయికి మాత్రం ఐ లవ్ యూ చెప్పలేక పోయాడట! మనసులోని ప్రేమ భావనను ఆ అమ్మాయి ముందు చెప్పడానికి అతడికి ధైర్యం చాలలేదట. ఆశ్చర్యంగా ఉందికదూ! కానీ ఇది అక్షర సత్యం. అందుకే ఆ అమ్మాయిని పెళ్లి చేసుకోలేకపోయాడట. ఎంత మొనగాడికైనాగానీ, అమ్మాయికి ఐ లవ్యూ చెప్పాలంటే గట్స్ కావాల్సిందే మరి!

### చిత్రకారుడు హిట్లర్

పుట్టుకతోనే ఏ వ్యక్తీ నియంత కాలేడు. విద్యార్థిగా హిట్లర్‌లో ఎన్నో క్వాలిటీలుండేవి. అతడొక ఆర్ట్స్ విద్యార్థి. మంచి చిత్రకారుడుగా అతడికి పేరుండేది. వాల్ట్ డిస్నీ అంటే ఎంతో ఇష్టపడేవాడు హిట్లర్. అందుకే ఖాళీ సమయం దొరికిందంటే చాలు డిస్నీ బొమ్మలు గీస్తూ కాలం గడిపేవాడట.

### ముస్సోలిని విచిత్ర అలవాటు

జాతీయ ఉన్మాదాన్ని రెచ్చగొట్టిన ఇటలీ నియంత ముస్సోలిని. హిట్లర్ తర్వాత ఇతడే అగ్రగణ్యుడు. 1922లో ఇటలీ ప్రధానమంత్రిగా ఎన్నికై హిట్లర్‌తో చేతులు కలిపి రెండవ ప్రపంచ యుద్ధానికి కారకుడయ్యాడు. ఇటలీకి విజయాలు



కూడా సాధించిపెట్టాడు ముస్సోలిని. దేశ వైభవాన్ని పెంచాడు. దురదృష్టవశాత్తు ఇతడి మనుషులే ఇతన్ని కాల్చి చంపారు. ముస్సోలినికి ఒక విచిత్రమైన అలవాటు ఉండేదట అతని ముక్కులో ఉండలుగా ఏర్పడే వ్యర్థాన్ని తీసుకుని తినేవాడట. జుగుప్సగా అనిపించే ఈ అలవాటువల్ల సన్నిహితులు అతన్ని అసహ్యించుకునేవారట.

### రొమాంటిక్ నవలా రచయిత సద్దాం!

అమెరికా మిత్రసేనల దాడిలో పదవీచ్యుతుడై, ఉరికంబం ఎక్కిన ఇరాక్ దేశాధ్యక్షుడు సద్దాం హుస్సేన్. అగ్రరాజ్యాన్ని ముప్పుతిప్పలు పెట్టినవాడు, బాత్‌పార్టీకి చివరి నాయకుడు. సద్దాం హుస్సేన్ సైద్ధాంతిక భావజాలం ఎలా ఉన్నప్పటికీ, అంతటి క్రూరుడిలో కూడా రొమాంటిక్ యాంగిల్ ఉంటుందని ఎవరూ ఊహించలేరేమో! రొమాంటిక్ నవలలు రాయడమంటే సద్దాంకి ఎంతో ఇష్టమని తెలిస్తే మనం ఆశ్చర్యపోతాం. ఇరాక్ చరిత్ర ఆధారంగా 'జబీబా అండ్ ది కింగ్' అనే ఓ నవల కూడా రాశాడు. ఒక క్రూరమైన భర్త అందమైన భార్యపై చేసిన అత్యాచారానికి అద్దంపట్టిన నవలిది. సద్దాం దగ్గర ఓ ప్రత్యేకమైన కారు ఉండేదట. వాతావరణ పరిస్థితులకు అనుగుణంగా మార్పులు చేర్పులు చేసుకునే సౌకర్యవంతమైన వ్యవస్థ ఆ కారులో ఉండేది. ముదురు ఎరుపు రంగులో ఉండే ఆ కారును ఇటీవలే బాగ్దాద్‌లో వేలం వేశారు.

### నగ్నరూపాలు చిత్రించే స్టాలిన్

హిట్లర్ తరహాలోనే రష్యా నియంత స్టాలిన్‌కి కూడా బొమ్మలు గీయడం అంటే ఎంతో ఇష్టం. స్టాలిన్ పూర్తిపేరు జోసఫ్ విస్సారినోవిక్ స్టాలిన్.



ఇతని ఆదేశాలతో లక్షలాదిమంది నిర్దాక్షిణ్యంగా హతులయ్యారు. అయినాగానీ అగ్రదేశాలు అసూయపడే స్థాయిలో రష్యాను గొప్ప సోషలిస్టు దేశంగా తీర్చిదిద్దాడు. స్టాలిన్ ప్రవర్తనను కొందరు అసహ్యించుకుంటే మరికొందరు దైవంగా పూజించేవారు. స్టాలిన్‌కు ఒక విచిత్రమైన అలవాటు ఉండేది. స్టాలిన్ ఎప్పుడూ నగ్నంగా ఉండే పురుషుడి చిత్రాన్ని గీసేవాడు. స్వచ్ఛమైన నగ్నరూపాన్ని గీయడానికే స్టాలిన్ ఇష్టపడేవాడట. ఇదేమి వింత అలవాటో కదా!

-హర్షిణి దేవళ్ల

# గ్యాస్ట్రిక్ అల్సర్

ఈ మధ్యకాలంలో ఆరోగ్యసమస్యలను మనం వ్యాధులుగా పరిగణించడం అనుకుంటే జీవన శైలి లోపాలుగా చెప్పడం సబబుగా ఉంటుంది. అలాంటి జీవనశైలి, ఆహారపు అలవాట్లు ప్రధాన కారణంగా జీర్ణకోశ సమస్యలు ముఖ్యంగా గ్యాస్ట్రిక్ అల్సర్ ప్రధానంగా చెప్పవచ్చు. శరీరంలో ఒక నిర్ణీత పరిమాణంలో ఆమ్లం ఉండడం అవసరం. అందుకే ఆమ్లం ఎక్కువైతేనే కాదు తక్కువైనప్పుడు కూడా అల్సర్లు తయార వుతాయి. జీర్ణాశయంలో ఏర్పడే అల్సర్‌ని గ్యాస్ట్రిక్ అల్సర్ అంటారు. హెలికోబ్యాక్టర్ పైలోరి అనే బ్యాక్టీరియా అయినా కడుపులోని ఆమ్లంతో చనిపోతుంది. కానీ ఈ ఒక్క బ్యాక్టీరియా మాత్రమే ఆమ్లాన్ని తట్టుకుని జీవిస్తుంది. పైగా ఆమ్లం అధిక ఉత్పత్తికి కూడా దోహదం చేస్తుంది. ఫలితంగా జీర్ణాశయ అల్సర్లు మొదలవుతాయి. గ్యాస్ట్రిక్ల్ అల్సర్ ముఖ్యంగా 60 ఏళ్ళ వయసులో ఏక్కువగా వస్తుంది. ప్రపంచ జనాభాలో 35% - 40% గ్యాస్ట్రిక్ సమస్యలతో బాధపడుతున్నారని ఒక అంచనా. 30% మంది గ్యాస్ట్రిక్ అల్సర్‌తో బాధపడుతున్నారు. ఇందులో ముఖ్యంగా స్త్రీలు దీని బారిన బాధపడుతున్నారు.

**కారణాలు:** 80% మందిలో బ్యాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వలన అల్సర్లు వస్తాయి. చాలా మందిలో కడుపులో పుండ్లు రావడానికి హెలికోబ్యాక్టర్ పైలోరి అనే బ్యాక్టీరియా ముఖ్యమైన కారణం. మానసిక ఒత్తిడి, కారం, మసాలాలు ఉన్న ఆహారం ఎక్కువ తీసుకోవడం, మధ్యపానం, పొగతాగడం. సమయానికీ సరైన ఆహారం తీసుకోకపోవడం. కలుషితమైన ఆహారం, నీరు వంటి వాటి ద్వారా మన శరీరంలో చేరి, జీర్ణవ్యవస్థలో విషపదార్థాలను విడుదల చేసి పుండ్లు రావడానికి కారణమవుతాయి.

**లక్షణాలు:** కడుపులో నొప్పి, మంట, ఉబ్బరం, ఛాతిలో నొప్పి, పుల్లటి త్రేన్పులు, మలబద్ధకం, తలనొప్పి, బరువుతగ్గడం, రక్తవాంతులు, రక్తవిరేచనాలు. కొంచెం తిన్నా కడుపు నిండినట్లు ఉండటం, ఆకలి తగ్గడం. నోటిలో ఎక్కువగా నీరు ఊరడం.



Gastric Ulcer

**వ్యాధి నిర్ధారణ:** ఎక్స్‌రే, ఎండోస్కోపి, రక్తపరీక్షలు, బయోప్సీ లేదా ముక్కుపరీక్ష, మలపరీక్షలు.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

**హోమియో చికిత్స:** గ్యాస్ట్రిక్ అల్సర్‌కి హోమియోపతిలో మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. హోమియోపతిలో జీర్ణకోశ సంబంధ ప్రత్యేక పరిశోధన చికిత్స విభాగం ఉంది. వ్యాధి నిర్మూలనకు కావలసిన కౌన్సిలింగ్ చేసి నవీన చికిత్సతో పాటు డైట్ సలహాలు ఇస్తారు. దాని వల్ల కాంప్లికేషన్స్‌ను అరికట్టడమే కాక స్వస్థత చేకూర్చి వ్యాధిని సమూలంగా నివారించవచ్చు. హోమియోపతిలో గ్యాస్ట్రిక్ అల్సర్‌కు ఆర్సనిక్ ఆల్బ్, ఆసిడ్ నైట్రికమ్, మెకసాల్, గ్రాఫైటీస్, ఫాస్ఫరస్ వంటి మందులు చక్కగా పనిచేస్తాయి. వీటిని అనుభవజ్ఞులైన హోమియో డాక్టర్ పర్యవేక్షణలో వాడాల్సి ఉంటుంది.

**www.starhomeo.com** | సికింద్రాబాద్ । కొత్తపేట । కూకట్‌పల్లి । వరంగల్ । గచ్చిబౌలి । విజయవాడ । తిరుపతి । వైజాగ్ । రాజమండ్రి । కర్నాటక | **© 90300 64224**

# సయాటికా (గుధ్రసీ వాతము)

ప్రస్తుత పరిస్థితిలో మానవుని జీవితం చాల యాంత్రికం గా మారిపోయింది. ముఖ్యంగా ఆహారపుఅలవాట్లు, దిన చర్య స్వప్నవిపర్యయం (పగటినిద్ర, రాత్రి సమయానికి నిద్రపోకపోవటం) లాంటి విషయాలలో అనేక మార్పులు రావటం వలన, ఆందోళన, మానసికఒత్తిడి లాంటి సమస్యల వలన మానవులనేక వ్యాధులబారిన పడుతు న్నారు. అందులో అతి ముఖ్యమైనది (నడుమునొప్పి) కటిశూల. నూటికి 90మంది తమ జీవితకాలంలో ఎప్పుడో ఒకసారి ఈనడుమునొప్పిసమస్యతో బాధ పడుతున్నారు. ఆయుర్వేద శాస్త్రంలో చరక, సుశ్రుత, వాగ్భటులు ఈ సమస్యను గుధ్రసీవాతం(సయాటికా)గా పేర్కొంటూ ఎంతో విపులంగా వివరించారు.

దీనికి సాధారణ కారణాలు పరిశీలించినట్లయితే... ఎక్కువగా ఒకే పొజిషన్‌లో కూర్చోవటం, స్థూల కాయం, అధికశ్రమతో కూడిన పనులు ఎక్కువ సేపు చేయటం, అధిక బరువులను మోయుటం, ఎక్కువ దూరం ద్విచక్ర వాహనాలు, కార్లలోప్రయాణించటం, కొన్ని దీర్ఘకాలిక వ్యాధులువలన, కొన్ని వంశపారం పర్య వ్యాధులవలన, మరికొన్ని రోడ్డుప్రమాదాల వలన ఈ నడుము నొప్పి సమస్య వస్తుంటుంది. ముఖ్యంగా పైన వివరించిన కారణాలవలన శరీరంలో వాతప్రకోపంజరిగి, ముందుగా పిరుదులకు పైభాగాన స్తబ్ధతను, నొప్పినికలిగించి తరువాత కటి ప్రదేశం (నడుము), తొడలు, మోకాళ్ళు పిక్కలు, పాదాలలో క్రమంగా నొప్పి కలుగుతుంది. దీనినే గుధ్రసీవాతాము (సయాటికా) అని అంటారు. ఈ సమస్య శీతాకాలంలో ఎక్కువ అవుతుంది. ముఖ్యంగా నడుముకు సంబంధించిన ఎల్4-ఎల్5, ఎస్1-ఎస్2 వెన్నుపూసల మధ్యగల సయాటికా అనే నరంపై ఒత్తిడి పడటం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**డిస్క్‌లో వచ్చేమార్పులు:** ఈ వ్యాధిలో వెన్నుపూసలమధ్య ఉండే డిస్క్‌లో కొన్ని మార్పుల జరుగుతాయి. అవి డిస్క్ మీద ఒత్తిడి పెరగటం, వాపురావటం లేదా డిస్క్‌కి రక్త ప్రసరణ సరిగా లేకపోవటం, అరిగిపోవటం అనే సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్క్‌లో వాపు వస్తే దానిలోఉండే చిక్కనిద్రవం బయటకు వచ్చి మేరుదండం లేదా దాన్నుంచి వచ్చే నరాలపై ఒత్తిడి కలిగించటం వల్ల నొప్పి వస్తుంది.

**లక్షణాలు:** నడుములో నొప్పి కలగటం, వాపు, కొంచెం శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగటం, ఈ నొప్పి సూదులతో గుచ్చినట్లుగా, ఒక్కోసారి తిమ్మిర్లు, మంటలతో కూడి ఉంటుంది. సమస్య తీవ్రమైనది అయితే స్పర్శహాని కూడా కలుగవచ్చు, ఒక్కోసారి మల మూత్రాలమీద నియంత్రణకూడా పోయేప్రమాదంఉంది. వెన్ను నొప్పి బాధ అనగానే సాధారణంగా పెయిన్‌కిల్లర్స్ తో కాలయాపన చేస్తుంటారు. దీనివల్ల తాత్కాలిక ఉప శమనం కల్గుతుంది. కాని మలబద్ధకం, జీర్ణా శయ సమస్యలు మొదలవుతాయి. కావున ఇలాంటి సమస్యల ను ప్రారంభదశలోనే గుర్తించి, జాగ్రత్త పడటం వల్ల ఈ వ్యాధిని సమూలంగా నయం చేయవచ్చు.

**ఆయుర్వేదచికిత్స:** ఆయుర్వేదంలో ఇలాంటి సమస్యల కు సమగ్రమైన చికిత్సాపద్ధతులుఉన్నాయి. అందులో

**శమన చికిత్స:** ఇది దోషాలను బట్టి అభ్యంతరంగా వాడే ఔషద చికిత్స ఇందులో వేదన, కాయకంగా ఔషదాలు ఉంటాయి. అలాగే వాతహర చికిత్సా పద్ధతులుంటాయి.

**శోధనచికిత్స:** శమన చికిత్స వలన ఒక్కోసారి మళ్ళీ వ్యాధి తిరగబెట్టవచ్చు. అందుకే ఆయుర్వేదంలో పంచకర్మ అనే ఒక ప్రత్యేక చికిత్సా పద్ధతి ఉంది. ఈ చికిత్సా పద్ధతీ ద్వారా ప్రకోపించిన వాతాది దోషాలను సమూలంగా తగ్గించవచ్చు.

1.స్నేహకర్మ: ఈ ప్రక్రియ ద్వారా వెన్నెముకలోని వెన్ను పూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి, తద్వారా జాయింట్స్‌లో కదలికలను తేలికగా చేయువచ్చును.

2.స్వేదకర్మ: ఈ పద్ధతిలో గట్టిగా అతుక్కొనిఉండే జాయింట్స్ ను మృదువుగా అయ్యేటట్లు చేయువచ్చును. కటివస్తి. ఈ ప్రక్రియ ద్వారా అరిగిపోయిన మృదులాస్థికి రక్త ప్రసరణను పెంచి తద్వారా నొప్పి తీవ్రతను తగ్గించ వచ్చును. అలాగే సర్వాంగధార, వస్తికర్మ అనే విశిష్ట చికిత్సా పద్ధతుల ద్వారా నాడీ కణాలలో కలిగిన లోపాల ను సరిచేయవచ్చు, అదేవిదంగా ప్రకోపించిన వాతాన్ని సమస్థితికి తీసుకురావచ్చు.

జాగ్రత్తలు:సరిఅయిన పోషకఆహారాలు తీసుకోవడం. నిదాన పరివర్జనం అనగా పైన చెప్పిన ప్రత్యేక వ్యాధి కారణాలను మళ్లీ చేయకుండా జాగ్రత్త పాటించినట్ల యితే ఈ సమస్యనుంచి శాశ్వతవిముక్తి పొందవచ్చును.

**డా. లక్ష్మీ** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ADVT

**©90300 85456** | సికింద్రాబాద్ । కొత్తపేట । కూకట్‌పల్లి । వరంగల్ । గచ్చిబౌలి । విజయవాడ । తిరుపతి । వైజాగ్ । రాజమండ్రి । కర్నాటక | **www.starayurveda.com**



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 29

**రవిరాజాగారు కూడా మొదట్లో అలాగే నాలోని నటుణ్ణి చూసి, వీడు కరెక్టు అని నన్ను ఇంట్రడ్యూస్ చేస్తే, ఈవీవీ గారు కూడా అదేవిధంగా నాకో బ్రేక్ ఇచ్చారు. అంతే ఆనాటి నుంచి ఈనాటి వరకూ 500 పైచిలుకు సినిమాలు చేశాను. వెనక్కి తిరిగి చూడలేదు. ఇంతవరకూ ఒక వారం గ్యాప్ రాలేదు. ఒకరోజు, రెండు రోజులుతప్ప.**

ఒక వారం ఎక్కడికన్నా వెళితే ఒక సినిమా వదులుకోవలసిన పరిస్థితన్నమాట. అట్లాంటి స్టేటస్ ఇచ్చారు ఈవీవీ సత్యనారాయణగారు. ఆయనకి, రవిరాజాగారికి నా జీవితమంతా రుణ పడి ఉంటాను.

ఇక కాలేజీలో నా పరిస్థితి ఎలా వచ్చిందంటే జాయిన్ అవ్వాలి లేదా రిజైన్ చెయ్యాలి. వాలంటరీ రిటైర్మెంట్ తీసుకోవాలనుకున్నా. దానికి హైస్కూల్లో చేసిన సర్వీస్ సర్టిఫికెట్టు కావాలి, ఇది కావాలి, అది కావాలి అన్నారు. ఇవన్నీ తెచ్చుకుంటే మీకు నెలకి నాలుగువేలో, మూడువేలో పెన్షన్ వస్తుందన్నారు. అంత తిరుగుడు తిరిగి ప్రాసెస్ చేసేంత టైం లేదు నాకు. అంచేత ఉద్యోగానికి రాజీనామా చేసేశాను. అందుకు కొంచెం ఫీలయ్యాను. ఎందుకంటే ప్రభుత్వం నాకిచ్చే డబ్బు ఎంతైనా కావచ్చుగానీ ఆ డబ్బు పోయిందే అని ఇప్పటికీ నాకో ఫీలింగ్ ఉంది. ఆ విధంగా 1998 జనవరిలో కాలేజీకి రాజీనామా చేసేశా. రిజైన్ చేసినప్పటి నుంచి ఇంక సినిమా పర్వం స్టార్ట్ అయింది. ఇక ఒకే రకమైన పనన్నమాట.

### నాలుగేళ్ళలో మూడు నంది అవార్డులు

1998 మార్చి ఉగాదికి నేనూ, కెఎల్ నారాయణగారు, ఈవీవీ సత్యనారాయణగారు రామోజీ ఫిలిం సిటీకి వెళుతున్నాం. ఏదో సినిమా చూడ్డానికి వెళుతూ వెళుతూ ఆగి పంజాగుట్టలోని ఒక హోటల్లో టిఫిన్ చేస్తున్నాం. అంతలో ఈవీవీ సత్యనారాయణగారికి ఫోన్ వచ్చింది. కంగ్రాట్యులేషన్స్‌రా అన్నారు. ఏంటి సార్ అన్నా. నీకు 'మా నాన్నకు పెళ్ళి'కి నంది అవార్డు వచ్చిందిరా అన్నారు. షాక్. నేనేంటంటే యాక్చువల్‌గా టు బి ఫ్రాంక్ చెప్పాలంటే కాలేజీలో సర్వీసు చేసేటప్పుడు సాయంత్రం ముగ్గురు నలుగురు ఫ్రెండ్స్‌ను తీసుకొని అలా బెల్ట్‌షాపుల కెళ్ళిపోయి కూర్చుని కథలు చెప్పుకుని సగం అడ్వాన్స్ పెట్టేసేవాణ్ణి. మిగిలిన సగం జీతం వచ్చిన రోజున ఇంకొంచెం ఎక్కువ పార్టీ చేసుకునేవాళ్ళం. అలాగా అసలు డబ్బులుండేవి కావు. అట్లాంటిది సడన్‌గా అసలు 17 సినిమాలు రావడం ఏంటీ, నంది అవార్డు రావడం ఏంటీ, దాదాపు బ్రేక్ వచ్చిన సినిమా అది. అంటే నాకు ఫస్ట్ సినిమానే అనుకుంటున్నారు అందరూ. కానీ, నాది మొదటి సినిమా 'మా నాన్నకి పెళ్ళి' అనే ఆడియన్స్ అభిప్రాయం. వాళ్ళ అభిప్రాయం ప్రకారం మాట్లాడితే మొదటి సినిమాకే మనకి నంది అవార్డు రావడమేంటి? అని షాక్ అయిపోయాను.

అదేంటిరా అలా మాట్లాడకుండా అయిపోయావు అన్నారాయన. కాదండీ, నాకెలా ఆనందించాలో తెలియటంలేదు అన్నా. అది ఫస్ట్ నంది. ఆ నంది అవార్డును తీసుకున్నప్పుడు నా అనుభూతి వేరు. నేను రచయితను కదా. రచయితగా బెస్ట్ స్టోరీ రైటర్‌గా నంది తీసుకుందామనుకున్నా. కానీ భగవంతుడు ట్రాక్ ఈ దారిలో పెట్టాడు. అది మనకు రాసిపెట్టుందన్న మాట. సరే ఆ నంది అవార్డుకెళితే వాళ్ళు నన్ను పిలిచారు. కమిటీలో ఒకరు నన్ను పిలిచి ఏమండీ మీరెక్కడో చెన్నై నుంచో, కొచ్చిన్ నుంచో వచ్చానని చెప్పండి. ఆ ఫ్లైట్ చార్జీలు కూడా ఇస్తారు వీళ్ళు అన్నారు. నేను వద్దులేండి టికెట్ అడుగుతారు కదా, నా దగ్గర ఉండదు అన్నాను. వెళితే పదివేలు చెక్కిచ్చారు అవార్డుకి. అసలు నందినే కొన్ని కోట్ల రూపాయల విలువ. సరే తీసుకుని పిల్లలు, నేనూ పార్టీ చేసుకుని చక్కగా ఇంటికొచ్చాం. నంది, అదే కదా ఆస్కార్ లాంటిది మనకి.

## 200 పైచిలుకు తాగుబోతు క్యారెక్టర్లు చేశా






1999 'రామసక్కనోడు'కి సాగర్‌గారు డైరెక్టర్. కో డైరెక్టర్ వి.వి. వినాయక్. ఒక ఆటో డ్రైవర్ క్యారెక్టర్‌ని వి.వి. వినాయక్‌గారు కంపోజ్ చేశారు. ఆ ఆటో డ్రైవర్‌కి మూలశంక. మూలశంక అన్నది చూపెట్టకుండా మొహంలో చూపెట్టాలన్నాడు ఆయన. దానికి నంది అవార్డు వచ్చింది. నడుం కిందభాగం ఎప్పుడూ చూపెట్టలేదు ఆయన. మెట్లెక్కుతున్నాను. ఇష్...అబ్బా... పొగలు వచ్చేస్తున్నాయిరా బాబూ అనే డైలాగ్. అసలు ఒక అద్భుతమైన సృష్టి అది. దానికి నంది అవార్డు వచ్చింది. 2000లో 'సర్దుకుపోదాం రండి'కి నంది. కెరీర్ స్టార్ట్ అయిన నాలుగు సంవత్సరాలలో మూడు నంది అవార్డులు. 2003లో 'శివమణి' నంది



అవార్డు! దాదాపు ఆరు సంవత్సరాలలో నాలుగు అవార్డులు వచ్చాయి. అదొక రికార్డు. 'ఆనందం' అనే సినిమా ఉషాకిరణ్ మూవీస్ వాళ్ళు నందికి అప్లై చేయలేదు. కాబట్టి అది మిస్సయింది. ఆ సంవత్సరంలో అది మంచి క్యారెక్టరు అన్నారు ఆడియన్స్.

జీవితం ఇలా కొనసాగుతున్న రోజుల్లో నేను కొంతమంది సహచర నటులతో కొంచెం ఇబ్బంది పడ్డాను. ఆల్ ఇన్ ద గేమ్ అంతే. సహజంగా మానవ జీవితాలు ఎక్కడ అయితే ఉంటాయో అక్కడ ఇలాంటివన్నీ ఉంటాయనిపించింది. వాటిని నేను చాలా ఓర్పుగా అధిగమించాను. మంచిగా అధిగమించాను. సాహచర్యంగా అధిగమించాను. స్నేహపూర్వకంగా అధిగమించాను. అందరికీ అణిగి మణిగి ఉండి అందరి స్నేహాన్నీ పొందగలిగాను. అక్కడి నుంచి నాకు మార్గం సుగమం అయిపోయింది.

చాలామందికి డాక్టరేట్స్ ఉన్నాయి. పద్మశ్రీలు ఉన్నాయి. నాకు బాగా నచ్చిన ఒక పాయింట్ చెప్తా. నాకు బాగా ఇష్టమైన ఆర్టిస్టులు, గ్రేట్ పీపుల్స్ గురించి చెప్తా. ఎస్వీ రంగారావు, ఒక డాక్టరేట్. ఆయనకు పద్మశ్రీ లేదు. అంచేత అతను పనికిరాడు. అతను తక్కువని ఎవరు అనుకుంటారో చెప్పనా? ఎవరికి అవార్డు వచ్చిందో వాళ్ళే

**ఎమ్మెస్‌గారు రెండువందల పైచిలుకు తాగుబోతు క్యారెక్టర్లు చేశారు. జనం వాటిని రిసీవ్ చేసుకున్నారు. ఈ పాత్రల్లో ఆయనకు నంది అవార్డులు కూడా వచ్చాయి. కానీ కొంత మంది ఈ విషయంలో ప్రతికూలంగా స్పందించినప్పుడు ఎమ్మెస్ కూడా తగిన రీతిలోనే ఘాటుగా సమాధానం చెప్పారు. అసలు ఎమ్మెస్‌కు అవార్డుల విషయంలో ఎలాంటి అభిప్రాయాలుండేవి? ఏది అసలు సిసలైన అవార్డని ఆయన భావించేవారు?**

అనుకుంటారు తప్ప ప్రజలు అనుకోరు. అంచేత నాకేమీ రాలేదేంటీ. వచ్చినా ఏంటీ? అని ఆలోచించే వెధవని కాను నేను.

## కృష్ణగారిలానే మహేశ్‌బాబు వెరీ ఫ్రాంక్

ఐదవ నంది 'దూకుడు' సినిమాకు వచ్చింది. ఫిలింఫేర్ అవార్డు కూడా సాధించింది. తెలుగు ప్రేక్షకులు 'దూకుడు' చూసి ఏం మాట్లాడుతున్నారు? దూకుడు అనే సినిమాలో ఎమ్మెస్ నారాయణ అనే ముసలోడు ఎంత బాగా యాక్ట్ చేశాడు? అన్నారు. అదే నాకు డాక్టరేట్. వీర లెవల్లో ఆడింది సినిమా. మహేశ్‌బాబుగారి వల్ల ఆడింది. కానీ నేను సపోర్టు అయ్యాను. మహేశ్ బాబు అనే హీరో కృష్ణగారిలా వెరీ ఫ్రాంక్. ఈ సినిమా ఎవరి వల్ల ఆడింది అనడిగితే, నా కామెడీ వల్లా, వాళ్ళ కామెడీ వల్లా ఆడింది అన్నారు. అలా ఒప్పుకునే హీరో ఎవరూ లేరు. ఆయన ఒక హీరో అయ్యుండి అద్భుతమైన కామెడీ చేశారు. అయితే దాంట్లో ఆయన నాకిచ్చిన సపోర్టువల్ల, నేను చేసిన యాక్షన్ ఆయనకు ప్రపంచం పెద్ద పీఠం వేస్తోంది. ఆయన జీవితాన్ని నేను పక్క నుండీ గమనించా. గమనించినప్పుడు నాకు ఏమనిపించిందంటే, ఇది ఏదో ఒక ఉన్నతి కోసం ప్రయాణం చేసే ప్రతివాడికీ పనికొస్తుందని నాకు అనిపించి ఆయన్ని నేను చెప్పమని అడిగా. నేను చెప్పనన్నాడు ఆయన. కానీ నేను బలవంతం పెట్టా. ఆయన చెప్పారు. ఇది నేను ఆవిష్కరిస్తున్నా. ఇది చదివి నా ప్రయత్నం కరెక్టో కాదో మీరే చెప్పగలరు. అంతే. ఇది ఇతరుల కోసం చేసేదేతప్ప, వాడికోసం కాదు. ఒకడు మెడిసిన్ తయారుచేస్తాడు. మరొకడు విమానం తయారు చేస్తాడు. విమానాన్ని వాడే తయారుచేసి ఇంట్లో పెట్టుకుని అమ్ముకోవట్లేదు వాడు.

## తాగుబోతు పాత్రలకు అవార్డులివ్వకూడదన్నాడు

నా నటజీవితంలో ఎదుర్కొన్న అవమానాలు కూడా ఉన్నాయి. నాకు నంది అవార్డు వచ్చినప్పుడు సహనటుడు ఒకాయన నా దగ్గర కామెంట్ చేశాడు. కోర్టుకెళితే అవార్డు వెనక్కుపోతుంది, తాగుబోతు పాత్రలకు ఈ అవార్డులు ఇవ్వకూడదని ఒక చట్టం ఉంది అన్నాడు. మన దగ్గర ఒకడు అన్నాడు, ఆయన అన్నాడో లేదో మనకి అవన్నీ తెలీదు. చట్టంలో సమాజంలో అలా ఉండదండి. తాగుబోతుకి ఇవ్వకూడదని, తిరుగుబోతుకి ఇవ్వకూడదని, వేశ్యపాత్రకి ఇవ్వకూడదని. అలా నీచమైన పాత్రలు పోషించిన వారికి ఈ అవార్డులు ఇవ్వకూడదనేది ఉండదండి. కామన్‌సెన్స్ ఉండదనేది. ఎందుకంటే బెస్ట్ విలన్ అవార్డు ఉంది. విలనీ చేస్తాడు. వాడు చలివేంద్రాలు పెడతాడు. వాడేమన్నా గోదానాలు, భూదానాలు చేస్తాడా? అది కామన్‌సెన్స్‌లెస్ పాయింటండి. అట్లా ఉండదు. ఫండమెంటల్‌గా ఉంటుంది అని అనుకోవడం పొరబాటు. కాబట్టి మనం దాన్ని గురించి కామెంట్ చేయడం, ఇష్యూ చేసుకోవడం అనవసరం మనకి అన్నాను. ఎవరూ ఇలాంటివి బోధించక్కర్లేదు. అది కామన్‌సెన్స్. నాకు వచ్చిన నాలుగు నంది అవార్డులు ప్రాముఖ్యం కలిగినవి. అంతకంటే బాగా ఆడిన కొన్ని క్యారెక్టర్లకి రాకపోవచ్చు. కానీ అవీ ఉంటాయి.

## అవార్డు కమిటీల్లో నిజాయితీపరులు

ఒకసారి నేను, పట్టాభిరామంగారు గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నాం వైజాగ్ నుంచి. నేను ఆయన్ని అంతకుముందు పర్సనల్‌గా ఎక్కడా కలవలేదు. టీవీల్లో చూడడమే. సార్ నమస్కారమండి అన్నాను. కంగ్రాట్యులేషన్స్ అండి మొన్న మీకు నంది అవార్డు వచ్చినందుకు అన్నారు. ఆ నంది కమిటీలో నేను ఉన్నానండి. ఆ అవార్డు కమిటీలో నేను మెంబర్‌ని సార్ అన్నారు. అలాగా సార్ అన్నా. మీకు నేను ఓటేశాను సార్ అన్నారు. చాలా థాంక్స్ సార్ అన్నాను. మొదట మీ క్యారెక్టర్ బాగా నచ్చి ఓటేశాను. సెకండ్ పాయింట్ ఆ నంది అవార్డు మీకెందుకొచ్చిందో తెలుసా? అన్నారు. ఎందుకు వచ్చింది? అన్నాను. మీ ఒక్కరి దగ్గర నుంచే నాకు ఫోన్ రాలేదండి అన్నారు. అంత నిజాయితీగా చెప్పారాయన. అంటే ఎంత నిజాయితీ మనుషులున్నారో చూడండి.

చాలామంది అంటుంటారు, కొనేసుకుంటుంటారు, రికమెండేషన్లు అని అంటుంటారు. కాదు. అక్కడేదో ప్రతిభ లేకపోవటమో, ఇంతకంటే ఎక్కువ ప్రతిభ ఇంకొకడికి ఉండటమో, అని నేను నమ్ముతాను. కాబట్టి నాకు వచ్చిన నంది కంటే ఆయన చెప్పిన మాటలు నా అవార్డుకి నిజమైన విశ్వాసాన్ని ఇచ్చాయన్నమాట.

దాదాపు 200 పైచిలుకు తాగుబోతు క్యారెక్టర్లు చేశా. నా జీవితంలో ఎక్కడికి వెళ్ళినా అదే మెయిన్ టాపిక్. నేను అంతర్మథనం చేసుకునే విషయం కూడా అదే. అప్పుడు డైరెక్టరు గారితో కూడా అన్నా. దాదాపు 200 చేశానండి తాగుబోతు క్యారెక్టర్లు. మొనాటనీ రాదా సార్ అన్నా. నాకు రాలేదు అన్నారాయన. కృష్ణవంశీ ఎంత గొప్ప డైరెక్టరు! ఇంక ఆయనతో వివాదం పెట్టుకోవటం, మాట్లాడటం తప్పు. ఎంతో స్పాన్, విజన్ ఉన్న డైరెక్టర్ ఆయన.

*(ఇంకావుంది)*

*-కూనపరాజు కుమార్*
*సెల్: 99899 99599*

# మదరిండియా 8

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287



"నోనా..."

**"నువ్వు వివరించకపోతే నాలో ఉన్న అనుమానం అలాగే ఉండిపోతుంది! నా భర్తలో మళ్ళీ అలాంటి భయంకరమైన మార్పు వస్తుందేమో అన్న భయం నన్ను శాశ్వతంగా వెంటాడుతూ ఉంటుంది. గర్భవతిగా ఉన్న నేను అలాంటి భయాలకు లోను కాకూడదు సాకేత్!"**

**సాకేత్ అప్రయత్నంగా ఆమె పొట్టను ప్రేమగా నిమిరాడు. 'నోనా, నన్ను నమ్ము.... అలాంటి మార్పు ఇక నాలో ఎప్పుడూ చూడవు."**

"పెళ్ళి చేసుకోలేనన్నావ్. మీ అమ్మ మందలించగానే చేసుకున్నావ్. అదంతా చాలా తేలిగ్గా, కృతకంగా అనిపించింది నాకు. మానసికంగా నువ్వు ఎదగలేదేమో అని కొన్నాళ్ళు అనుకున్నాను."

సాకేత్ బరువుగా నిట్టూర్చాడు. నోనా అనుమానం నిజమే! పెళ్ళివద్దని ఎంత సులభంగా అన్నాడో, అంతే సులభంగా అమ్మ రంగప్రవేశం చేశాక పెళ్ళికి ఒప్పుకొని పెళ్ళికొడుకై పోయాడు. తన మానసికస్థితి మీద నోనా అనుమానాలు నివృత్తి కావాలంటే, ఆమెకు నిజం తెలియాలి. తను ఆమెకిచెప్పే నిజం అతిరహస్యం. ఆ అతిరహస్యాన్ని కాపాడమని నోనాకు జాగ్రత్తలు చెప్పాలి. తన ప్రవర్తనలో పరిస్థితులను బట్టీ ఏ చిన్న మార్పు కనిపించినా, నోనా తనను 'సైకో' అనుకుని ఫిక్స్ అయిపోయే ప్రమాదం ఉంది. తాను సహజమైన మనిషే అనీ, సైకోకాదనీ తన భార్యకు తెలియాలి. నిజం చెప్తేగానీ ఆ అంశం నోనాకి తెలీదు.

సాకేత్ ఆలోచనల దాడిని తట్టుకోలేక, మంచం మీంచి లేచాడు. నిలువుటద్దం ముందుకెళ్ళి నిలబడ్డాడు. ప్రతిబింబాన్ని తదేకంగా చూస్తూ ఉండిపోయాడు. 'నోనాకి నిజం చెప్పు!' 'నువ్వు మానసికంగా బలవంతుడే అనిపించుకో!' అంటున్నట్టుంది ప్రతిబింబం. సాకేత్ వెనక్కితిరిగి నోనా వైపు చూశాడు. నోనా ప్రశ్నార్థకంగా తనవైపే చూస్తోంది.

"నోనా... భార్యని హైందవధర్మం 'అర్ధాంగి' అంటుంది. 'బెటర్‌హాఫ్' అన్న మాట. భార్యాభర్తల మధ్య రహస్యాలుండకూడదు. ఎందుకంటే భార్య భర్తలో సగం, భర్త భార్యలో సగం."

"గ్రేట్ కాన్సెప్ట్!" నోనా అప్రయత్నంగా ఇంగ్లీషులో అంది.

"అంచేత నీకు నేనొక నిజం చెప్తాను. అది నీ నుండీ నేను దాచిన నిజం. అది చాలా రహస్యం. విని మరిచిపో..." అంటూ సాకేత్ నోనా ముందుకు వచ్చి, కాళ్ళు ఎడంగా చాచి నిలుచున్నాడు. తలపైకెత్తి తన ముఖంలోకే చూస్తున్న నోనా విశాల నేత్రాలలోకి తదేకంగా చూశాడు.

"నోనా... నేను సైకో కాదనీ, మానసిక స్థిరత్వం లేని వ్యక్తిని కాదనీ నీకు విశ్వాసం కలిగించాలి. నువ్వు గర్భవతివి. భర్త గురించిన అలాంటి అనుమానాలు ఉండకూడదు. అంచేత నీ గర్భంలో ఉన్న మన ప్రణయ ఫలం మీద ఒట్టేసి నిజం చెప్తున్నాను. విను. విశ్వసించు. మన్నించు. మరిచిపో! సరేనా?"

"అయాం రియల్లీ హ్యాపీ! టెల్ ట్రూత్ సాకేత్!" నోనా ఇంగ్లీషులో అంది.

"నోనా... ప్రేమకూ, పెళ్ళికీ మధ్య నేను నీతో ఆడిన మాటలన్నీ కేవలం కల్పనలు. చూపించిందంతా నటన!"

"వ్వాట్?"

"యస్. నిన్ను పెళ్ళిచేసుకోలేను అన్నాను. అది నిజంగా అన్నమాట కాదు. 'అబార్షన్ చేయించుకో' అన్నాను. అదీ నిజంగా అన్న మాటకాదు. నేను... అప్పుడు ఒక పాత్రని నటించాను. ఆ పాత్రకోసం నేను రాసుకున్న డైలాగులవి..."

"సాకేత్! మైగాడ్!" నోనా అరిచింది. "ఎందుకు నటించావు. ఎందుకు అలాంటి భయంకరమైన మాటలన్నావు? నేను ఎంత కుమిలిపోయానో తెలుసా? ఎంత భయపడిపోయానో తెలుసా? ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాను. నిన్ను మీడియా ముందుకు లాగి, శిక్షించాలనుకున్నాను. ఏది చేసినా అది నాన్న మీద రిఫ్లెక్ట్ అవుతుంది. నాన్నకు నేనంటే ప్రాణం. నాకేమన్నా అయితే ఆయన తట్టుకోలేడు. నాన్నను కష్టపెట్టడం ఇష్టంలేక... ఓర్పుతో ఆలోచిస్తూ ఉండిపోయాను. అప్పుడు ఒక వ్యక్తి నాకు దేవుడిలా సాయం చేశారు. ఎందుకో తెలీదు. ఆయన నాకు ఫోన్ చేశాడు. మన ప్రేమ గురించి ఎలా తెలుసో- ఆయనకి తెలుసు. మీ పెళ్ళెప్పుడని అడిగాడు. అప్పుడు నేను నువ్విచ్చిన షాక్‌లో దయనీయ స్థితిలో ఉన్నాను. నువ్వు పెళ్ళి చేసుకోనన్నావని ఆయనకి ఏడుస్తూ చెప్పాను. ఆయన ధైర్యం చెప్పి, ఒక సలహా ఇచ్చారు. మీ అమ్మగారిని కలుసుకుని నువ్వు చేస్తున్న అన్యాయాన్ని దాచకుండా చెప్పమన్నారు. ఆమెకు తెలిస్తే నాకూ, నా ప్రేమకూ, నా కడుపులో బిడ్డకూ న్యాయం జరుగుతుందన్నాడు. ఆయన మాటలు నమ్మాలనిపించింది. మీ అమ్మగారిని కలుసుకున్నాను..."

"ఆ వ్యక్తి ఎవరో నాకు తెలుసు!"

సాకేత్ చిన్నగా నవ్వి అన్నాడు.

"ఆ వ్యక్తి మా అన్నయ్య, ఏకాంత్... అవునా?"

"అవును..." నోనా కళ్ళు చిట్లిస్తూ అంది. "ఆయనకి మన గురించి..."

"నేనే చెప్పాను. మా అమ్మను కలుసుకునేలా నిన్ను ప్రోత్సహిస్తూ సలహా ఇమ్మన్నాను."

"ఎందుకూ?" నోనా వెంటనే అడిగింది.

"నేను పెళ్ళిచేసుకోనన్న దుఃఖంలో నువ్వు ఏ అఘాయిత్యమూ చేసుకోకుండా ఉండటానికి అదొక కారణం. రెండవ కారణం నిన్ను పెళ్ళి చేసుకోమని మా అమ్మచేతనే చెప్పించుకోడానికి..."

"ఎందుకు?" నోనా మళ్ళీ అరిచింది. "మీ అమ్మ గారికి విషయం చెప్పి, ఆమె ఆమోదం తీసుకుని ఉండొచ్చుగా? మీ అన్నయ్యకు చెప్పినదాన్ని అమ్మకు చెప్పి ఉండొచ్చుగా?"

"అది పాజిటివ్ అప్రోచ్. అలా జరిగివుంటే మా అమ్మ మన పెళ్ళికి అంగీకరించేది కాదని నా అనుమానం. అప్పటికే అన్నయ్య ఆమెకి క్షోభ కలిగిస్తూ, ఆమెకు ఇష్టం లేని పెళ్ళి చేసుకున్నాడు. నేనూ, నా తమ్ముడూ అయినా తను నిర్ణయించే సంబంధాలు చేసుకోవాలన్న ఆశ మా అమ్మది. అది నాకు తెలుసు. అమ్మను బాధ పెట్టి నిన్ను నేను చేసుకుని ఉండొచ్చు. కానీ, అది నాకు ఇష్టం లేదు! ఆలోచించాను. పథకం వేశాను. అన్నయ్య ద్వారా నువ్వు మా అమ్మను కలుసుకునేలా చేశాను. అమ్మ అన్యాయాన్ని సహించదు! నన్ను తిట్టి, కొట్టి, నీ మెడలో తాళి కట్టిస్తుందని నాకు గ్యారంటీగా తెలుసు! మనిద్దరికీ పెళ్ళి జరగాలంటే అమ్మకు నా మీద కోపం కలగాలి. నీ పట్ల సానుభూతి కలగాలి! నేను అడిగితే అమ్మ ఒప్పుకుంటుందన్న గ్యారంటీ లేదు. అమ్మే స్వయంగా, నోరారా నన్ను అడిగేలా, ఆజ్ఞాపించేలా చేసుకుంటే? ఈ ఆలోచనతో నాటకం ఆడాను. నా నటన రక్తి కట్టింది. నా పథకం పారింది. అమ్మ నిన్ను ఓదార్చింది. నీకు ధైర్యం చెప్పింది. నా చెంప పగలేసింది. 'నోనాను పెళ్ళిచేసుకో!' అంది. చేసుకున్నాను. కథ సుఖాంతం!"

"సాకేత్... అన్‌బిలీవబుల్...." నోనా తగ్గు స్వరంతో అంది. "నీ అప్రోచ్ తప్పు..."

"తను ప్రేమించిన రంజనను పెళ్ళాడ్డానికి పాజిటివ్ అప్రోచ్‌తో రాజమార్గంలో వెళ్ళి, మా అన్నయ్య కష్టపడిపోయాడు. అమ్మనూ కష్ట పెట్టాడు. మానసికంగా అమ్మ అన్నయ్యకు కొద్దిగా దూరం అయింది. నేను కూడా ఆ పాజిటివ్ అప్రోచ్‌తోనే అదే రాజమార్గంలోనే వెళ్ళి ఉంటే ఏమయ్యేది? మనిద్దరం అమ్మకి దూరమయ్యే వాళ్ళం. లేదా మనిద్దరం ఒకరికొకరం దూరమయ్యే వాళ్ళం. ఆ దూరాన్ని దూరం చేయడానికి నాటకం ఆడాను. సో... నీ సాకేత్ సైకో కాదు! మెంటల్ స్టెబిలిటీ లేనివాడు కాదు!" సాకేత్ ముగించి, సగర్వంగా నవ్వాడు. "నీ భయం పోయిందా? అనుమానం అంతరించిందా?"

నోనా సూటిగా అతని కళ్ళల్లోకి చూసింది. "యూ ఆర్ మే రెక్‌లెస్ గ్యాంబ్లర్! ప్రేయసితో, కన్నతల్లితో నువ్వు ప్రమాదకరమైన జూదం ఆడావు సాకేత్!"

## జరిగిన కథ

భర్త ఆశయాలకనుగుణంగా తన బిడ్డలు నీతి నిజాయితీలతో బతకాలని ఆశించి కష్టపడి వారిని పెంచి పెద్ద చేస్తుంది నిగమ. కానీ ఆ కొడుకులు అందుకు భిన్నంగా తయారవుతారు. కన్న కొడుకుల దుర్మార్గాలకు వ్యతిరేకంగా న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తుందా కన్నతల్లి. ఫ్లాష్‌బ్యాక్‌లో కెళితే, తన తండ్రిని చంపిన రాజవర్మ కూతురిని ప్రేమిస్తాడు నిగమ పెద్ద కొడుకు. ఆమెను పెళ్ళి చేసుకుని ఇల్లరికం వెళ్ళడంతోపాటు, ఓ డబ్బున్న మారాజుకు దత్తపుత్రుడై పోతాడు. అతని తమ్ముడు సాకేత్‌ను బహుళజాతి కంపెనీ యజమాని కూతురు నోనా ప్రేమించి గర్భం దాలుస్తుంది. ఆమెను పెళ్ళాడేందుకు సాకేత్ తిరస్కరిస్తాడు. దాంతో అతడి తల్లిని ఆశ్రయిస్తుంది నోనా. సాకేత్ తల్లి రంగంలోకి దిగి వారిద్దరి వివాహం జరిపిస్తుంది. తర్వాత......

"నోనా... నా ప్లాన్‌ని నువ్వు సరిగ్గా అర్థం చేసుకోలేదు. దారి ప్రమాదకరమైనదే అయినా గమ్యం చేరాం కదా!"

"అయాం సారీ సాకేత్. రివర్స్‌గేర్‌లో నువ్వు ఎప్పుడూ ముందుకు వెళ్ళలేవు. నీ ఆలోచనావిధానం సరైంది కాదు. నీ మానసికస్థితి సరిగా లేదు!"

"నోనా!"

"సాకేత్! నాకు పుట్టబోయే బిడ్డకు తండ్రి బుద్ధులు రాకూడదని ప్రార్థిస్తాను.."

"నోనా...! సాకేత్ బొంగురుగా అరిచాడు.

నోనా అతనివైపు తదేకంగా చూసింది. "నేను తల్లిలేని దాన్ని. తల్లిని కాబోతున్న దాన్ని. తల్లిని మోసం చేసే మనిషిని మెచ్చుకోలేను..."

సాకేత్ పెదవులు వణికాయి. తను గెలిచాడా? ఓడిపోయాడా? లేక.. గెలిచీ, ఓడిపోయాడా? తన ముఖం చెమటతో తడుస్తున్నట్టు గ్రహించాడు సాకేత్. మౌనంగా బాత్‌రూం వైపు నడిచాడు.

టవల్‌తో మొహం తుడుచుకుంటూ, బాత్‌రూంలోంచీ ఇవతలకి వచ్చాడు సాకేత్. మంచం మీద నోనా లేదు. కారు స్టార్టయిన





## పరిణీతి కహాని నమ్మొచ్చా?

మహేష్‌బాబు పక్కన మొన్నటి దాకా బాలీవుడ్ భామ పరిణీతి చోప్రాను అనుకున్నారు. ఈ పేరు దాదాపు ఫైనలైజ్ అయ్యే సమయంలో ఆ ప్రాజెక్టు నుంచి పరిణీతి తప్పుకుంది. రకూల్ ఎంటర్ అయింది. దీనికి కారణం పరిణీతి చాలా ఎక్కువ మొత్తం అడిగిందన్న వార్త ఒకటి ప్రచారంలో ఉంది. తన విషయంలో జరుగుతున్న ప్రచారాలన్నీ అసత్యాలని అంటోంది పరిణీతి. మహేష్‌బాబు పక్కన తనని అడిగారనీ, అయితే డేట్లు అడ్జస్ట్ చేయలేకపోవడంతో ఈ సినిమాను వదులుకున్నానని చెప్పుకొచ్చింది. అసలు విషయం ఏమిటంటే బాలీవుడ్‌లో కూడా పరిణీతి చేతిలో పెద్ద ప్రాజెక్టులేవీ లేవు. అలాంటి సమయంలో దక్షిణాది నుంచి వచ్చిన అవకాశాన్ని ఎందుకు వదులుకుందో అర్థం కావడం లేదని బాలీవుడ్ జనాలు అంటున్నారు. దక్షిణాది సినిమాల్లో నటిస్తే బాలీవుడ్‌లో తన రెమ్యునరేషన్ తగ్గే ప్రమాదం ఉందని భయపడిన పరిణీతి ఆ ప్రాజెక్టుకు నో చెప్పి ఇలాంటి కహానీలు వినిపిస్తోందని అంటున్నారు.

శబ్దం అతని వైపు దూసుకు వచ్చింది.

ఆడవాళ్ళు! తల్లి, చెల్లి, పెళ్ళాం... అందరూ ఒక్కటే. సెంటిమెంటల్ ఫూల్స్! తల్లిని ఒప్పించడానికి తాను పడిన కష్టాన్ని నోనా ఎంత తేలిగ్గా కొట్టిపారేసింది. నిజమే... తను తన తల్లిని మోసం చేశాడు. ఎవరికోసం? తనొక్కడి కోసం కాదు. నోనా కోసం! ఈ సత్యాన్ని నోనా ఎందుకు గ్రహించడం లేదు? లోపల్నుంచి పుట్టుకొస్తున్న కోపం సాకేత్ పిడికిళ్ళు బిగించింది.

•••

“సంకేత్!” గుమ్మంలో ప్రత్యక్షమైన చిన్నన్నయ్యను చూడగానే ఉత్సాహంగా అరిచింది నిశిత. ఆమె కుడిచెయ్యి సంకేత్ చొక్కా ముందు భాగాన్ని పట్టుకుని లోపలికి లాగింది.

చేతిలోని సూట్‌కేసుని కిందికి వదలి సంకేత్ రెండు చేతుల్తో చెల్లెల్ని పట్టుకుని, పైకెత్తి గిర్రున తిప్పాడు. హాల్లోకి వచ్చిన నిగమ ఇద్దర్నీ చిరునవ్వుతో చూస్తోంది.

“సంకేత్ కాదు. డాక్టర్ సంకేత్ అను” నిశితను కిందికి దించి సగర్వంగా అన్నాడు సంకేత్.

గాలిలో గిరగిర తిరిగిన నిశిత సంకేత్ మీదకు కొద్దిగా తూలి, అతన్ని పట్టుకుంది. “డాక్టర్! అప్పుడే?”

“యస్, యంగ్‌లేడీ! హౌస్‌సర్జెన్సీ అయిపోయింది. అందుకే మూటాముల్లే సర్దుకుని కర్నూలుకు గుడ్‌బై కొట్టేసి హౌస్‌కి చేరుకున్నా!” అంటూ సంకేత్ అమ్మను చూసి, ఆమెవైపు వేగంగా వెళ్ళాడు. తటాలున వంగి అమ్మ పాదాలకు నమస్కరించాడు. లేచి చిరునవ్వుతో ఆమె ముఖంలోకి చూశాడు.

“నా యంబీబీఎస్ నీ పాదాలకు అంకితం!”

నిగమ తృప్తిగా నవ్వి, సంకేత్ నుదురుమీద ముద్దెట్టుకుంది. “అమ్మకు నువ్వు చేసిన అంకితాన్ని అమ్మ సమాజానికి ట్రాన్స్‌ఫర్ చేస్తోంది! రోగగ్రస్థ మానవాళికి సేవచేయి నాయనా! వైద్యుడు రోగులపాలిట నారాయణుడు. హరి! చిరునవ్వుతో సేవ, ప్రేమతో సేవ, ధైర్యం కలిగిస్తూ సేవ! నీ అమ్మకు జ్వరం వస్తే ఎలా సేవ చేస్తావో, ఎలాంటి వైద్యం చేస్తావో అలాగే రోగంతో వచ్చిన బిచ్చగత్తెకు కూడా చేయాలి నువ్వు!”

“అలాగే అమ్మా! చూస్తావుగా!” సంకేత్ ఉద్రేకంతో అన్నాడు.

“డాక్టర్లు పల్లెటూళ్ళకు వెళ్ళాలంటే వెనకాడుతున్నారు. నువ్వు గ్రామీణులను సేవించడానికి సిద్ధంగా ఉండాలి...”

**కొరియర్‌లో వచ్చిన ఉత్తరం విప్పి చూసిందామె. తన రెండో కొడుకు భార్య రాసింది. అక్షరాలవెంట పరుగులు తీశాయి ఆమె కళ్ళు. ఉత్తరం చదవడం పూర్తయిందో లేదో ఆమె మొహంలో రంగులు మారాయి. వేళ్ళ సందుల్లోంచి జారి కిందపడిందా ఉత్తరం. కన్నకొడుకే తనను దగా చేశాడా? వంచనతో మంచితనానికి శిరచ్ఛేదం చేశాడా? ఆ తల్లి హృదయం క్షోభించింది. ఇంతకూ ఆ కొడుకు ఏం చేశాడు? ఆ ఉత్తరంలో ఏం ఉంది?**

“అవకాశం వస్తే, ఆలోచించకుండా వెళ్తానమ్మా!” సంకేత్ చిరునవ్వుతో అన్నాడు. “కొడుకులు ముగ్గుర్నీ పైచదువులు చదివించడానికి నువ్వు ఎంత కష్టపడ్డావో, ఎంత త్యాగం చేశావో ఎలా మరిచిపోగలమమ్మా!”

“కొడుకుల చదువుల కోసం ఈ కూతురు కూడా త్యాగం చేసింది; తెలుసా?” నిశిత నవ్వుతూ అంది.

“గట్టిగా అనకే! వింటే నవ్వుతారు!” సంకేత్ నవ్వాడు.

“నేను చేసిన త్యాగమేంటో చెప్పనా? మీలాగా ఐఏఎస్‌లూ, ఎమ్‌టెక్‌లూ, ఎం.బి.బి.ఎస్‌లూ అంటూ కూచోకుండా ఆర్డినరీ డిగ్రీ చదువుకే కమిట్ అయిపోవడం నాయనా!” నిశిత అంది.

“బుర్రలో ఉన్న సరుకును బట్టీ అమ్మ మనం చదవాల్సిన చదువుల్ని నిర్ణయించింది. మన ప్రతాపం ఏమీలేదు!” సంకేత్ నవ్వుతూ అన్నాడు. నిశిత బుంగమూతి పెట్టింది.

నిగమ నవ్వింది. “అదేం లేదులేరా... నాన్నగారు పోయాక, ఆయన కట్టిన ఇంటిని అమ్మేసి, ఫిక్సడ్‌లో వేశానా? ఆ డబ్బుకి నేను సంపాదించిన ట్యూషన్ డబ్బులు జతచేస్తూ మిమ్మల్ని చదివిస్తూ వచ్చాను. నిశిత చదువు సాధారణమే అయినా పెళ్ళికి కావాలిగా? అందుకోసం కేటాయించాను.”

“సంకేతన్నయ్యా, డాక్టరై తిరిగొచ్చావు. కాఫీ తెస్తా, కూచో!” అంటూ నిశిత వంటగదిలోకి వెళ్ళింది. సంకేత్ సూట్‌కేస్ తీసుకుని తన గదిలోకి వెళ్ళాడు.

ఎవరో డోర్ బెల్ నొక్కారు. నిగమ లేచి వెళ్ళి తలుపు తెరిచింది. రాజా, కవిత నవ్వుముఖాలతో నిలబడి ఉన్నారు.

“హలో ఆంటీ!” రాజా, సంకేత్ పర్మనెంట్ స్నేహితుడు అన్నాడు.

“నిశిత ఉందా, ఆంటీ?” కవిత, రాజా చెల్లెలు అడిగింది.

“ఉందమ్మా... రండి!” నిగమ ఇద్దర్నీ ఆహ్వానించింది. “సంకేత్ ఇందాకే వచ్చాడు రాజా, తెలుసా?”

“వాడి రాకపోకలు నాకు తెలీకుండా ఎలా జరుగుతాయి ఆంటీ?” రాజా నవ్వుతూ అన్నాడు. “కంగ్రాట్స్ ఆంటీ! ఇంట్లో ఒక డాక్టర్ని తయారు చేశారు. ”

“అదంతా స్వర్గంలో ఉన్న వాళ్ళ నాన్నగారి దీవెన రాజా... ఆయన అనుకున్న విధంగానే పిల్లల్ని చదివించగలిగాను..”

“అంకుల్ ఆత్మ నిజంగా శాంతిస్తుంది ఆంటీ!” కవిత మెప్పుగా అంది.

“నిశితా!” నిగమ పిలిచింది.

“వినిపిస్తోందమ్మా! అన్నాచెల్లెళ్ళొచ్చారు. వాళ్ళకీ తెస్తున్నాను కాఫీ!” నిశిత వంటగదిలోంచీ అరిచింది.

సంకేత్ గదిలోంచీ హాల్లోకి వచ్చాడు.

“ఏయ్... రాజా!”

“కంగ్రాట్స్ డాక్టర్!” రాజా లేస్తూ అన్నాడు.

ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు.

“నీక్కూడా కంగ్రాట్స్‌రా! ఐ.పి.ఎస్. ఆఫీసరైపోయావ్!” అంటూ సంకేత్ నిగమవైపు తిరిగాడు. “అమ్మా... రాజా ఐ.పి.ఎస్. ఆఫీసరైపోయాడు.

ట్రైనింగ్ విజయవంతంగా పూర్తి చేశాడు!"

"చాలా సంతోషం!" నిగమ చిరునవ్వు నవ్వింది.

"కవితా.... నీ చదువు?" సంకేత్ ప్రశ్నించాడు.

'నిశితా నేనూ ఒకటే! తన చదువైపోతే, నా చదువు అయిపోయినట్టే!"

"ఫైనలియరన్నమాట!" అన్నాడు సంకేత్.

నిశిత కాఫీ ట్రేతో వచ్చింది. అందరూ కాఫీ తాగుతున్నారు.

"ఆంటీ... ఇవాళ అన్నయ్య రాజా బర్త్‌డే. మిమ్మల్నందర్నీ ఇన్‌వైట్ చేయడానికి వచ్చాం. తప్పకుండా రావాలి!" కవిత అంది.

"పిల్లలు వస్తార్లేమ్మా..." అంది నిగమ.

"వాళ్ళని పిలవడానికి ఫోన్‌కాల్ చాలు ఆంటీ! అమ్మా, నాన్నా మిమ్మల్ని ప్రత్యేకంగా ఆహ్వానించ డానికి మమ్మల్ని పంపించారు. మీరు వచ్చి తీరాలి. పార్టీ ఇంట్లోనే. మీరూ మేమూ అంతే!" రాజా అన్నాడు.

"అమ్మను తీసుకొస్తాంలే రాజా!" సంకేత్ అన్నాడు.

•••

రాజా బర్త్‌డే పార్టీ సింపుల్‌గా చక్కగా జరి గింది. కేక్ కట్ చేసిన రాజా తల్లిదండ్రులకు పాదాభివందనం చేశాడు. ఆ వెంటనే నిగమ పాదాలకు నమస్కరించాడు.

"కలకాలం సుఖసంతోషాలతో ఉండు నాయనా!" రాజా తల నిమురుతూ అంది నిగమ.

భోజనాల అనంతరం అందరూ హాల్లో కూర్చు న్నారు.

"అబ్బాయి పుట్టినరోజున వచ్చారు. దీవించారు. చాలా సంతోషం. రాజా పుట్టినరోజున మిమ్మల్ని ఒక కోరిక కోరాలనుకున్నాం. మీ ఇంటికి మేమే వచ్చి కోరాల్సిన కోరిక అది. చాలా ఏళ్ళకి, మా వాడు పుట్టినతేదీ, తిథీ, వారం అన్నీ కలి సొచ్చాయి. అంచేత మంచిరోజని మా సెంటి మెంటు. మీ పిల్లలూ, మా పిల్లలూ మంచి స్నేహితులు. ఒకరికొకరు బాగా తెలుసు. ఒకరి తత్త్వం ఒకరికి కొట్టినపిండి. మీ అమ్మాయి నిశి తను మా రాజాకు కన్యాదానం చేయమని మిమ్మల్ని అడగాలనుకున్నాం." రాజా తండ్రి సదానందం అన్నాడు. "అడిగేశాం"

నిగమ మాట్లాడకుండా చిరునవ్వుతో చూసింది. సదానందం భార్య సరస్వతమ్మ అందుకుంది. "చెప్పకేం వదినగారూ.... మాకు ఇంకో కోరిక కూడా ఉంది. మా అమ్మాయి కవితని సంకేత్‌కి ఇవ్వాలనుకుంటున్నాం. చిన్నప్పట్నుంచీ కలిసి మెలిసి తిరుగుతున్న పిల్లలు. పాలూతేనెల్లా కలిసి పోయి చక్కగా సంసారాలు చేసుకుంటారు.."

నిగమ మౌనంగా నిశిత వైపు చూసింది. నిశిత చిరునవ్వుతో నునుసిగ్గును కలిపి వాలుగా చూస్తోంది. నిశిత పక్కనే కూచున్న కవితా అంతే.

"అడిగినందుకు ధన్యవాదాలు. నాకు కొంచెం సమయం ఇవ్వండి. పిల్లల్ని కనుక్కుని... నిర్ణయం చెప్తాను." నిగమ అంది.

"అలాగలాగే! మీ పెద్దబ్బాయి, రెండో అబ్బాయీ, వాళ్ళ భార్యలూ ఉన్నారు కదా! వాళ్ళనూ సంప్ర దించాలి కదా!" సదానందం నవ్వుతూ అన్నాడు.

నిగమ అతనివైపు నిదానించి చూసింది. "సదానందం గారూ, మీకో విషయం చెప్పాలి. నా పెద్దకొడుకు ఏకాంత్‌నీ, వాడి అత్తవారింటినీ, వాడి ఐఏఎస్ ఉద్యోగాన్నీ పరిగణనలోకి తీసు కొని, మా కుటుంబ నేపథ్యాన్ని అంచనా వేసు కుని మీరు ఈ ప్రతిపాదన చేసి ఉండొచ్చు. ఏకాంత్ ఇప్పుడు నా కొడుకు కాదు. ఎవరికో దత్తత వెళ్ళిపోయాడు. మీరు మా నేపథ్యం గురించి ఆలోచించవలసి వస్తే, ఏకాంత్‌ని మినహాయించి, ఆలోచించండి."

"అది నామమాత్రం దత్తత అని విన్నామే!" సదానందం అన్నాడు.

"నా దృష్టిలో అది దత్తతే. రాతకు ఇచ్చే విలువే నేను మాటకు ఇస్తాను. దత్తపుత్రుడు అవగానే వాడి గోత్రం మారిపోయింది. మా కుటుంబ వ్యవహారాల్లో ఏకాంత్ జోక్యం ఉండదు. నిజం చెప్తున్నాను. మరోలా అనుకోకండి."

"ఎవరికిగానీ మీరు ఇవ్వని విలువ, ఇవ్వా ల్సిన అవసరం మాకు లేదు నిగమగారూ. మీ అమ్మాయి నిశిత మా కోడలు కావాలి. మా అమ్మాయి కవిత మీ కోడలు కావాలి. అంతే!" సదానందం అన్నాడు.

"మంచిది. మా నిర్ణయం త్వరలో మీకు తెలియ జేస్తాం.." నిగమ పైకి లేస్తూ అంది.

•••

"అమ్మా.... పెద్దన్నయ్యతో బంధాన్ని శాశ్వ తంగా తెంచుకుంటున్నామా?" ఇంటికి రాగానే సంకేత్ అడిగాడు.

"నా మాటల్లో నీకు ఆ భావం వినిపించిందా?" నిగమ నవ్వుతూ అడిగింది. "పెళ్ళికొడుకు అన్నయ్య ఐఏఎస్ ఆఫీసరు. కోడలు కోటీశ్వరుడు రాజవర్మ గారి కూతురు అనే నేపథ్యంతో నిన్ను వాళ్ళు చూడడం నాకు ఇష్టం లేదు. సంకేత్‌ని వాళ్ళు సంకేత్‌గానే చూడాలి. నిశితను నిశితగానే చూడాలి! అందుకే సదానందం గారితో అలా అన్నాను. మన కుటుంబ విషయాల్లో దాపరికం ఉండ



ఆస్ట్రేలియాలోని కంగారూ జంతువుల్లో 60 రకాల జాతులున్నాయి.

## నవ్యవీక్లీ-నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కవిత




### చిరునవ్వుల సంచిక

పల్లె బస్సు దిగి, సన్నని తార్రోడ్డు దాటి,
కాలవ గట్టున ఊళ్ళోకి సాగే ఒంటరి నడకలో
బాల్య జ్ఞాపకాల ప్రవాహం
నల్లని ఆకాశంలో జున్నుపాల వంటి నెలవంక
మదిలో ఇంకిపోయిన రంగుల ముఖచిత్రం
గడ్డివాముల నుండి వీస్తున్న
ధాన్యపు పరిమళం రెపరెపలు
ప్రసాదం కోసం ఆలయం చుట్టూ
ఎన్ని ప్రదక్షిణల పహారాలో!
ఆనందపు చిలకరింతల దాగుడు మూతలు,
అష్టా చెమ్మాటలు
చిన్ని చిన్ని దూదిపింజల పిల్లల్ని వెంటేసుకుని
గింజలేరి పెడుతున్న కోడి తల్లులు
పరుగు పందాల్లో ఆవు దూడల తువ్వాయిలు
పొలాల్లో నీటి పాయల్లాగా
పొరుగూరు నుండి పెళ్ళి తాంబూలాల రాకపోకలు
వారం సంతలో జీడీమామిళ్ళ రస గుళికలు
అలలై సాగిన టూరింగ్ టాకీసు సినిమా
పాటలు
తేనె వాగుల ఝుంకారంలో నవవసంతం కేరింతగా
హారతి వెలుగులో
పసుపురాసిన బింబానికి కుంకుమదిద్దిన
కొత్త అందం
కొబ్బరాకు చాపచుట్టూ ఆశ్చర్యచకితమైన
కుందేళ్ళ మిత్రబృందం-
అల్లుకున్న అనుభూతులన్నీ అపురూపమై




పల్లె చేరిన ప్రతిసారి
ఒక చిరునవ్వుల సంచిక
బాల్యం సమకూర్చిన ఒక అపురూప కానుక

ఎస్.సుమిత్రాదేవి
సెల్:72075 50867

కూడదన్నది నాన్నగారు నాకు నేర్పిన ఆదర్శం. సదానందంగారూ, ఆయన భార్యా అడిగిన విషయం గురించి రేపు ఆలోచిద్దాం..."

కొరియర్ ద్వారా తనకు వచ్చిన కవర్ని పరిశీలనగా చూసింది నిగమ. నోనా నుంచీ వచ్చింది. సోఫాలో కూచుని కవర్ చింపి, కాగితం మడతని ఇవతలకి లాగింది. చక్కటి దస్తూరీలో ఇంగ్లీషు ఉత్తరం. "డియర్ మదరిన్లా" అంటూ ప్రారంభమైంది నోనా ఉత్తరం.

నిగమ చూపులు అక్షర పంక్తుల వెంట పరుగెడుతున్నాయి. చదువుతున్న నిగమ కనుబొమలు కదిలి ప్రశ్నార్థకాన్ని సృష్టించాయి. ఆలోచన ఆమె నుదురు మీద గీతలు గీస్తోంది. పేరాలు తరుగుతున్నాయి. పేజీలు తిరుగుతున్నాయి. ఉత్తరంలోని అక్షరాల ద్వారా నోనా నిగమ అణువణువునూ ఆశ్చర్యంతో నింపుతోంది.

నోనాను పెళ్ళాడ్డానికి తల్లి అనుమతి సంపాదించేందుకు సాకేత్ ఎంచుకున్న దొంగదారిని




నోనా వివరంగా అక్షరబద్ధం చేసింది. అమ్మను అడగాల్సిన కొడుకు అమ్మే తనను అడిగేలా నాటకం ఆడి, రక్తి కట్టించి పబ్బం గడుపుకున్నాడు! పెళ్ళికి నిరాకరిస్తూ అబార్షన్ చేయించుకోమంటూ తనను మహాక్షోభకు గురిచేశాడంది నోనా. సాకేత్ ఆడిన హీనమైన నెగెటివ్ నాటకంలో తన పాత్ర లేదంది. సాకేత్ అన్న ఏకాంత్ సలహాతో నిగమని ఆశ్రయించానంది.

స్వార్థసాధన కోసం జన్మనిచ్చిన తల్లిని మోసగించిన సాకేత్ నైచ్యాన్ని తల్లి లేని తాను; తల్లి కాబోతున్న తాను సహించలేకపోతోందనీ, మనసుతో, మాటతో, చేతతో తనకు విలువకట్టలేని సహాయం చేసిన అత్తగారి నుండీ సత్యాన్ని దాచడం ఇష్టం లేదనీ, దాచిపెట్టే శక్తిలేదనీ విన్నవించింది నోనా. సాకేత్ అల్లి, అమలు చేసిన పథకం గురించి అతని నోటి ద్వారానే తను ఎలా వినగలిగిందో, ఎందుకు అతను నిజాన్ని కక్కేశాడో నోనా స్పష్టం చేసింది. భవిష్యత్తులో అలాంటి తప్పిదాలు చేయకుండా భర్తను కట్టడిచేయడానికి ప్రయత్నిస్తానంది.

చదవడం ముగించిన నిగమ వేళ్ళ సందుల్లోంచీ ఉత్తరం కిందకి జారింది. తన శరీరంలో రక్తం వేగంగా పరుగులు తీస్తున్నట్టు అనిపిస్తోందామెకి. శరీరం వణకసాగింది. ఎందుకో కళ్ళు మూతలు పడుతున్నాయి. ముళ్ళతీగలతో అల్లిన చిన్నపాటి ఇరుకు పంజరంలో రెక్కలు కొట్టుకుంటూ ఉక్కిరిబిక్కిరవుతున్న పక్షుల్లాగా ఆమె హృదయం కొట్టుకుంటోంది. నోనా ఉత్తరంలో చెప్పిన విషయాలు విచిత్రంగా శబ్ద రూపం ధరించి తన చెవుల్లో మారుమోగుతున్నాయి. కళ్ళమీదికి వాలుతున్న రెప్పల్ని తేలికగా వాలనిచ్చిందామె.

తన కొడుకు తనని ఘోరంగా మోసగించాడు. దగా చేశాడు. వంచనతో మంచితనాన్ని శిరచ్ఛేదం చేశాడు. తన నిజాయితీనీ, నిబద్ధతనూ, నిస్వార్థ గుణాన్నీ, నిర్దుష్టమైన ప్రవర్తననూ, ఆచరణలో పెట్టే ఆదర్శాన్నీ, అన్నీకలిసిన తన వ్యక్తిత్వ బలాన్ని బలహీనతగా మార్చి, దానినే తన బలంగా చేసుకుని అనుకున్నది సాధించుకున్నాడు. నవమాసాలు మోసి కని, పెంచి, పెద్దచేసి, చదువు చెప్పించి చేయి పట్టుకుని తను జీవనయానం నేర్పిన కొడుకు తనను ఏమార్చి ఎగతాళి చేశాడు. అతి తెలివితో అపహాస్యం చేశాడు.

ఒక మనిషిగా, స్వచ్ఛమైన మనిషిగా 'జీవించే' తనను, తన నటనతో ఓడించాడు. అవమానించాడు. అవహేళన చేశాడు. ఆదర్శాన్నే ఆస్తిగా కాపాడుకుంటూ వస్తున్న తన అహాన్ని దెబ్బతీశాడు. తాను పాలిచ్చి ప్రాణం పోసి పెంచిన సాకేత్ తనను ప్రాణమున్న శవంలా మార్చాడు!

కన్నబిడ్డ కన్నతల్లి హృదయానికి కన్నం వేశాడు. తన నీడ ముందు తను సిగ్గుతో తలవాల్చుకునేలా చేశాడు. చెట్టుకొమ్మను చెట్టు నుండీ వేరుచేసి, దానిని గొడ్డలి కర్రగా చేసుకుని, ఆ గొడ్డలితో తల్లివేరును ఖండించి, చెట్టునే కూలగొట్టాడు!

తను ఎక్కడ తప్పుచేసింది? ఎక్కడ పొరపాటు చేసింది? తను ఏ పాపం చేసింది? తాను చక్కటి రాజమార్గంలో వదిలిపెట్టిన కొడుకులు అడ్డదారుల్లోకి మళ్ళి గోడలు ఎందుకు దూకుతున్నారు? ప్రశ్నలు... ప్రశ్నలు...లెక్కలేనన్ని ప్రశ్నలు.. ఎన్నో ప్రశ్నార్థకాలు... ఉక్కుకొక్కేల్లా తన హృదయాన్ని గుచ్చి దూరిపోయి, అన్ని వైపులకూ లాగుతున్నాయి, బలంగా కర్కశంగా... నిగమ చెయ్యి ఆమె ఛాతీ ఎడమ భాగం మీద ఆనింది.

మూతలు పడిన నిగమ కనురెప్పలు చల్లగా, మెల్లగా కదుల్తున్నాయి. మెల్లగా విచ్చుకుని, ఆమెకు చూపును ప్రసాదించాయి. కొలతకు అందని భయంతో తన ముఖంలోకి చూస్తున్న నిశితను చూసిందామె.

"అమ్మా... ఏమైందే?" నిశిత కంఠం వణికింది.

"కళ్ళు... కళ్ళు తిరిగాయి...అంతే.."

గదిలోంచీ సంకేత్ పరిగెట్టుకొచ్చాడు. అతని చేతిలో బీపీ కొలిచే సాధనం ఉంది. మెడలో స్టెతస్కోప్ వేళ్ళాడుతోంది. సంకేత్ సోఫాలో అమ్మ దగ్గరగా కూచుని బీపీ చూశాడు.

"నార్మల్గా ఉంది. ఏమైందమ్మా?" సంకేత్ కంగారుగా అడిగాడు..."

"కొద్దిగా కళ్ళు తిరిగాయి నాయనా...అంతే"

"నిశితా, అమ్మకు వేడి కాఫీ ఇవ్వు!" సంకేత్ అన్నాడు. "అమ్మా, ఈ మధ్య ఎప్పుడైనా షుగర్ టెస్ట్ చేయించుకున్నావా?"

నిగమ బలహీనంగా నవ్వింది. "మీ అమ్మకు చక్కెర వ్యాధి లేదు నాయనా... 'కడుపు తీపి' ఉంది. దాన్ని వ్యాధి అనాలేమో నాకు తెలీదు.."

సంకేత్ అర్థం కానట్టు చూశాడు.

"ఏకాంత్ దూరమయ్యాడు. ఇప్పుడు సాకేత్ వాడికి జత కలిశాడు.."

"ఏం జరిగిందమ్మా?" సంకేత్ కంగారుగా అడిగాడు.

నిశిత కాఫీ కప్పుతో వచ్చింది.

"నిశితా... ఇక్కడెక్కడో ఉత్తరం ఉండాలి.." నిగమ అంది.

"నీ కాళ్ళ దగ్గర పడి ఉంటే తీసి టీపాయ్ మీద పెట్టాను.." కాఫీ అందిస్తూ అంది నిశిత.

"చదివావా?"

నిశిత తీక్షణంగా చూసింది. "నాకు నువ్వు ముఖ్యం. ఆ ఉత్తరం కాదు!"

"సంకేత్... ఆ ఉత్తరం చదువు.." నిగమ నెమ్మదిగా అంది.

సంకేత్ టీపాయ్ మీదున్న ఉత్తరాన్ని అందుకుని చదవడం ప్రారంభించాడు. చదువుతూ మెల్లిగా సోఫాలో కూలబడ్డాడు. పూర్తిగా చదివి ఉత్తరాన్ని మడిచి టీపాయ్ మీద పెట్టాడు.

"సాకేత్ ఎందుకిలా చేశాడు?" ఎవర్నీ ఉద్దేశించకుండా అని, సంకేత్ లేచి, తన గదివైపు వెళ్ళాడు. తలుపుమూసి, మొబైల్ తీసి సాకేత్ నంబరు డయల్ చేశాడు.

కాఫీ ముగించి, మొహానికి పట్టిన చెమట తుడుచుకుని సోఫామీద నీరసంగా వెనక్కి వాలింది నిగమ. నిశిత మౌనంగా ఉత్తరం చదువుతోంది. చదవడం ముగించి, నిగమ వైపు చూసింది. నిగమ ముఖం నీరసంగా ఉంది. ఆమె కళ్ళల్లో మునుపటి కాంతి లేదు. ఓటమి కబళించివేసింది.

"అయితే సాకేత్ ఆడిన నాటకంలో ఏకాంత్ అన్నయ్య కూడా పాత్ర పోషించాడన్నమాట!" నిశిత కోపంగా అంది. "అన్నయ్యలిద్దరూ ఎందుకిట్లా చేశారు. వాళ్ళకి మనం ఏ అన్యాయం చేశాం?"

**(ఇంకావుంది)**








# నిషేధిత ఆహారంపై మనకెందుకు మమకారం!

**చాలామందికి చిరుతిళ్లు అంటే మహా ఇష్టం. అంతే కాదు హెల్దీ డైట్ ఫాలో అవ్వాలని మన క్కూడా ఉంటుంది. ఆ ఉద్దేశంతో ఎన్నో రకాల ఆహారాలు తింటాం. కొన్నింటిని తినడం మానేస్తాం. కానీ కొన్ని దేశాలు ప్రమాదకరమని భావించి నిషేధించిన ఆహారాన్ని మనం మాత్రం ఎంతో ఇష్టంగా తినేస్తూ ఉంటాం. అసలు ఆ దేశాలేంటో, వాళ్ళెందుకలా చేశారో, వాళ్ళు నిషేధించిన ఆహారపదార్థాలేంటో మనం కూడా తెలుసు కుందాం. వీలైతే అలా ఫాలో అయిపోదాం!**

అవును! మనం రోజువారీ ఇష్టంగా తినే కొన్ని ఆహార పదార్థాలను కొన్ని దేశాలు నిషేధించాయి. వాటిని అస్సలు తినకూడదట. తింటే తప్పని సరిగా జరిమానా చెల్లించాల్సిందేనట! ఇవి తింటే నిజంగా అనారోగ్యం రావచ్చు లేదా దాంట్లో సెంటిమెంట్ ఉండిఉండవచ్చు!

### సమోసాలు..

ఆహ్లాదకరమైన సాయంత్రాల్లో ఇష్టమైన వారితో కలిసి మనం తినే చిరుతిండిలో సమోసా ఒకటి. మనదేశంలోని కొన్ని కొన్ని ప్రాంతాల్లో వీటిని అల్పాహారంగా స్వీకరిస్తారు. మరి అంత పేరు ప్రఖ్యాతులు పొందిన సమోసాపై సోమా లియా దేశంలో నిషేధం విధించారు. ఎందుకో తెలుసా? త్రిభుజాకారంలో ఉండే సమోసా క్రైస్త వుల గుర్తుకి సంకేతంగా ఉందని దీన్ని ఓ ఇస్లా మిక్ సంస్థ ఆ దేశం నుంచే నిషేధించింది.





### టమోటా కెచప్

బజ్జీలు, సమోసాలు, ఇంకా ఇతర చిరుతిళ్లను టమోటా కెచప్‌తో కలిపి తింటే ఆ రుచి ఎంత మధురంగా ఉంటుందో కదా! తియ్యతియ్యగా పుల్లగా ఉండే టమోటా కెచప్‌ని వట్టిగా తినేవాళ్లు కూడా చాలామందే ఉన్నారు. కానీ ఫ్రాన్స్ పాఠశాలల్లో మాత్రం టమోటా కెచప్‌కి ఎంట్రీ లేదు. అక్కడ పాఠశాలల్లో టమోటా కెచప్‌ను అనుమతించరు. దీనివల్ల ఫాస్ట్‌ఫుడ్ పైనే పిల్లలు మక్కువ చూపిస్తు న్నారట! సంప్రదాయ ఆహారం తినకుండా, పిల్లలు ఫాస్ట్‌ఫుడ్‌కి అలవాటు పడతారని ఫ్రాన్స్‌లో పాఠ శాలలు ఈ నిర్ణయం తీసుకున్నాయి.

### కిండర్ జాయ్

షాపుకి వెళ్తే కొనివ్వమని పిల్లలు బలవంతం చేసే మరో ఐటెం కిండర్ జాయ్. అయితే ఈ కిండర్ జాయ్‌ను అమెరికాలో నిషేధించారు. కిండర్‌జాయ్‌ని మన వెంట తీసుకెళ్ళడాన్ని, తిన డాన్ని కూడా ఒప్పుకోరట. కిండర్‌జాయ్‌లో చాక్లె ట్‌తో పాటు ఓ ప్లాస్టిక్ బొమ్మ వస్తుంది కదా ఆ ప్లాస్టిక్ బొమ్మని పిల్లలు చాక్లెట్ అనుకుని తినే ప్రమాదం ఉందని భావించిన అమెరికా అధి కారులు బాలల ఆహారభద్రత నిమిత్తం దాన్ని నిషేధించారు.

### చూయింగ్ గమ్

టైంపాస్‌కి నమలడమే కాదు చూయింగ్ గమ్ తినడంవల్ల దవడ కండరాలకు మంచి వ్యాయామం కూడా లభిస్తుంది. అయితే సింగపూర్‌లో మాత్రం చూయింగ్‌గమ్ తినడం నిషిద్ధం. సింగపూర్‌లో ఎవరైనా చూయింగ్ గమ్ తిని అక్కడి రోడ్లపై ఉమ్మేస్తే మన కరెన్సీలో 32 వేల రూపాయల జరిమానా పడుతుంది. ఎందుకంటే అక్కడ పరిశుభ్రతకు చాలా విలువ ఇస్తారు. మరి ఉమ్మేసి రోడ్లు పాడు చేస్తే చూస్తూ ఊరుకోం అని అధి కారులు హెచ్చరిస్తున్నారు.

### బాదాం పప్పు

సరే అవన్నీ పర్లేదు మరి బాదాంపప్పు మంచి రుచికరమైన ఆహారం. పౌష్టికరమైనది కూడా. కానీ దాన్నెందుకు బ్యాన్ చేశారని ఆలోచిస్తున్నారా? అవునండీ, అది నిజమే కానీ కాలిఫోర్నియాలో మాత్రం పచ్చిబాదాం అమ్మడం నిషేధమట. బాదాం, బ్యాక్టీరియాకు కారణమవుతాయని దీనివల్ల ఆరోగ్యం పాడవుతుందని వీటిని బ్యాన్ చేశారట.

### పచ్చిపాలు, జెల్లి స్వీట్స్

పచ్చిబాదాం లాగే పచ్చిపాలను కూడా కెన డాలో నిషేధించారు. బ్యాక్టీరియానే దీనికి కారణ మట. అలాగే జెల్లీస్వీట్స్ అంటే పిల్లలే కాదు చాలామంది పెద్దలు కూడా ఇష్టపడతారు కదా! కానీ వీటి అమ్మకాలను యూకే, యురోపియన్ యూనియన్‌లలో నిషేధించారు. వీటిల్లో కొంజక్ అనే ఓ మందమైన పదార్థం ఉంటుందట. ఇది పిల్లలకు మంచిదికాదన్న భావనతో అక్కడ జెల్లి స్వీట్స్‌ను నిషేధించారు.

### అబ్సింతే, భంగు

అబ్సింతే అనేది ఒక ఆల్కహాలిక్ డ్రింక్. దీన్ని అమెరికా, న్యూజిలాండ్, కెనడాల్లో బ్యాన్ చేశారు. ఇది ఎక్కువగా తీసుకోవడంవల్ల హింసాత్మకంగా మారిపోతారట. దీనివల్ల చెడుపనులు చేస్తారని భావించి చాలా దేశాల్లో నిషేధించారు. అదేవి ధంగా చాలా సందర్భాల్లో భారతీయులు సేవించే భంగును కూడా చాలా దేశాల్లో బ్యాన్ చేశారు. ఇందులో ఎక్కువ మోతాదులో కన్నాబీస్ అనే పదార్థం ఉంటుందట. ఇది ఆరోగ్యానికి మంచిది కాదట. కాబట్టి ఏది ఆరోగ్యానికి మంచిదో వాటిని మాత్రమే స్వీకరించడం మేలు!

- రాణాప్రతాప్

# బుల్లెట్

## -వాణిశ్రీ



**ఆలస్యమైనా, హైదరాబాద్‌లో అసిస్టెంట్ పోలీస్ కమీషనర్‌గా పని చేస్తున్న చైతన్య సంబంధం కుదిరింది లహరికకు. పాతికేళ్ళొచ్చినా కూతురికి పెళ్ళికాలేదనే దిగులు మాయమైంది ఆమె తల్లికి.**

**పెళ్ళిచూపుల్లో చైతన్యను చూసిన ఆమె ఫ్రెండ్స్ 'నీ కాబోయే శ్రీవారు ఆరడగుల బుల్లెట్టే' అని ఆట పట్టిస్తుంటే, గర్వంతో ఆమె హృదయం వరద గోదారిలా ఉప్పొంగింది.**

కళ్యాణపురంలో కొత్తగా కట్టిన కల్యాణ మండపంలో చైతన్య, లహరికల పెళ్ళి వైభవంగా జరిగింది. పెళ్ళయిన తర్వాత అత్తగారింటికి చేరుకున్న చైతన్యకు వాళ్ళ పాత ఇల్లు నచ్చలేదు. 'ఆ రాత్రికి ఇంట్లో శోభనం అస్సలు కుదరదన్నాడు. లహరికను మనతో తీసుకెళ్దాం' అని పేచీ పెట్టాడు. 'అత్తారింట్లో కొత్తల్లుడు మూడు నిద్రలు చేయడం సంప్రదాయం రా' అని తల్లి చీవాట్లు పెట్టింది. అయితే మూడు రోజులూ హోటల్లో ఉంటానన్నాడు చివరికి. ఇంక తప్పక హోటల్లోనే శోభనం ఏర్పాట్లు జరిగాయి.

చైతన్య తల్లిదండ్రులు, బంధువులంతా స్పెషల్ బస్సులో బయల్దేరి హైదరాబాద్ వెళ్ళిపోయారు.

ఆ రాత్రి శోభనం.

•••

కళ్యాణపురంలో ఈ మధ్యనే ఒక హోటల్‌ని అధునాతనంగా నిర్మించారు. కారు పోర్టికోలో ఆగింది. లహరిక కారు దిగింది. అప్పటికే ముత్తైదువలు అక్కడికి చేరుకున్నారు.

"రావే! శోభనం పెళ్ళికూతురా!" అని మేనత్త ఆమెతో వేళాకోళమాడింది.

హోటల్ గదిలో మంచం మీద కూర్చున్న చైతన్య అందర్నీ చూసి లేచి నిలబడ్డాడు. లహరిక గుమ్మం దగ్గర నిలబడి తలెత్తి చూసింది. తెల్లటి సిల్కు లాల్చీ, పైజమాలో మెరిసిపోతున్నాడు చైతన్య. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి.

"ఆరడుగుల బుల్లెట్టు ఎదురు చూస్తుంటే ఇంకా నిలబడ్డావేం?" అంటూ ఆమెను ఎవరో ముందుకు నెట్టారు.

అంతా పకపక

నవ్వుతున్నారు. వాళ్ళ నవ్వులు మంగళ వాయిద్యాల్లా వినిపిస్తున్నాయి ఆమె చెవు లకు.

లహరిక తలెత్తి గదినంతా పరికించి చూస్తోంది. శృంగార దృశ్యాలున్న పెయింటింగ్స్ చూసి సిగ్గు పడింది. ఒక మూల టీపాయ్ మీద స్వీట్స్, పళ్ళు షాపులో మాదిరి పేర్చి ఉన్నాయి. అగరుపొగలు గదిలో కమ్ముకుంటున్నాయి. బెడ్‌మీద గులాబీలు, మల్లెమొగ్గలతో గుండె ఆకారం, మధ్యలో మన్మథబాణం, స్వీట్‌డ్రీమ్స్ అనే ఇంగ్లీష్ అక్షరాలు అలంకరించి ఉన్నాయి. ఆమెకు ఏదో కొత్తలోకంలోకి అడుగు పెట్టినట్టు అనుభూతి కలిగింది.

ఆ తర్వాత పురోహితుడు వధూవరులను మంచం మీద కూర్చోబెట్టి మంత్రాలు చదివి చేతులు కలిపి, ముహూర్తం దగ్గర పడిందని అందర్నీ పంపించి తనూ నిష్క్రమించాడు.

చైతన్య మంచం దిగి ఒళ్ళు విరుచుకున్నాడు.

“లహరికా! ప్రతిదానికీ ముహూర్తం ఏమిటి? మనిషి ముహూర్తం చూసుకుని పుడుతున్నాడా? ముహూర్తం చూసుకుని పోతున్నాడా? అంతా చాదస్తం” అన్నాడు.

లహరిక గూడా మంచం దిగింది.

“ఇప్పుడు అదంతా అవసరమా? ఎవరి నమ్మకాలు వారివి. పోనివ్వండి” అన్నది.

“నిన్నెక్కడికి పోనిస్తాను? తెల్లారాకే పోనిచ్చేది” అంటూ ఆమెను కౌగలించుకున్నాడు.

“ఉండండి. మీకు పాలు ఇస్తాను” అంటూ అతని కౌగిలి విడిపించుకుని టీపాయ్ మీద ఉన్న ఫ్లాస్క్‌లోని పాలు గ్లాసులోకి వంచి తెచ్చి అతనికి అందించింది.

అతను గ్లాసు అందుకుని గటగట తాగేసి ఖాళీ గ్లాసు ఆమెకు ఇచ్చాడు.

“ఏంటి? నీకు పాలు మిగల్చలేదని ఫీలవుతున్నావా? నాకు ఇటువంటి ఫార్మాలిటీస్ నచ్చవు” అంటూ ఆమెను అనకొండలా చుట్టేశాడు.

“తెల్లచీర కట్టుకున్నది ఎవరికోసమో? మల్లెపూలు పెట్టుకున్నది ఎవరికోసమో..?” ఆమె చెవిలో గుసగుసలుగా హమ్ చేస్తున్నాడు.

“ఊ... మీ కోసమే!” అని నవ్వింది. ఆమె గొంతు వీణ మీటినట్టుంది.

“నవ్వితే నీ అందం రెట్టింపు అవుతుందోయ్ లహరికా! పెళ్ళిచూపుల్లో నీ నవ్వు చూసే పడిపోయాను. తొలిచూపులోనే నా మనసు లాగేశావు” అంటూ గులాబీ మొగ్గల్లాంటి ఆమె పెదవులపై తన పెదవులను ఆనించాడు. ముద్దులు కురిపిస్తున్నాడు. పువ్వుపై వాలిన తేనెటీగలా అధరామృతం గ్రోలసాగాడు. కుడిచేతిని వెనక్కి పోనిచ్చి




ఆమె పూలజడ తడుముతూ, ఇంకా చేతిని కిందికి పోనిచ్చి నడుము వంపుని సున్నితంగా నొక్కాడు. అతని స్పర్శతో ఆమె శరీరం పులకరించిపోతోంది.

గాఢమైన కౌగిలిలో ఇద్దరి శరీరాలు వేడెక్కిపోతున్నాయి. చల్లటి ఏసీ గాలిలో కూడా చిరు చెమట్లు పడుతున్నాయి. లహరిక మనసు గాలిలో తేలిపోతోంది. గుండె వేగం హెచ్చింది. మత్తులో కళ్ళు మూతలు పడుతున్నాయి. తొలి సంగమం అనుభవం ఇలాగే ఉంటుందేమో? అనుకుంది.

అతను పైట తొలగించి, జాకెట్ హుక్స్ తీస్తున్నాడు. అతని చేతులు గుండెల మీద ఆనగానే ఆమెకు అంతులేని ఆనందం కలుగుతోంది. శరీరంలో విద్యుత్తు ప్రవహిస్తోంది. అతను దుస్తులు తొలగిస్తుంటే సహకరిస్తోంది. ఆమెలో తపన, తమకం, మైకం కమ్ముకొస్తున్నాయి. ఆమెలో అణువణువూ పులకరించిపోతోంది. తనను అతనికి అర్పించుకోవడానికి తహతహలాడుతోంది.

ఇద్దరూ బెడ్‌పైకి ఒరిగిపోయారు. ఆమె తనువంతా పెదాలతో ముద్రలు వేస్తూ ఒంపుసొంపుల కొలతలను ఆస్వాదిస్తూ ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు. వారి శరీరాల కింద నలిగి పోతున్న పూలు సువాసనలు వెదజల్లుతున్నాయి. వారి శరీరాలు తాచుపాముల్లా పెనవేసుకున్నాయి. ఇద్దరూ సరికొత్త అనుభవంలో మునకలు వేస్తున్నారు. స్వర్గం అంచులకు చేరుకుంటున్నారు.

"లహరికా! లహరికా!...లే.. సాయంకాలం ఐదు దాటింది. ఇంకెంతసేపు నిద్రపోతావు?.." మేనత్త ఆమెను కుదుపుతోంది.

లహరిక కళ్ళు తెరిచింది. ఎదురుగా మేనత్త నవ్వుతూ కనిపించింది. అంతా కలన్నమాట. కలలో స్వర్గలోక విహారం చేస్తున్న తనను డిస్టర్బ్ చేసినందుకు ముఖం చిట్లించి చూసింది మేనత్త వైపు.

"ఏంటీ, కలలు కంటున్నావా? ఏం చేశాడేం మీ ఆయన.." అని మేనకోడలి బుగ్గలు చిదిమింది ఆమె.

"ఏంటత్తా నువ్వు...?" అన్నది లహరిక సిగ్గు పడుతూ.

●●●

రాత్రి పది దాటిన తర్వాత చైతన్యకి పిలుపు వచ్చింది హోటల్‌కి వెళ్ళడానికి. అతని చినమామ వెనుక డోర్ తెరిచి పట్టుకుని 'రండి అల్లుడు గారూ!' అని స్వాగతం పలికాడు. డ్రైవర్ పక్కన కూర్చున్నాడు పురోహితుడు.

"పంతులుగారు ఎక్కడికండీ?" తన పక్కన కూర్చున్న చినమామని అడిగాడు చైతన్య.

"అక్కడ మంత్రాలు చదవాలి కదండీ" అన్నాడు ఆయన.

"చాదస్తం మనుషులు" అని గొణుక్కున్నాడు.

హోటల్, ఏ.సి. రూమ్‌లోకి తీసుకెళ్ళారు చైతన్యని. గదిలోని మంచం మీద వధూవరులను ఎదురెదురుగా కూర్చోబెట్టి మంత్రాలు చదవడం మొదలుపెట్టాడు పురోహితుడు.

ఆ తతంగం అయ్యాక ఇద్దరి చేతులు కలిపాడు.

"అయ్యా! పదకొండూ ఇరవై నిమిషాలకు సుముహూర్తం. ఇప్పుడు పదకొండు. ఇక మీదే ఆలస్యం....!" అని చైతన్యవైపు చూసి నవ్వాడు పంతులుగారు.

"అంతా బైటకు పదండమ్మా!" చుట్టూ చేరిన ఆడవాళ్ళతో అన్నాడు సైగలు చేస్తూ.

అంతా ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ చలోక్తులు విసురుతూ వెళ్ళిపోయారు. గది ఖాళీ అయింది. ఇద్దరే మిగిలారు.

చైతన్య 'హమ్మయ్య' అనుకుంటూ మంచం మీద నుంచి కిందకి దిగాడు.

"గంట కూర్చోబెట్టాడు పంతులు. కాళ్ళు పట్టుకుపోయాయి. ఫస్ట్‌నైట్‌కి ముహూర్తాలేమిటి? నాన్సెన్స్. వీళ్ళు మారరు" విసుగ్గా అన్నాడు కాళ్ళు జాడిస్తూ.

చైతన్య గది అంతా కలియ తిరిగాడు. లహరిక మంచం దిగి వెళ్ళి టీపాయ్ మీద ఉన్న ఫ్లాస్క్ లోంచి పాలు గ్లాసులోకి వంచి తెచ్చింది.

"ఊఁ పాలు తాగండి" సిగ్గుతో క్రీగంట అతని వైపు చూస్తూ గ్లాసు అందించింది.

చైతన్య గటగటా పాలు తాగి ఖాళీ గ్లాసు ఆమె చేతికి అందించాడు. అచ్చం కలలో జరిగినట్టే ఆమె కోసం గ్లాసులో పాలు ఉంచలేదు.

అతను పచార్లు చేస్తూ మాట్లాడుతున్నాడు.

"లహరికా! నువ్వు పోస్ట్ గ్రాడ్యుయేట్‌వి కదా? జాబ్ చేయాలని ఉందా?" అని ప్రశ్నించాడు.

"చెయ్యాలని ఉంది. కాని ఇప్పుడు కాదు. మన పిల్లలు స్కూలుకి వెళ్ళడం మొదలు పెట్టిన తర్వాత జాబ్ చేస్తాను. అప్పుడు తీరిక ఉంటుంది. నాది ఫిజిక్స్ సబ్జెక్ట్ కాబట్టి ఏ ప్రైవేట్ కాలేజీలో అయినా జాబ్ ఇస్తారు".

"గుడ్! నీ ప్లానింగ్ బాగానే ఉంది" అని మెచ్చుకున్నాడు. లహరికకు సంతోషం కలిగింది.

"ఇంకేంటి సంగతులు?" అని అడిగాడు.

"మిమ్మల్ని మా వాళ్ళంతా ఆరడుగుల బుల్లెట్టు అంటున్నారండీ! సిగ్గుపడుతూ చెప్పింది.

"ఆఁ.. ఆరడుగులు ఉన్నోళ్ళంతా బుల్లెట్లేనా? ఫెంటాస్టిక్" అని పకపక నవ్వాడు.

తర్వాత నెమ్మదిగా వెళ్ళి బెడ్‌మీద కూర్చున్నాడు. ఆమెవైపు తదేకంగా చూస్తున్నాడు. జరీ అంచు పల్చటి తెల్లటి నేత చీరలో, తలనిండా మల్లెచెండులు, పిరుదులను తాకుతున్న పూల జడతో, నిండు యవ్వనంలో కళకళలాడుతోంది. గుండ్రటి ముఖం చందమామల వెలుగులు కురిపిస్తోంది. పెద్ద పెద్ద కళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. కోటేరువంటి ముక్కు ఆమె అందానికి మెరుగులు దిద్దుతోంది. ఆపిల్ పళ్ళ కంటే లహరిక బుగ్గలే ఎర్రగా ఉన్నాయి. ఎర్రగులాబీ మొగ్గల్లాంటి పెదవులు చిరునవ్వుతో అదురుతున్నాయి.

"నువ్వు నాకు నచ్చావు లహరికా!" అన్నాడు కళ్ళు పెద్దవి చేసి.

'నచ్చబట్టే కదా పెళ్ళిచేసుకున్నావు' అని గొణుక్కుంది.

అతను కబుర్లతో కాలక్షేపం చేస్తున్నాడు.



# బాలీవుడ్ ప్లానింగ్ బాగుంటుంది

*దక్షిణాది హీరోయిన్లను బాలీవుడ్ ఎప్పుడూ ఊరిస్తూనే ఉంటుంది. ఛాన్స్ దొరికితే అక్కడ పాగా వేయడానికి ప్రయత్నిస్తూనే ఉంటారు. తెలుగు తమిళ సినిమాలతో బిజీగా ఉన్న అమీజాక్సన్‌కి బాలీవుడ్ ప్లానింగ్ బాగా నచ్చుతుందట! బాలీవుడ్‌లో ఓ సినిమా మొదలెట్టేటప్పుడే ఎన్నిరోజులు షూటింగ్ చేయాలి? ఎప్పుడు విడుదల చేయాలి? సినిమా ప్రమోషన్ ఎలా చేయాలి? ఇలా అన్ని విషయాల్లోనూ పక్కా ప్లానింగ్ చేసుకుని మరీ షూటింగ్ మొదలెడతారట! దక్షిణాదిన ఈ వాతావరణం కనపడకపోయినా, ఫలితాలు మాత్రం సూపర్‌గా వస్తాయంటోంది. అసలు అమీ దక్షిణాదిని ఉత్తరాదితో పోల్చి తిడుతోందా? లేక పొగుడుతోందా? అని పలువురు అనుమానం వ్యక్తం చేస్తున్నారు.*

చూపులతో తడుముతున్నాడు. పురోహితుడు నిర్ణయించిన సుముహూర్తం గూడా దాటిపోయింది. అతను తన దగ్గరికి వచ్చి ముద్దులు కురిపిస్తాడనీ, పైట లాగి జాకెట్ హుక్స్ తీస్తాడనీ, గుండెల్లో ముఖం పెట్టి కితకితలు పెడతాడనీ, కౌగిలిలో ఉక్కిరిబిక్కిరి చేస్తాడనీ, తను పగటి కల గన్నట్టు జరుగుతుందనుకున్న లహరికకి అవేమీ జరిగే ఛాయలు కనబడక పోయేసరికి నిరాశ కమ్ముకుంటోంది.

అతనితోపాటు కబుర్లతో కాలక్షేపం చేయడం విసుగ్గా ఉంది. అప్పుడప్పుడు ప్రశ్నార్థకంగా అతని కళ్ళల్లోకి చూస్తోంది చొరవ చూపమని. కాలేజీలో ఫ్రెండ్స్ గురించి, బంధువుల విషయాలు, ఏవేవో అడుగుతుంటే యాంత్రికంగా జవాబులు చెప్తోంది.

ఆరడుగుల బుల్లెట్ తుస్సుమన్నదా? పోలీస్ ఆఫీసర్ అనీ, గ్రీకువీరుడిలా కండలు తిరిగిన వాడనీ ఎంతో మురిసిపోయిన లహరికకి అతని మీద అనుమానం మొదలైంది. శోభనం రాత్రి ఇట్లాగేనా గడిపేది? అయ్యగారి రసస్పందన ఏది?

ఇన్నాళ్ళూ బంజరు భూమిలా నెర్రెలు విచ్చిన తన హృదయం మీద వర్షపు జల్లు కురిపిస్తాడనుకుంటే, నల్లటి మేఘాలే కనిపించడం లేదు. ఇక ఉరుముల మెరుపుల వర్షం కురిసేది ఎక్కడ?

ఆశా నిరాశల మధ్య ఆమె మనసు హోరు గాలిలో చిగురుటాకులా వణుకుతోంది.

"లహరికా! ఏంటలా నిలబడిపోయావు? రా..." అన్నాడు.

'హమ్మయ్య' అనుకుంటూ నెమ్మదిగా అడుగులు వేస్తూ వెళ్ళి బెడ్‌మీద కూర్చుంది.

తర్వాత అతను లైట్లు ఆర్పాడు. బెడ్‌లైటు గుడ్డి దీపంలా వెలుగుతోంది.

"ఇక పడుకో..." అన్నాడు తను పడుకుంటూ.

బెలూన్‌లో గాలిపోయి తుస్సుమన్నది. లహరిక పడుకున్నదే గాని ఆమెకు నిద్ర రావడం లేదు. ఎన్నెన్నో మధురోహలతో గదిలోకి అడుగు పెట్టిన ఆమెను నిరాశ వేధిస్తోంది.

'ఏంటి ఈయనగారి సంగతి? మగాడైతే తొలి రాత్రి పక్కనే ఉన్న భార్యను ముట్టుకోకుండా ఉంటాడా?'

కాలం కరుగుతోంది. ఏ క్షణంలో అయినా అతను తనపై చెయ్యివేసి, తనవైపు తిప్పుకుంటాడనీ, ముద్దులతో మురిపిస్తాడనీ, కౌగిలిలోకి తీసుకుంటాడనీ, స్వర్గలోకపు అంచులకు తీసుకు వెళ్తాడనే ఆశ నిరాశ అయిపోయింది. ఆమె హృదయం ముక్కలవుతోంది.

అటూ ఇటూ దొర్లుతున్న ఆమెతో "నిద్ర పట్టడం లేదా?" అని అడిగాడు.

'నీ మొహం' అందామనుకుంది. బాగోదని 'ఊ....' అన్నది. ఆమె పెదవులు బాధతో వణుకు తున్నాయి.

"కొత్త ప్లేస్ కదా! అంతే మరి" అన్నాడు ఏదో గొప్ప విషయం కనిపెట్టిన వాడిలా. ఆమెకు ఒళ్ళు మండుతోంది.

'ఛీ... కలలన్నీ కల్లలయ్యాయి'.

ఆమెకు ఎప్పటికో నిద్రపట్టింది.

లహరికకి మెలకువ వచ్చేసరికి బాగా తెల్లారిపోయింది. గది కిటికీలు, తలుపులు బార్లా తీసి ఉన్నాయి. కారిడార్లో ఏదో గొడవ జరుగుతోంది. ఆమె లేచి గుమ్మం దగ్గరికి వెళ్ళింది. అక్కడ ఇన్ స్పెక్టర్, కానిస్టేబుల్స్ ఉన్నారు. వాళ్ళ మధ్య గోల్డ్ కలర్ ఖద్దరు సిల్క్ బట్టల్లో గున్న ఏనుగులాంటి మనిషి బెదురుగొడ్డులా చూస్తూ నిలబడి ఉన్నాడు.

"నువ్వేనేరా ఈ హోటల్ ప్రొప్రయిటర్? ఏం పేర్రా నీది?" దబాయిస్తున్నాడు చైతన్య.

"బుచ్చిబాబు సార్!" వణుకుతూ చెప్పాడు.

"రాస్కెల్! రూముల్లో కెమేరాలు పెట్టిస్తావా? ఎప్పట్నుంచి చేస్తున్నావురా బూతు సీడీల వ్యాపారం" అని ఎడా పెడా చేత్తో, కాలితో తన్నడం మొదలు పెట్టాడు చైతన్య. కింద పడినా వదలకుండా, కసితీరా కుళ్ళ బొడుస్తున్నాడు. పోలీసులు, హోటల్ స్టాఫ్ విడ్డూరంగా చూస్తున్నారు. తన శోభనం రాత్రి భగ్నం చేసినందుకు బుచ్చిబాబు మీద మండిపోతున్నాడు.

"హోటల్ సీజ్ చెయ్యండి. ఈ రాస్కెల్ మీద నాన్ బెయిలబుల్ కేసులు బుక్ చేసి కోర్టుకి పంపండి. ఈ ఊళ్ళో సీడీల షాపులు చెక్ చెయ్యండి" పోలీసులతో చెప్పాడు.

ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్స్ సెల్యూట్ చేసి, కింద పడిన బుచ్చిబాబుని ఈడ్చుకుంటూ లాక్కెళ్తుంటే భయంగా చూస్తోంది లహరిక. ఉగ్ర నరసింహావతారంలా కనిపిస్తున్నాడు చైతన్య.

అంతా వెళ్ళిపోయాక శాంతించాడు. లహరికను చూసి "ఏంటి భయపడ్డావా? నేరస్థులు దొరికితే అంతే నేను" అని నవ్వాడు.

"పద వెళ్దాం.." ప్రశాంత వదనంతో చెప్పాడు. లహరిక భుజం మీద చేతులు వేసి నడిపిస్తూ అన్నాడు. "ఇక్కడొద్దు. ఈ రాత్రి శోభనం మీ ఇంట్లో పట్టెమంచం మీద ఏం?" అన్నాడు.

లహరిక సిగ్గుతో ముడుచుకుపోయింది. రాత్రి అతని ప్రవర్తన చూసి అపార్థం చేసుకున్నందుకు నొచ్చుకుంది. బలమైన కారణంతోనే తనను ముట్టుకోలేదని తెలుసుకోలేక పోయింది. చైతన్య పోలీస్ ఆఫీసర్ కాబట్టి ఎక్స్‌రే కళ్ళతో రూమ్ అంతా శోధించి కెమేరాలున్నట్టు కనిపెట్టాడు. లేకపోతే తమ శృంగార దృశ్యాలు, కామకలాపాలు సీడీల కెక్కి ప్రపంచంలో రసికులకు కనువిందు చేస్తూండేవి. వామ్మో! ఎంత ప్రమాదం తప్పింది?' లహరిక ప్రశంసాపూర్వకంగా చైతన్య చేతిని పట్టుకుని నొక్కింది.

**సెల్:93900 85292**

## తమ్ముకేమైంది?

*ఓ పక్క హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమా చేస్తూ మరో పక్క ఐటెంసాంగ్స్ చేయడం తమన్నాకే సాధ్యమైందేమో అంటున్నారు టాలీవుడ్ జనాలు. 'జనతా గ్యారేజీ'లో తమన్నా అదిరిపోయే ఐటెంసాంగ్ చేయనుందట! మొదట ఈ సాంగ్‌ను ఆ సినిమా హీరోయిన్ సమంతతో చేయించాలని యూనిట్ అనుకుంది. కానీ సమంత ఆ సాంగ్ చేయనని మొండికేయడంతో ఆ పాటను తమన్నా చేస్తోంది. అదిరిపోయే స్టెప్పులతో, హుషారుగా సాగే ఈ పాట ఆ సినిమాకి హైలెట్ అంటున్నారు. ఇప్పటికే బోలెడన్ని హైలెట్స్‌తో 'జనతా గ్యారేజీ' నిండిపోయింది. ఇలాంటి సమయంలో ఈ పాట చేర్చడం సినిమాకి మరింత ప్లస్ పాయింట్ అవుతుందని అంటున్నారు. ఆల్రెడీ తమన్నా ఐటెంసాంగ్ ఉంటే ఆ సినిమా హిట్ అన్న ప్రచారం ఎలాగూ ఉంది కనుక ఈ సినిమా కూడా కచ్చితంగా బ్లాక్ బస్టర్ అవుతుంది అని కొందరు జోస్యం చెబుతున్నారు.*








- రాజశుక

# రాహుల్ సత్తాకు మరో పరీక్ష

**గాంధీజీ హత్యతో ఆర్ఎస్ఎస్‌కు ఎటువంటి సంబంధమూ లేదని కోర్టు తీర్పు వచ్చిన తరువాత కూడా రాహుల్ ఈ హత్యతో ఆ సంస్థకు మరోసారి ముడిపెట్టారంటే, ఇది అంత తేలికగా తీసిపారేయాల్సిన విషయం కాదు.**

రాహుల్ గాంధీ తన నాయకత్వ లక్షణాలను, గుండె నిబ్బరాన్ని, స్థితప్రజ్ఞతను, తెలివితేటలను నిరూపించుకోవడానికి మరో అవకాశం ముందుకు వచ్చింది. మహాత్మాగాంధీ హత్యతో ఆర్ఎస్ఎస్ సంస్థకు సంబంధం ఉందంటూ తాను చేసిన ఆరోపణల తాలూకు పరిణామాలను ఆయన ధీరత్వంతో ఎదుర్కోవాల్సిన సమయం వచ్చింది. క్షమాపణ చెబుతారా? కోర్టు విచారణ ఎదుర్కొంటారా? తేల్చుకోవాలని కోర్టు ఆయనను ఆదేశించింది. మహాత్మాగాంధీ పేరు చెప్పుకునే కాంగ్రెస్ పార్టీకి నాయకుడైన రాహుల్ గాంధీ విచారణనే ఎదుర్కోవాలి తప్ప క్షమాపణ చెప్పడం రాజకీయంగా సరైన చర్య కాదని ఆయన సన్నిహితులే చెబుతున్న నేపథ్యంలో ఆయన గట్టి నిర్ణయానికి రావాల్సి ఉంటుంది. 2014 ఎన్నికల ప్రచార సమయంలో ఆయన మహారాష్ట్రలోని ఠాణేలో ఓ ఎన్నికల ప్రచార సభలో మాట్లాడుతూ, "ఆర్ఎస్ఎస్‌వారు మహాత్మా గాంధీని హత్య చేశారు. ఇప్పుడు ఆ సంస్థకు చెందిన నాయకులే (అంటే బీజేపీ నాయకులే) ఆయన గురించి మాట్లాడుతున్నారు. వారికి సర్దార్ పటేల్ అన్నా గిట్టదు...గాంధీజీ అన్నా గిట్టదు" అని వ్యాఖ్యానించారు.

వివాదాలు, పుకార్లు, అసత్యాలు, దుష్ప్రచారాలతో నిండిపోయి ఉన్న ఈ అంశం గురించి చర్చించడానికి రాహుల్ గాంధీకి కోర్టు ఓ అవకాశం ఇచ్చినట్లయింది. ఆయన ఈ చర్చ ప్రారంభించారు కనుక దీని పరిణామాలను ముఖాముఖీ ఎదుర్కోవాల్సిందే. ఆయన స్థాయి నాయకుడు ఏ ఆరోపణా ఆధారం లేకుండా చేయకూడదు. చరిత్రలో కలిసిపోయిన అంశాన్ని తిరగదోడారు కనుక తన వద్ద ఉన్న కొత్త ఆధారాలేమిటో ఆయన బయట పెట్టాల్సిందే. 1948 జనవరి 30న మహాత్మాగాంధీ హత్య జరిగిన తరువాత, ఎనిమిది మంది మీద విచారణ మొదలైంది. అందులో నాథూరామ్ వినాయక్ గాడ్సే, గోపాల్ గాడ్సే, నారాయణ్ ఆప్టే, మదన్‌లాల్ పహ్వా, వినాయక్ దామోదర్‌దాస్ సావర్కర్, విష్ణు కర్కారే, దత్తాత్రేయ పర్చూరే, మరో వ్యక్తి ఉన్నారు. ఆ వ్యక్తి దిగంబర్ బాడ్గే వద్ద నౌకర్. ఆ నౌకర్ ఓ సహ కుట్రదారు. అయితే, అతను ఆ తరువాత అప్రూవర్‌గా మారిపోయాడు. వారందరి మీదా విచారణ జరిగి, శిక్షలు పడ్డాయి.

అవివాహితుడైన నాథూరామ్ మొదట్లో గాంధీజీ అభిమానే. చివరికి ఆయనే 'బెరెట్టా ఎం 1934' మోడల్ తుపాకీతో గాంధీజీని కాల్చి చంపాడు. ఆయనకు మరణ శిక్ష పడింది. ఆడుతూ పాడుతూ విలాస జీవితాన్ని గడిపేసే ఆప్టేకు కూడా గాడ్సేతో పాటు ఉరి శిక్ష పడింది. ఇందులో బాడ్గే అంతకు ముందే అనేక హత్యలు, దోపిడీలు చేశాడు. గాంధీజీ హత్య కేసులో అతన్ని అరెస్టు చేసే ముందు అతను మొత్తం 37 సార్లు అరెస్టు అయ్యాడు. ఇక పహ్వా 1948 జనవరి 20న గాంధీజీ ప్రార్థన చేసే స్థలానికి దగ్గరలోనే బాంబు పేల్చాడు. ఈ హత్యాయత్నం విఫలమయ్యే సరికి, గోపాల్ గాడ్సే, కర్కారే అక్కడి నుంచి పారిపోయారు. పహ్వాను మాత్రం పోలీసులు పట్టుకున్నారు. అతని మీద విచారణ నత్తనడక నడిచింది. ఆ విచారణ



శీఘ్రంగా జరిగి ఉంటే, నాథూరామ్ ప్రయత్నం ముందుగానే తెలిసిపోయి ఉండేది. ఆలస్యం అయ్యే సరికి, కొద్ది రోజుల్లోనే నాథూరామ్ గాంధీజీ మీద కాల్పులు జరపడానికి అవకాశం వచ్చింది.

## సంస్థపై నిషేధం

సావర్కర్‌కు గాడ్సే బాగా సన్నిహితుడు. గాడ్సే, ఆయన అనుచరులంతా హిందూ మహ సభ అనే సంస్థకు చెందినవారు. దేశంలో హిందూత్వ పరిరక్షణ, ప్రచారమే ఈ సంస్థ ప్రధాన ధ్యేయం. ఇంతకూ గాంధీజీ హత్యతో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్ఎస్ఎస్)కు ఏమైనా సంబంధం ఉందా? అప్పటి హోం మంత్రి వల్ల భాయ్ పటేల్ ఆర్ఎస్ఎస్‌ను 1948 ఫిబ్రవరిలో నిషేధించారు. అయితే, గాంధీజీ హత్యతో ఆర్ఎస్ఎస్‌కు సంబంధం ఉందనడానికి ఎటువంటి ఆధారాలూ లభించకపోవడంతో 1948 జూలైలో చివరికి ఆ నిషేధాన్ని ఎత్తేయాల్సి వచ్చింది. గాంధీజీ హత్యపై విచారణ జరపడానికి అప్పటి కేంద్ర ప్రభుత్వం జీవన్‌లాల్ కమిషన్‌ను నియమించింది. గాంధీ వ్యతిరేక కార్యకలాపాలు శక్తి పుంజుకోవడానికి, గాంధీజీని తొలగిస్తే హిందూ రాజ్యం ఏర్పడడానికి అవకాశం ఉంటుందనే అభిప్రాయం ఏర్పడడానికి కావాల్సిన పరిస్థితులను ఆర్ఎస్ఎస్, హిందూ మహసభ నాయకులు ఉద్దేశపూర్వకంగా సృష్టించారంటూ జీవన్‌లాల్ కమిషన్ తేల్చి చెప్పింది. అయితే, ఆర్ఎస్ఎస్‌కు మాత్రం ఈ హత్యతో ఎటువంటి సంబంధమూ లేదని, ప్రత్యక్ష సంబంధం ఉందనడానికి ఎటు వంటి ఆధారాలూ లభించలేదని అది నిర్ధారించింది. దాంతో ఆర్ఎస్ఎస్ మీద నిషేధాన్ని తొలగించాల్సి వచ్చింది.

గాంధీజీ హత్యకు జరిగిన కుట్రలో ఆర్ఎస్ఎస్‌కు సంబంధం ఉన్నట్టు గాంధీజీ కార్యదర్శి ప్యారేలాల్ ఆరోపించినట్టు వార్తలు వచ్చాయి. అయితే ఆ ఆరోపణలు నిర్ధారణ కాలేదు. గోపాల్ గాడ్సే చెప్పినట్టుగా కొంత సమాచారం బయటికి వచ్చింది. 'మా సోదరులంతా ఆర్ఎస్ఎస్‌లో ఉండేవాళ్లం. నాథూరాం, దత్తాత్రేయ, నేను, గోవింద్ ఆర్ఎస్ఎస్‌లో ఉన్నాం. మేమంతా ఒకే కుటుంబంలా ఉండేవాళ్లం. అయితే, ఆర్ఎస్ఎస్ సంస్థే మమ్మల్ని గాంధీజీ హత్య వంటి చర్యల కారణంగా దూరంగా పెట్టేసింది" అని ఆయన అన్నారట. ఆయన ఓ పదేళ్లకు మించి సంస్థలో ఉండలేదని, 1933లోనే తమ సంస్థను విడిచిపెట్టి వెళ్లిపోయాడని ఆర్ఎస్ఎస్ వాదించింది. సంస్థపై విమర్శలు చేయడంతో ఆయన్ను బయటికి పంపించామని కూడా ఆ సంస్థ పేర్కొంది. గాంధీజీ సిద్ధాంతాలు, సూత్రాలు, అభిప్రాయాలతో తాము ఏకీభవించకపోయినా ఆయనను హత్య చేయడానికి మాత్రం తాము సిద్ధపడలేదని ఆ సంస్థ నాయకులు తెలిపారు. స్వాతంత్ర్య సమరంలో ఆయన ప్రముఖ నాయకుడు అని తామిప్పటికీ త్రికరణ శుద్ధిగా భావిస్తున్నామని ఆర్ఎస్ఎస్ స్పష్టం చేసింది.

## ఆరోపణలు నిలబడతాయా?

నిజానికి గాంధీజీ హత్యతో ఆర్ఎస్ఎస్‌కు సంబంధాలు ఉన్నాయని వాదించింది లేక ఆరోపించింది రాహుల్ మాత్రమే కాదు. రాహుల్ కన్నా ముందు చాలా మంది ఇటువంటి ఆరోపణలు చేశారు. ఆర్ఎస్ఎస్ ఈ ఆరోపణలకు దీటుగా, ధైర్యంగా సమాధానాలిస్తూ వస్తోంది. అవన్నీ అవాస్తవాలని, కేవలం సంస్థపై బురద చల్లే ఉద్దేశంతో చేస్తున్న ప్రచారమని కూడా అది వాదించింది. కొందరు వ్యక్తుల చర్యలకు మొత్తం సంస్థనే తప్పుబట్టడం న్యాయమా అన్నది కూడా ఆలోచించాల్సిన విషయం. గాడ్సే నిజంగా ఆర్ఎస్ఎస్ తరపునో, హిందూ మహసభ తరపునో పనిచేశారా? లేక వ్యక్తిగత కారణాలతో గాంధీజీ హత్యకు సిద్ధపడ్డారా అన్నది ఓ మిస్టరీగా మిగిలిపోయింది. ఆయన చర్య చుట్టూ ఆ తరువాత రాజకీయాలు అల్లుకుపోయినట్టు కనిపిస్తోంది.

కాగా, ఢిల్లీలో మందిర్ మార్గ్‌లో ఉన్న ఆర్ఎస్ఎస్ కార్యాలయానికి మహాత్మాగాంధీ తరచూ వెడుతుండేవారట. హత్యకు కొద్ది నెలల ముందు ఆయన ఆర్ఎస్ఎస్ కార్యాలయానికి వెళ్లారు. అక్కడ స్వయం సేవకులను ఉద్దేశించి ప్రసంగించారు. దేశ విభజన సందర్భంగా శరణార్థులకు పునరావాస చర్యలు కల్పించడంలో ఆర్ఎస్ఎస్ సేవలను ఆయన ఎంతగానో ప్రశంసించారు. సంఘ్ కార్యక్రమాలెన్నిటిలోనో ఆయన పాల్గొన్నారు. ఆర్ఎస్ఎస్ సేవల్లో ఆయన మెచ్చుకోని కార్యక్రమం లేదు. మొత్తానికి ఆర్ఎస్ఎస్ సంస్థ కార్యకలాపాల పట్ల గాంధీజీకి సదభిప్రాయమే ఉండేదని అర్థమవుతోంది.

సుమారు 22 ఏళ్ల వయసులో గాడ్సే ఆర్ఎస్ఎస్‌లో చేరారు. ఆ తరువాత ఆర్ఎస్ఎస్‌ను వదిలిపెట్టి హిందూ మహసభలో చేరారు. ఆ సంస్థకు కార్యదర్శిగా పనిచేశారు. ఉరిశిక్ష పడిన తరువాత గాడ్సే తన చర్యకు కొద్దిగా పశ్చాత్తాప పడినట్టు కనిపించింది. గాంధీజీ హత్య కేసులో కోర్టు ఆయనకు ఉరి శిక్ష విధించిన తర్వాత ఆయన హైకోర్టుకు అప్పీలు చేసుకున్నప్పుడు, ముగ్గురు సభ్యుల ధర్మాసనం ఆయన అప్పీలుపై విచారణ జరిపింది. ఆ ధర్మాసనంలో సభ్యుడైన న్యాయమూర్తి జీడీ ఖోస్లా 'ది మర్డర్ ఆఫ్ ది మహాత్మా' అనే పుస్తకం రాశారు. అందులో గాడ్సే తీరు తెన్నుల గురించి కూడా రాశారు. తనకు మరో అవకాశం లభిస్తే జీవితాంతం శాంతి కోసం, దేశ సేవ కోసం జీవితాన్ని అంకితం చేయగలనని గాడ్సే అన్నట్టు ఖోస్లా తెలిపారని ఆ తరువాత పుకార్లు వ్యాపించాయి. ఇక గాడ్సే తన అప్పీలులో తనకు విధించిన మరణ శిక్షను సవాలు చేయలేదు. తనపై హత్యారోపణ చేయడాన్ని కూడా సవాలు చేయలేదు. గాంధీజీ హత్యకు కుట్ర జరిగిందనే అంశాన్ని మాత్రమే సవాలు చేశాడని ఖోస్లా పేర్కొన్నట్టుగా కూడా తెలిసింది. నిజానికి ఆర్ఎస్ఎస్ రికార్డుల్లో గాడ్సే పేరు ఎక్కడా లేదని ఆ తరువాత వెల్లడైంది. సంస్థ



సభ్యుల పేర్లు, నమోదు విషయంలో ఆ సంస్థలో రికార్డులేవీ లేవని కూడా తెలిసింది. అందువల్ల గాడ్సే ఆ సంస్థ సభ్యుడవునో, కాదో తేల్చి చెప్పడం కూడా దర్యాప్తు అధికారులకు కష్టమైపోయింది.

గాంధీజీ హత్యతో ఆర్ఎస్ఎస్‌కు ప్రత్యక్షంగా ఎటువంటి సంబంధమూ లేదని కోర్టు తీర్పు వచ్చిన తరువాత కూడా రాహుల్ గాంధీ వంటి బాధ్యతాయుత జాతీయ నాయకుడు గాంధీజీ హత్యతో ఆ సంస్థకు మరోసారి ముడిపెట్టారంటే, ఇది అంత తేలికగా తీసిపారేయాల్సిన విషయం కాదు. ఒకవేళ కోర్టు విచారణకు ఆయన సిద్ధపడితే దాన్ని నిరూపించాల్సి ఉంటుంది. ఆయన వద్ద అందుకు సంబంధించిన ఆధారాలేమైనా ఉంటే చూపించాల్సి ఉంటుంది. క్షమాపణ చెబితే, తన ఆరోపణలకు విలువ లేకుండా పోతుంది. రాహుల్ గాంధీ చివరికి ఎటువైపు మొగ్గు చూపుతారో వేచి చూడాల్సిందే. తోటి కాంగ్రెస్ నేతలు మాత్రం రాహుల్ గాంధీ క్షమాపణ చెప్పే ప్రసక్తి లేదని, అవసరమైతే కోర్టు విచారణ ఎదుర్కొంటారని తెగేసి చెబుతున్నారు. కోర్టు విచారణకు సిద్ధపడితే దేశ రాజకీయాలు కొత్త మలుపు తిరుగుతాయనే అనుకోవాలి.




**ఆర్ఫనేజ్ హోమ్ నుంచి తిరిగి వస్తుంటే, దార్లో కర్కరే గుర్తొచ్చాడామెకు. ఎంత ప్రయత్నం చేసినా ఆమెకు అతడిపైన ఎలాంటి ఫీలింగ్ కలగడం లేదు. అయితే ఒక ఆపద్బాంధవుడిగా మాత్రం కనిపిస్తు న్నాడు. తనని ఇంతమంది బారి నుంచి రక్షిస్తున్న రక్షకుడిలా కన్పిస్తున్నాడు.**

**అతనితో జీవితం ఎలాగైనా ఉండవచ్చు. ప్రస్తుతం తన ఫీలింగ్స్ అవే.**

**శ్రీకర్ బాధపడవచ్చు. అదీ కొద్ది కాలమే! అతడి జీవితంలోకి కొత్త వ్యక్తి వస్తుంది. ఈసారి సంప్రదాయబద్ధంగా 'నాతిచరామి' అంటూ అతడు స్వీకరిస్తాడు. అతడి కుటుంబం కోరుకున్నట్లు ఉంటుందామె. ఆమె ద్వారా శ్రీకర్ వంశం నిలబడుతుంది. శ్రీకర్ సంతోషంగా ఉంటాడు.**

'శ్రీకర్...ఒక నిమిషం ఆమె ఆలోచనలు ఆగాయి. కళ్ళల్లో నీళ్ళెందుకో గిర్రున తిరిగాయి. అతడితో జీవితం ఇక తనకొక స్వప్నం. అది అందమైందా? కాదా? అన్నది వేరే విషయం. తను వెళ్ళిపోతుంది. దూరంగా...చాలా దూరంగా...ఏడు సముద్రాల ఆవలికి.

అసలు శ్రీకర్‌తో సహజీవనానికి కూడా ఒప్పు కోకపోయి ఉంటే బావుండేది. అతన్ని బాధ పెడు తున్నానేమో అన్న బాధ ఎక్కడో కదలాడింది. కానీ తప్పదు. అతడితోనే ఉంటే... ఇద్దరు ముగ్గురు బిడ్డలకు తల్లిగా మారితే...అందం జారిపోతేనో... అతడు ఎవర్నైనా పిచ్చి చూపులు, పక్క చూపులు చూస్తేనో, తనని నియంత్రించాలని అనుకుంటేనో... సంఘర్షణ జనిస్తుంది. ఆత్మాభిమానం దెబ్బతింటుంది.

ఇద్దరిలో ఎవరైనా ఘర్షణ పడవచ్చు. ఆ ఘర్షణలో పిల్లలెందుకు సమిధలు కావాలి? తాను అతడినుంచి దూరమైనా...అతడు తననుండి దూరమైనా పిల్లలెందుకు బలి పశువులు కావాలి. వివాహ వ్యవస్థలోని 'డొల్లతనం' ఆమెలో వేరే ఆలోచనలు లేకుండా చేస్తోంది.

'తాళి' కోసం వంచిన మెడ కసాయిని నమ్మిన గొర్రెలాగా కన్పిస్తోంది. తనని వధిస్తాడని తెలి సినా, కసాయి వెంట అమాయకంగా నడిచే గొర్రె లానే కన్పిస్తోంది. మూడు ముళ్ళు వేసినందుకు, ఏడడుగులు నడిచినందుకు జీవితకాలం ఏడుస్తూ గడిపే వందలాది జీవితాలు ఆమె కళ్ళముందు గోచరిస్తున్నాయి.

పిల్లల కోసమో, ఉపాధి కోసమో ఆత్మగౌర వాన్ని పణంగా పెట్టి జీవించే అతివలు కన్పిస్తు న్నారు. లాకుల్లోంచి ఉబికి వచ్చే నీళ్ళే కన్పిస్తు న్నాయి. ఇలాంటి కాపురాలే కోకొల్లలు. అటువంటి కూపస్థ అవస్థలోకి తాను పోదలచుకోలేదు. అందుకే తాను బలంగా వ్యతిరేకిస్తోంది. ఇందుకు నాన్న మాత్రమే కారణం కాదు. యావత్ పురుషాధిక్య సమాజమూ కారణమే! అతడు చేస్తే శృంగారం.. ఆమె చేస్తే వ్యభిచారం అవుతుంది.

ద్వంద్వ సమాజం...రెండునాల్కల సమాజం... రెండు బుద్ధుల సమాజం... రెండు స్వభావాల సమాజం... అందుకే దీన్ని తాను ధ్వంసం చేయ దల్చుకుంది. తాను మొదటి వ్యక్తి కావచ్చు... కాకపోవచ్చు... ఎవరు... ఎవరి మీదా కంట్రోల్ లేని జీవితం కాబట్టే తాను సహజీవనానికి అంగీకరిం చింది. అంతే తప్ప, కట్టుబాటు తన వైఖరికి విరుద్ధం. నిజానికి తనకి పరిచయం అయిన వాళ్ళలో శ్రీకర్ తప్ప, వ్యక్తిత్వంలో ఎవరూ ఈ మాత్రం కూడా ఆకట్టుకోలేదు.

ఒకరిద్దరు తారసపడ్డా ఆ చూపులు ఎక్క డెక్కడ తారట్లాడాయో తనకి బాగా తెలుసు. వయసు పొంగును కూడా అణుచుకుంది. ఏ మగాడికీ తనకి దగ్గరగా వచ్చే అవకాశాన్ని కూడా ఇవ్వలేదు.

ఒకరు శ్రీకర్, రెండో వ్యక్తి కర్కరే!

### జరిగిన కథ

పెళ్ళి, తాళి వ్యవస్థపై సమంతకు నమ్మకం ఉండదు. శ్రీకర్ ఆమెను పెళ్ళిచేసుకోవాలను కుంటాడు. ఆమె తిరస్కరిస్తుంది. కానీ ఇటు తల్లి ఆరోగ్యాన్నీ, అటు శ్రీకర్ ప్రేమనీ కాపాడుకునేం దుకు పెళ్ళికి బదులు సహజీవనానికి అంగీకరి స్తుంది సమంత. కొంతకాలం తర్వాత ఒక బిడ్డను కని తన తండ్రి కోర్కె తీర్చమంటాడు శ్రీకర్. అందుకు తిరస్కరించి, శ్రీకర్‌ని మరో వివాహం చేసుకోమంటుంది సమంత. ఆ మాటకతడు దిగ్భ్రాంతి చెందుతాడు. అతన్ని వదిలి అమెరికా వెళ్ళిపోవాలనే ప్రయత్నంలో పడుతుంది సమంత. చైల్డ్‌కేర్ సెంటర్‌లో నన్ ఆమె దృష్టిని ఆకర్షిస్తుంది. కన్యగా మిగిలిపోయి పిల్లల సేవలో జీవితం పునీతం చేసుకుంటున్న ఆమె జీవన విధానాన్ని నిశితంగా అడిగి తెలుసుకుంటుంది సమంత.

ఆ తర్వాత....



కర్కరేని చూస్తే ఏ ఫీలింగ్స్ ఎందుకు లేవో అర్థం కాలేదు. బహుశా వయసు వల్ల వచ్చిన వ్యత్యాసం కావచ్చు. కాకుంటే తనతో యుఎస్‌కి వెళ్తుంది కాబట్టి ఇక అతడితో గడపాల్సి రావచ్చు. కంపల్షన్ అనుకుంది సమంత.

ఆమె ఆలోచనల్లో ఉండగానే అపార్ట్‌మెంట్ వచ్చింది.

శ్రీకర్ అసహనంగా ఎదురు చూస్తున్నాడు. "ఎక్కడకెళ్ళావ్?" అడగబోయి ఆగిపోయాడు. తమ అగ్రిమెంట్ ప్రకారం 'ఎక్కడికెళ్ళావని' ఒకర్ని మరొకరు నిలదీసే అధికారం ఉండదు.

అతడి ఫీలింగ్స్ అర్థమై తనే చెప్పింది. "చారిటీకి వెళ్ళాను" అంది.

"నీ సెల్‌కి ఫోన్ చేశాను సమంతా. స్విచాఫ్‌లో ఉంది" చెప్పాడు.

అప్పుడు గుర్తొచ్చింది ఆమెకు. చారిటీలోకి వెళ్ళేటప్పుడు ఫోన్ స్విచాఫ్ చేసింది. "సారీ" అంది.

"పర్వాలేదు. భోజనానికి రా...నీ కిష్టమని వంకాయ వేపుడు చేయించా.." చెప్పాడు శ్రీకర్.

"దేవి వచ్చిందా?" అడిగింది.

"అవును" చెప్పాడు.

"వాళ్ళమ్మకి బావోలేదని ఊరెళ్ళింది కదా? ఎలా ఉందట?" అడిగింది.

"ఇప్పుడు కొంత రికవరీ అయ్యిందట.." చెప్పాడు.

దేవి చురుకైంది. పెళ్ళయింది.



దానికి ఇద్దరు పిల్లలు. పిల్లల్ని బాగా చదివించాలని తపన పడుతూ ఉంటుంది. భర్త తాగుబోతు... పైగా తిరుగుబోతు... "వాడికి ఆడవాళ్ళ పిచ్చమ్మా... ఎక్కడికన్నా వెళ్ళి, ఏదైనా జబ్బు అంటించుకొని వస్తాడేమో అని భయపడి చస్తుంటాను.." చెప్పింది ఒకసారి.

"అలా తిరిగితే దగ్గరకు రానివ్వనని చెప్పు" చెప్పింది.

"ఒప్పుకోడమ్మా, దినదిన గండం నూరేళ్ళాయుష్షు అవుతోంది జీవితం" నిర్వేదంగా అనేది.

నిజానికి ఇది ఒక్క దేవి సమస్య మాత్రమే కాదు. దేశంలో ఉన్న చాలామంది ఆడవాళ్ళ సమస్య. ఆ మాటకొస్తే ప్రపంచ సమస్య! దీనికి చట్టాలు లేవు. హక్కులు అంతకన్నా లేవు. పీనల్ కోడ్స్ లేవు. ఎఫ్ఐఆర్‌లో చోటులేదు. భార్యలది నిస్సహాయ మౌన రోదన. కొండొకచో భర్తలది కూడా... కాకుంటే మెజారిటీ బాధితులు మహిళలు. అతడి నిజాయితీ మీదనే ఆధారపడి బిక్కుబిక్కుమంటూ బ్రతకాలి.

"అప్పుడప్పుడూ టెస్ట్‌లు చేయించుకుంటూ ఉండు దేవి..." సలహా ఇచ్చింది సమంత.

"ఎలా? ఎక్కడ చేయించుకోవాలో తెలీదమ్మా. ఏదైనా మాయదారి రోగం వస్తే పిల్లలేమైపోతారోనని బెంగగా ఉంటుంది..." అనేది.

సమంత హృదయం జాలితో నిండిపోయేది.

"స్నానం చేసిరా, ఈ లోపు కర్రీ వేడి చేస్తా.." శ్రీకర్ మాటలతో మళ్ళీ లోకంలోకి వచ్చింది.

●●●

భోజనం పూర్తయినతర్వాత సమంత తన గదిలోకి వెళ్ళింది. శ్రీకర్ మామూలుగా ఉండడానికి ప్రయత్నిస్తున్నాడని అర్థమైంది. ఉండే ఈ కొద్ది రోజులు అతన్నెందుకు డిజప్పాయింట్ చెయ్యడం? అని ఆలోచిస్తోంది.

శ్రీకర్‌లో కూడా ఆలోచనల దొంతరలు... ఆ రోజు ఉదయం రమణ అతడి ఆఫీసుకి వెళ్ళాడు.

"ఏంట్రా ఇలా వచ్చావ్?" అడిగాడు శ్రీకర్.

"రాత్రంతా నీ గురించి ఆలోచించి పిచ్చి పట్టింది..." చెప్పాడు రమణ.

"ఈ మాటలు లవర్స్ అనుకోవాలి. మనమధ్య కుదరదేమో" అన్నాడు నవ్వుతూ.

"మనమూ లవర్స్‌మే కదా" అన్నాడు రమణ కూడా నవ్వుతూ.

"సర్లే...విషయం చెప్పు" అన్నాడు, కాఫీ తెమ్మని అటెండర్‌కి చెప్పి.

"సమంత విషయంలో నువ్వు వర్రీ అవుతున్నావేమో అన్న ఆందోళన నాకు ఎక్కువైంది..." చెప్పాడు రమణ.

శ్రీకర్ తనలో భావాలు బయటపడకుండా ఉండడానికి ప్రయత్నించాడు. "మనం చేసేదేముంది?" అన్నాడు భావరహితంగా.

"చేయొచ్చు" అన్నాడు రమణ.

"ఎలా?" ఆశగా అడిగాడు శ్రీకర్.

"నెక్స్ట్ వీక్ జోనల్ ఇన్‌చార్జి మెల్కోటే వస్తున్నాడు. అతడి విల్లింగ్ ఉంటేనే కర్కరే యుఎస్



వెళ్ళడం సాధ్యమవుతుంది" చెప్పాడు రమణ.

"మెల్కోటే వద్దనే అవకాశం లేదు కదా?" నిరుత్సాహంగా అన్నాడు శ్రీకర్.

"అలా ఎందుకు అనుకోవాలి?" మనం ప్రయత్నిద్దాం" చెప్పాడు రమణ.

శ్రీకర్‌లో ఆశలు చిగురించాయి. అప్పటివరకూ సమంతతో సత్సంబంధాన్నే కొనసాగించాలన్న నిర్ణయానికి వచ్చాడు శ్రీకర్.

తలుపు చప్పుడు కావడంతో తలతిప్పి చూశాడు.

సమంత! నీలం రంగు నైటీలో సమ్మోహనంగా ఉంది. "శ్రీ... నిద్ర రావడం లేదా?" అడిగింది.

"అవును..." చెప్పాడు సాలోచనగా.

సమంత దగ్గరగా వచ్చింది.

"నన్ను విడిచి వెళ్ళిపోవాలనుకున్నావ్‌గా... ఎందుకో.... ఇప్పుడు నీకింత దయ?" అడిగాడు నిష్ఠూరంగా.

"ద్వేషంతో వెళ్ళడం లేదు కదా?" అంది మంచంపై కూర్చుంటూ.

"ఎలా వెళ్ళినా అది నాకు దూరమవడమే కదా?" అన్నాడు నిస్సత్తువగా.

"ఆడవాళ్ళను సొంత ప్రాపర్టీగా మగాళ్ళు చూడడమే నాకు నచ్చదు" అంది.

"ఇలా ఆలోచించడం ఎవరు నేర్పించారు నీకు" అన్నాడు కాస్త కోపంగా.

"మీలాంటి మగవాళ్ళను అధ్యయనం చేయడం వల్ల కలిగిన అవగాహనా సారమే అది" అంది అతడిపై వాలిపోతూ.

"నన్ను విడిచి బ్రతకగలవా?" అన్నాడు సడన్‌గా.

"ఈ ఓవర్ పొసెసివ్‌నెస్ నాకు నచ్చదు" అంది.

"అదేం తప్పు కాదు కదా! నువ్వు లేకుండా నేను బ్రతకలేను" అన్నాడు.

"ఇలాంటి మాటలు చెప్పే మీరు ఆడవాళ్ళను బురిడీ కొట్టిస్తుంటారు..." అంది నవ్వుతూ.

"ఏం సుఖం! నువ్వు మాత్రం పడవు కదా?" అన్నాడు శ్రీకర్ ఆమె నవ్వులో శ్రుతి కలుపుతూ.

"పడ్డాను కదా! పడే కదా, నీతో ఇలా సహజీవనం చేస్తున్నాను" అంది అతడి పెదవులకు తన పెదవులు అద్దుతూ.

శ్రీకర్‌లో ఎప్పటికి మల్లే సంచలనం. అతడి చేతులు అప్రయత్నంగా ఆమె వీపు చుట్టూ చేరాయి. మెదడు ఆలోచించడం మానేసింది.

ఇద్దరి దేహాలు అలిసిపోయేంతవరకూ పోట్లాడుకున్నాయి.

సమంతపై అతడికున్నది ప్రేమో... వ్యామోహమో... అది మరింత పెరిగింది.

●●●

"మనమెందుకు కలిసి కాఫీ తాగకూడదు?" అడిగాడు కర్కరే.

"తాగవచ్చు సర్. తెప్పించండి" అంది సమంత.

"ఇక్కడ కాదు. బయట కాఫీ షాపులో" అన్నాడు కర్కరే.

"వద్దు సర్, బావుండదు. శ్రీకర్‌కి తెలిస్తే బాధపడతాడు" సిన్సియర్‌గా అంది సమంత.

"అదేంటీ, మనం యుఎస్ వెళ్ళిపోతున్నాం కదా?" అన్నాడు విస్తుపోతూ కర్కరే.

"కావచ్చు సర్...అప్పటి వరకూ మా మధ్య ఉన్న అగ్రిమెంట్‌ని రెస్పెక్ట్ చేయాలి కదా.." అంది సమంత.

"అగ్రిమెంట్‌లో శ్రీకర్‌తో తప్ప ఎవరితోనూ కాఫీ తాగకూడదని రాసుకున్నారా?" అన్నాడు నవ్వుతూ.

"అదేం లేదు సర్. మీతో ఫ్యూచర్ ప్రపోజల్ లేకపోతే కచ్చితంగా వచ్చేదాన్ని. మీతో కలిసి జీవించబోతున్నానని అందరికీ తెలుసు. ప్రస్తుతం శ్రీకర్‌తో

**వివాహవ్యవస్థలో డొల్లతనం గురించే ఆలోచిస్తోందామె. కసాయివెంట అమాయకంగా నడిచే గొర్రెల్లా ఆడవాళ్ళు మూడుముళ్ళూ వేయించుకుని జీవితకాలం ఏడుస్తూ కూర్చుంటున్నారు. ఆత్మగౌరవాన్ని పణంగా పెట్టి జీవించే అతివలే కనిపిస్తున్నారు ఆమెకు. పురుషాధిక్య సమాజంలో మగాడు చేస్తే శృంగారం, ఆడది చేస్తే వ్యభిచారమా? ఆమెలో ఇలాంటి ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి. మరి ఆమె గమ్యం ఎటు?**

ఉన్నానని కూడా తెలుసు. అలాంటప్పుడు అతడితో పూర్తిగా విడిపోకుండా మీతో తిరగడం అనైతికమవుతుంది కదా.." అంది సమంత.

"వెల్ సెడ్" అన్నాడు అభినందిస్తూ కర్కరే.

"థాంక్యూ సర్.." అంది సమంత.

"బైది బై...మనం యుఎస్ వెళ్ళేలోపు ఇక్కడున్న పెండింగ్ ప్రాజెక్టులన్నీ కంప్లీట్ చేయాలి. లేకుంటే మెల్కోటే సర్ ఇద్దరికీ క్లియరెన్స్ ఇవ్వరు" చెప్పాడు కర్కరే.

"అలాగే సర్. ఫాలో అప్ చేస్తా.." చెప్పి బయటపడింది సమంత.

సమంత రాక కోసం ఎదురు చూస్తోంది సమీర. కోపంగా చూసింది సమంత వైపు.

"ఏంటి అలా చూస్తున్నావు?" నవ్వు తొక్కిపెట్టి అడిగింది సమంత.

"యుఎస్‌కి వెళ్ళకముందే కర్కరేతో రొమాన్స్ మొదలు పెట్టావా?" అడిగింది కోపంగా సమీర.

"అదేం లేదు. షారూఖ్ కాఫీ కెళదాం అన్నాడు. మా సమీర లాంటి వాళ్ళు ఒప్పుకోరు అన్నాను" చెప్పింది సమంత నవ్వుతూ.

"నీకు నవ్వు ఎలా వస్తోందే? నాకు నిన్ను చూస్తే మండిపోతోంది..." అంది సమీర కోపంగా.

"మంచిదే. కాసేపు షవర్ కిందకెళ్ళిరా... చల్లబడతావ్" అంది సమంత అల్లరి కొనసాగిస్తూ.

"నువ్వు కర్కరేతో యుఎస్ ఎలా వెళ్తావో చూస్తా" అంది కోపంగా సమీర.

"కర్కరే కాకపోతే బండార్కర్ అవుతాడు" అంది సమంత ఆమె మాటల్ని అడ్డుకుంటూ.

"వాడెవడు? ఇలా మాట్లాడేందుకు సిగ్గు లేదూ.." అంది సమీర.

"సిగ్గెందుకు? మనం ఎవర్నైనా అభిమానిస్తే వాళ్ళ క్షేమం కోరుకోవాలి" అంది సమంత.

"శ్రీకర్‌కి నేను చేసేది ఫేవరే కదా?" అంది మళ్ళీ తనే.

"నోర్ముయ్... చెంప పగలగొడతాను" అంది సమీర.

"మొన్న ఒకసారి కొట్టావు కదే" అంది సమంత.

"బుద్ధి లేదు నీకు" అని తన క్యాబిన్ వైపు వెళ్ళి మళ్ళీ ఆలోచనల్లో పడింది సమీర.

సమంతను ఎలా మార్చాలో తనకి అర్థం కావడం లేదు. తను ఎందుకు ఒక సాధారణ ఆడపిల్లలా ఆలోచించడం లేదో అస్సలు అర్థం

## సాయేషాకు మరో ఛాన్స్



'అఖిల్' సినిమా తరువాత సాయేషాను దాదాపు అందరూ మరిచిపోయారు. సాయేషా కూడా టాలీవుడ్‌కి టాటా చెప్పేసి బాలీవుడ్‌కి వెళ్ళిపోయింది. ఇన్ని రోజులుగా ఆ హీరోయిన్ పేరు కూడా ఎక్కడా వినపడలేదు. ఇప్పుడు అర్జంటుగా మళ్ళీ సాయేషా పేరు టాలీవుడ్‌లో వినపడుతోంది. సాయేషాకు రాజ్‌తరుణ్ పక్కన నటించే అవకాశం వచ్చిందట! సాయేషా కూడా వచ్చిన అవకాశాన్ని మిస్ చేసుకోకుండా ఓకే చెప్పిందట! త్వరలోనే షూటింగ్ కూడా ప్రారంభం అవబోతోందట!మొత్తానికి అసలు కనపడదేమో అనుకున్న ఈ చిన్నది తిరిగి వెండితెర మీద కనువిందు చేయబోతోంది. ఈ అవకాశమే కాకుండా మరికొన్ని ఆఫర్లు కూడా సాయేషా తలుపు తట్టాయని అంటున్నారు.

కావట్లేదు. వ్యవస్థ పైన తనది ధిక్కారమా? పురుషాధిక్యతపైన తృణీకార భావమా? బాల్యం తాలూకూ చేదు జ్ఞాపకాలు అంతగా ఘనీభవించాయా? ఎలా తనని మార్చడం? మార్చుకోవడం? తను అమాయకురాలు కాదు. చిన్నపిల్లేం కాదు. సమంత సంధించే ప్రశ్నలు వింటూంటే దిమ్మ తిరిగిపోతుంది.

"చాలామంది మగాళ్ళకంటే తాను చాలా బెటర్" అంటుంది.

"నీ ఆలోచనల్లో ఏదో పర్వర్టెడ్‌నెస్ కనిపిస్తుంది సమంతా" అంటే...

"ఇలా ఉండాలని మనం గీతలు గీసుకున్నాం. దాన్నెవరైనా క్రాస్ చేస్తుంటే... బెంబేలు పడిపోతున్నాం. ఎవరో ఒకరు సరిహద్దు రేఖలు చెరపాలి కదా?" అంటుంది.

"నీలాంటి ఆడవాళ్ళ వల్ల మగాళ్ళ పని ఇంకా సులువవుతుంది కదా?" వాదించింది సమీర.

"కానివ్వు! ఆడవాళ్ళకు కూడా సుఖం దొరుకుతుంది కదా?" నవ్వుతూ అంది సమంత.

"చీకట్లోంచి చీకట్లోకి వెళ్తున్నామా?" అడిగింది సమీర.

"అది కొందరి రచయితల అభిప్రాయం. దానితో అందరూ ఏకీభవించాల్సిన అవసరం లేదు." అంది సమంత.

"విశృంఖలత అక్కడికే కదా దారితీస్తుంది" అంది సమీర.

"నాది విశృంఖలం కాదు" అంది.

"కావచ్చు. శ్రీకర్ లాంటి వ్యక్తిని వదులుకుని వెళ్ళడం సరైంది కాదు కదా?"

"అలా నువ్వెందుకు అనుకుంటున్నావ్... అతడితో కేవలం ఫిజికల్‌గా ఉండవంతే. యుఎస్ నుండి అడపాదడపా ఫోన్ చేస్తూనే ఉంటాను కదా? అతడి క్షేమ సమాచారాలు తెలుసుకుంటూనే ఉంటాను కదా?" అంది.

"నీ బోడి పరామర్శలు ఎవరిక్కావాలి?" కోపంగా అంది సమీర.

"నువ్వు మాత్రం శ్రీకర్‌కి మంచి అడ్వకేట్‌వే.." అంది సమంత.

"అమ్మా, మిమ్మల్ని సార్ పిలుస్తున్నారమ్మా..." పిలిచాడు అన్వర్.

సమంత ఆలోచనల నుంచి బయటకు వచ్చింది సమీర.

"వస్తున్నా.." అని చెప్పి కర్కరే చాంబర్‌లోకి వెళ్ళింది.

ఎందుకో మునుపటిలాగా అతన్ని చూడలేక పోతోంది. అసహనంగా ఉంది. "చెప్పండి సర్" అంది.

"ప్లీజ్, బీ సిడౌన్ సమీరా.." మృదువుగా అన్నాడు కర్కరే.

మళ్ళీ తనే, "నీకు థాంక్స్ చెప్పాలనిపించింది సమీరా" అన్నాడు కర్కరే.

"ఎందుకు సర్" అడిగింది సమీర.

"నా విషయంలో సమంత పాజిటివ్‌గా ఆలోచించేలా చేయగలిగినందుకు" అన్నాడు కర్కరే.

కోపం వచ్చింది సమీరకు. "తాను చేయడమేంటి? ఈ డిప్పముఖం గాడితో వెళ్ళొద్దని గొడవపడుతుంటే" అనుకుంది. "నేను చెప్పింది ఏం లేదు సర్. అదంతా తన ఇష్టమే" అంది ఇబ్బందిగా.

"అఫ్‌కోర్స్, నీ యుఎస్ ఆపర్చ్యునిటీ గురించి తెలియడం వల్లే కదా తన మైండ్‌సెట్ మార్చుకుంది" అన్నాడు కర్కరే. అతడలా ఫిక్స్ అయ్యాడని అర్థమైంది.

"ఆఫీసు టైంలో ఇలా పర్సనల్ వ్యవహారాలు మాట్లాడుకోవడం బావుండదేమో కదా సర్" అంది.

"అఫ్‌కోర్స్...బైదిబై నిన్ను పిలిచింది...సమంతా నువ్వూ ఇద్దరూ కలిసి పెండింగ్ వర్క్ కంప్లీట్ చేయండి. మా యుఎస్ ప్రయాణానికి ముందే" చెప్పాడు కర్కరే.

కోపం వచ్చింది సమీరకు.

"అవకాశం ఉంటే ఆ ఫైల్స్‌ను కరెప్ట్ చేస్తారా వెధవా" అనుకుంది.

"ఓకేనా సమీరా.." అన్నాడు కర్కరే.

"ఎస్ సర్" అని బైట పడింది.

## శ్రుతి హాసన్.... పక్కా న్యూస్



పవన్‌కల్యాణ్ తాజా సినిమాలో హీరోయిన్ శ్రుతి హాసన్ కాదు, రకుల్ అన్న వార్తలు బాగానే హల్‌చల్ చేశాయి. ఈ వార్తలన్నిటికీ ఫుల్‌స్టాప్ పెట్టేశాడు ఆ సినిమా నిర్మాత శరత్ మరార్. తమ సినిమాలో హీరోయిన్ రకుల్ కాదనీ, శ్రుతిహాసనేనని ఆయన స్పష్టం చేసేశాడు. సినిమా పనుల్లో యూనిట్ బిజీగా ఉందనీ, త్వరలోనే షూటింగ్ కూడా మొదలైపోతుందన్న క్లారిటీ ఇచ్చేశాడు.

బైటకు వస్తున్న సమీరను అన్వర్ అదోలా చూశాడు.

•••

"సార్, మీ టాలెంట్ కేక సర్" అన్నాడు అన్వర్, ఆరోజు రాత్రి కర్కరే ఫ్లాట్‌లో అతడికి కాక్‌టైల్ కలుపుతూ.

"ఎందుకురా..." అన్నాడు కర్కరే కాస్త నిషా పెరుగుతుండగా.

"సమంతమ్మ ఎవరు చెప్పినా వినరు సర్. మీరు సమీరగారిని ట్యూన్ చేయడం వల్లే ఈ అద్భుతం సాధ్యమైంది" అన్నాడు అన్వర్.

"ఇది అద్భుతమేనా?" అడిగాడు కర్కరే.

"అద్భుతమే సర్. సమంతమ్మ ఒక కోహినూర్ వజ్రం. ఆమె ఎక్కడుంటే అక్కడ వెలుగు ప్రసరిస్తుంది. ఇప్పుడు మన కోహినూర్ లండన్‌లో ఉంది కదా సర్...అక్కడ దాని విలువ పెరిగిందే గానీ తగ్గలేదు కదా..." తనకి తెలిసిన లాజిక్ విసిరాడు అన్వర్.

"నిజమేరా! సమంత లాంటి అమ్మాయి దొరికితే పెళ్ళి చేసుకోవాలనుకున్నా. ఆ రేంజ్ దాకా ఎవరూ రాలేదు. ఎవరైనా నాలుగు రోజులు గిల్లి కొండని ఆఫర్ ఇచ్చేవాళ్ళు తప్ప, సహజీవనానికి కూడా సిద్ధపడలేదు. తను ఒప్పుకుంటే పెళ్ళికైనా సిద్ధమే. కానీ తను పెళ్ళికి వ్యతిరేకం. అందుకే ఈ సహజీవనం లైన్ ఆపరేట్ చేశాను. క్లీన్ బౌల్డ్" అన్నాడు ముద్ద ముద్దగా కర్కరే.

"అందుకే కదా సార్...మీ బ్రెయిన్ కేక అంటున్నాను" అన్నాడు అన్వర్, తను కూడా మరో రౌండ్ వేస్తూ.

"రేయ్, ఈ లోకంలో మనుషులు రెండు చోట్ల మాత్రమే సమానం" అన్నాడు.

"ఎక్కడ సార్..." ఆసక్తిగా అడిగాడు అన్వర్.

"ఒకటి మందు దగ్గర, రెండు శ్మశానంలో" చెప్పాడు కర్కరే.

"అయ్య బాబోయ్! సర్...శ్మశానానికి మీతో పాటు నన్ను తీసుకెళ్ళకండి సర్. భార్యా పిల్లలు కల వాణ్ణి" అన్నాడు.

"రేయ్, అది దేవుడి నిర్ణయం. ఎవరు ఎప్పుడు పోతారో ఎవరికి తెలుసు?" అన్నాడు గ్లాసు ముందుకు జరుపుతూ.

'థాంక్యూ సర్. మీరు వెళ్ళేలోపు నన్నో ఇంటి వాణ్ణి చెయ్యండి సర్" అన్నాడు వాడు.

"చేస్తాలేరా, ఇంకొక రౌండ్ వెయ్యి" అన్నాడు కర్కరే.

"అలాగే సర్..." అని కర్కరే నుండి గ్లాసు తీసుకున్నాడు అన్వర్.

ఇంకో రౌండ్ మందు కలిపేలోపు కర్కరే మత్తులోకి జారుకున్నాడు.

కర్కరేని చూస్తూ "ఈ వెధవని తీసుకెళ్ళి సమంతమ్మ ఏం సుఖపడుతుంది? వేస్ట్ ఫెలో" స్వగతంలో అనుకుని..

"సర్, తలుపు దగ్గరకు వేసి వెళ్తున్నా" చెప్పి కదిలాడు అన్వర్.

•••

సమంత దగ్గరకు వెళ్ళి తమ్ముడు తెచ్చిన సమాచారం ఏమిటా అని ఆసక్తిగా ఎదురుచూస్తూ కూర్చుంది సునంద. ఎంతకీ రాకపోవడంతో

తమ్ముడికి ఫోన్ చేసింది.

'రాజా, అమ్మాయి దగ్గరకి వెళ్ళి వచ్చావు కదా? ఇంటికి రాలేదేం?" అడిగింది

"ఒంట్లో బాగోలేక రాలేదు. సాయంత్రం వస్తాను" చెప్పాడు రాజారావు.

సమంత తనతో అన్న మాటలు, తను తీసుకున్న నిర్ణయం తనే జీర్ణం చేసుకోలేకపోతు న్నాడు. అక్కకి ఎలా చెప్పాలో, ఎలా మొదలు పెట్టాలో అర్థం కావట్లేదు. అంతకన్న మించి ధైర్యం చాలడం లేదు. ఎట్టకేలకు ఒక నిర్ణయానికి వచ్చి అతడి పెద్దక్క సులోచనకు ఫోన్ చేశాడు. సాయంత్రం కల్లా సునందక్క ఇంటికి రమ్మని చెప్పాడు.

"ఎందుకురా" అడిగింది.

"ముఖ్యమైన విషయంలేవే...సందేహాలతో ప్రాణాలు తీయకు. బయలుదేరిరా" చెప్పాడు.

ఎలాంటి వార్త వినాల్సి వస్తుందోనని సులోచన హడలిపోయింది.

సునంద గ్రామానికి చేరుకోవడానికి గంట సమయం పడుతుంది. షేర్ ఆటోలో బయలు దేరింది. వచ్చేప్పుడు ధైర్యం చాలక చెల్లెలు సువర్చ లను కూడా రమ్మంది. తను రావడానికి కూడా గంటన్నర పడుతుంది. తలవని తలంపుగా వచ్చిన

"రాజా వచ్చాడు" అంది సునంద ఆత్రుతగా.

"రా...రా.." అంది సులోచన.

రాజారావు బండి స్టాండ్ వేసి వచ్చి కూర్చు న్నాడు.

"సమంత దగ్గరకు వెళ్ళావు కదరా, ఏంటి విశేషాలు.." అడిగింది సులోచన.

"వాణ్ణి కూర్చోనివ్వండే" అంది సునంద కాఫీ కలుపుకుని రావడానికి లోనికి వెడుతూ.

రాజారావుకి చాలా కష్టంగా ఉంది. ఎక్కణ్ణుంచి సంభాషణ మొదలు పెట్టాలో అర్థం కాలేదు. "సమంత బాగానే ఉందక్కా.. ఇప్పుడు కాస్త రంగు తేలింది" చెప్పాడు నాందిగా.

"ఏమైనా విశేషమా?" అడిగింది సులోచన ఆత్రుతగా.

అక్కా, చెల్లెని ఒకసారి తేరిపార చూశాడు రాజారావు.

అంతలోనే సునంద కాఫీ కలిపి తెచ్చింది. "కాఫీ తాగనివ్వండే" అంది.

కాఫీ తాగినంత సేపు ఆత్రుతగా ఎదురు చూశారు.

అరగంట ఇతర విషయాలు వగైరా మాట్లాడుతూ, రాజారావు చిన్నగా విషయంలోకి దిగాడు. "సమంత..




అక్కా, చెల్లెని చూసి విస్తుపోయింది సునంద.

"ఏమిటే, చెప్పాపెట్టకుండా దిగబడ్డారు" అడిగింది ఆశ్చర్యపోతూ.

"రాజా రమ్మన్నాడే" అంది సులోచన.

"రాజా మన సమంత దగ్గరకు వెళ్ళి వచ్చాడు గదా? ఏమైనా విశేషమా?" అడిగింది సువర్చల.

"చెబితే కదా వాడు? ఇంకో గంటలో వస్తాడు గదా, తీరిగ్గా అడగండి" అంటూ వంటగదిలోకి వెళ్ళింది. వేడి వేడి కాఫీ కలిపి తెచ్చి అక్కా చెల్లెలికి ఇచ్చింది.

"అబ్బా నీ చేతి కాఫీ తాగితే అమ్మ గుర్తుకొస్తుంది అక్కా" అంది సువర్చల.

"నిజమే.." వంత పాడింది సులోచన.

"సమంతకి మగబిడ్డ పుడితే నాన్న పేరు పెట్టాలి" అంది సువర్చల.

"కాదు ఆడపిల్ల అయితే అమ్మ పేరు" అంది సులోచన.

"చాల్లేండి సంబరం. ముందు వాణ్ణి రానీండి" అంది సునంద.

వాళ్ళు మాటల్లో ఉండగానే రాజారావు మోటార్ బైక్ చప్పుడు వినిపించింది.

శ్రీకర్‌కి దూరంగా వెళ్ళాలనుకుంటుందక్కా..." పిడుగులాంటి వార్త చేరవేశాడు.

అందరి ముఖాల్లోనూ రంగులు మారాయి.

"ఏమంటున్నావ్‌రా నువ్వు" పెద్దగా అంది సులోచన.

"అవునక్కా...కానీ అతడిపైన ద్వేషంతో కాదు" చెప్పాడు.

"అర్థమయ్యేటట్టు చెప్పరా" అంది సువర్చల.

"శ్రీకర్ తండ్రికి ఈ మధ్య హార్ట్ ఎటాక్ వచ్చింది కదా? అక్కణ్ణించి వచ్చినప్పట్నించీ సమంతలో మార్పు వచ్చిందట. వంశం నిలబడాలని అతడి తండ్రి తపన పడుతున్నాడు. శ్రీకర్ తమ్ముడు దినకర్‌కి పిల్లలు పుట్టే అవకాశం లేదట. శ్రీకర్‌పైనే ఆశలు పెట్టుకున్నాడు. మన సమంత పిల్లల్ని కనడానికి నిరాకరిస్తోంది." చెప్పాడు రాజారావు.

"దానికిదేం రోగం" విసురుగా అంది సులోచన.

"అతడికి దూరంగా వెళ్ళడం ఎందుకు?" అడి గింది సువర్చల.

"అతడి వంశం నిలబెట్టేందుకే అతన్ని వదిలి యుఎస్ వెళ్ళిపోవాలనుకుంటోంది" చెప్పాడు రాజారావు.

సునంద ముఖం ఆరిపోయింది.

"జీవితాన్ని ఇలా కూల్చుకుంటోందెందుకు ఇది..?" విస్తుపోతూ అంది సులోచన.

"ఎక్కువ చదివితే ఇలాగే అవుతారా?" అంది సువర్చల బాధ నిండిన స్వరంతో.

"మనల్ని ఆందోళనకు గురిచేసే మరో విషయం తన ప్రాజెక్టు హెడ్ కర్కరేతో కలిసి యుఎస్‌లో కొత్త జీవితం ఆరంభించబోతోంది."

"ఛీ..ఛీ.." అంది సులోచన చెల్లెలి ముఖం చూస్తూ.

"అక్కడి సంస్కృతిని ముందే అలవరుచు కుంటోందా?" అంది సువర్చల.

సునంద దరిదాపు షాక్‌లోకి వెళ్ళింది.

"మంచివాడు కదా? ఆ పిల్లాడికి అన్యాయం చేయడానికి దీని మనసు ఎలా ఒప్పింది?" అంది సులోచన బాధ నిండిన స్వరంతో.

"యుఎస్ తీసుకువెళితే తనతో జీవిస్తానని కర్కరేకి కమిట్ అయ్యిందట" చెప్పాడు రాజారావు.

"ఇలా మగాళ్ళను ఏమార్చడం ఏంటి?" అయో మయంగా అడిగింది సువర్చల.

"తన కోసం ఎంతకాలమైనా శ్రీకర్ ఎదురు చూస్తా డని సమంత ఈ నిర్ణయం తీసుకుంది" చెప్పాడు రాజారావు.

సునందలో దుఃఖం పెల్లుబికింది.

ఇన్ని కష్టాలు పడి పెంచుకున్న తన బిడ్డ జీవితం ఇలా బుగ్గిపాలు కావడం ఆమెని హతాశు రాలిని చేసింది. తోబుట్టువుల ముందు తల వాలి పోయింది. ప్రతిష్ఠ అడుగంటింది.

"అక్క కోసమే అది శ్రీకర్‌తో జత కట్టింది తప్ప, పెళ్ళంటే దానికి మొదట్నించీ వైముఖ్యమే.." చెప్పాడు రాజారావు.

"ఇప్పుడు మాత్రం అక్క సంతోషంగా ఉంటుం దని ఎలా అనుకుంటుందది?" అంది సువర్చల.

"వెళ్దాం పదండి. వెళ్ళి నాలుగు జాడించి వద్దాం." అంది సులోచన కోపంగా.

"అమ్మ సంతోషం కోసమే శ్రీకర్‌ని నా జీవితం లోకి ఆహ్వానించాను మామయ్యా...అని అది అన్న ప్పుడు, ఏదోవిధంగా దీని బ్రతుకు గాడిలో పడిం దని సంతోషపడ్డాను. కానీ...ఇలా నిప్పులు పోసు కుంటోందనుకోలేదు" రాజారావు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"తమ్ముడూ ఏడవకురా" అంది సులోచన ఆదు ర్దాగా.

కొద్ది నిమిషాలు అక్కడ వాతావరణం గంభీరంగా మారింది.

"నువ్వేం మాట్లాడకుండా అలా కొయ్య బారిపోయ్యావేంటే?" చెల్లెని కదిలించింది సులోచన.

"ఏం మాట్లాడాలి అక్కా! నన్ను సంతోషపెట్ట డానికి అతడికి దగ్గరగా వెళ్ళింది. అతడి కుటుం బాన్ని సంతోషపెట్టడానికి అతడికి దూరంగా వెళ్తోంది." నిర్వేదంగా అంది సునంద.

"తమ్ముడూ, దీని వేదాంతానికేం గానీ నాలుగు టికెట్లు హైదరాబాద్‌కి బుక్ చేయరా. వెళ్ళి దాన్ని దార్లో పెట్టి వద్దాం" అంది సులోచన.

"దానిది తిట్టించుకునే వయసు కాదు. అది ఎక్కడున్నా మరొకరికి ఆనందాన్నే పంచుతుంది. కానివ్వండి...ఎలా జరగాలో అలా జరుగుతుంది" అంది నిర్వికారంగా సునంద.

**(ఇంకా వుంది)**

## ఇక సింథటిక్ మనుషులు!

సృష్టికి ప్రతిసృష్టి చేస్తున్నాడు మనిషి. సింథటిక్ మనిషిని సృష్టించేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. వంశపారంపర్యంగా తల్లితండ్రుల నుండి పిల్లలకు సంక్రమించే మానవ జన్యువుల స్థానంలో సింథటిక్ లేదా రసాయనాలతో చేసిన జన్యు పదార్థాలను పునఃసృష్టి చేసేందుకు (సింథటిక్ జీనోమ్ ప్రాజెక్ట్) హార్వర్డ్‌లోని బోస్టన్ మెడికల్ స్కూలులో మే నెల రెండో వారంలో 150 మంది అగ్రశ్రేణి శాస్త్రవేత్తలు, న్యాయవాదులు, ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలు రహస్య సమావేశం జరిపారు. ఇది డీఎన్ఏ సంయోగాలను మరింత మెరుగుపరిచే ప్రయత్నమేనని నిర్వాహకులు చెబుతుండగా, కొందరు జెనెటిక్ ఇంజనీరింగ్ నిపుణులు, ఎథికల్ సైంటిస్టులు మాత్రం దీనిపై బహిరంగ చర్చ జరగాలని డిమాండ్ చేస్తున్నారు. 'సింథటిక్ జీనోమ్' ప్రకృతికీ, నైతిక భావజాలానికి



విరుద్ధమని విమర్శిస్తున్నారు. ఒక రకంగా చెప్పాలంటే ఒక మనిషి అనువంశిక చరిత్ర, జీవిత కాల ప్రవర్తన మొత్తం మౌలికమైన 300 కోట్ల డీఎన్ఏ జన్యు జతల (హ్యూమన్ జీనోమ్)లో నిక్షిప్తమై ఉంటాయి. దీని తయారీకి ప్రస్తుతం 90 మిలియన్ డాలర్లు ఖర్చవుతుండగా, సింథటిక్ జీనోమ్ లక్ష డాలర్లకే పూర్తవుతుందట. పదేళ్లలో దీన్ని తయారు చేస్తారట. సహజసిద్ధమైన కణాలతో తయారైన మానవ జన్యువుల స్థానంలో సింథటిక్ జన్యువుల ప్రతిసృష్టి వల్ల ప్రయోజనాలేంటో స్పష్టంగా చెప్పాలని స్టాన్‌ఫోర్డ్ యూనివర్సిటీ బయో ఇంజనీరింగ్ అసోసియేట్ ప్రొఫెసర్ Drew Endy, చికాగో నార్త్‌వెస్టర్న్ యూనివర్సిటీ మెడికల్ ఎథిక్స్ ప్రొఫెసర్ Laurie Zoloth ప్రశ్నించారు. దీనివల్ల వైరస్‌లను, వాటివల్ల వచ్చే రోగాలను తట్టుకుని మనిషి నిలబడగలుగుతాడా? ప్రమాదకర రోగాలన్నీ రూపుమాసిపోతాయా? జీవన ప్రమాణాలు పెరుగుతాయా? లేక ఇతర ప్రయోజనాల కోసం దీన్ని చేస్తున్నారా? అని కాస్మోస్ పత్రికలో రాసిన వ్యాసంలో ప్రశ్నించారు. న్యాయవాదులు, నియంత్రకులు, సైద్ధాంతికవేత్తలు, ఫిలాసఫర్లు, నైతిక విలువల నిపుణులందరితో దీనిపై బహిరంగ చర్చ జరపాలన్నారు. ఈ విధంగా న్యూ హ్యూమన్ లైఫ్‌ను సృష్టించడం అంటే మనిషి జెనెటిక్ పదార్థాలనూ, మనిషినీ కూడా పారిశ్రామికీకరణ చేయడమేనని వారు ఆందోళన వ్యక్తం చేశారు.









**2700 మహానుభావుల మంచి మాటలు**
సంకలనం, సంపాదకులు: పి.రాజేశ్వరరావు
ధర: 90 రూపాయలు
పేజీలు: 124

**ఎందుకు? ఏమిటి? ఏది? ఎలా?**
400 జి.కె.ప్రశ్నలు, సమాధానాలు
సంకలనం, సంపాదకులు: పి.రాజేశ్వరరావు
ధర: 120 రూపాయలు
పేజీలు:138

**నిత్య జీవితంలో ప్రమాదాలకు ప్రథమ చికిత్స**
వి.వి.యుదెనిచ్
అనువాదం, సంపాదకులు: పి.రాజేశ్వరరావు
ధర: 50 రూపాయలు
పేజీలు:64

**మానవుడి కథ**
ఎమ్.ఇల్యీన్, వై.సెగాల్
ధర: 160 రూపాయలు
పేజీలు: 200

**ప్రతులకు: తెలుగు రాష్ట్రాల్లోని ప్రముఖ పుస్తకాల షాపులు**




ప్రచురణరంగంలో అపార అనుభవం గలవారు పి.రాజేశ్వరరావు. ఆయన సంపాదకత్వంలో సంకలనం, అనువాదం చేసిన మూడు పుస్తకాలు తాజాగా వెలువడ్డాయి..

ఇప్పుడు ప్రైవేటురంగ ఉద్యోగాల్లో రాణించాలంటే విజయం ఎంత ముఖ్యమో మంచి వ్యక్తిత్వం కూడా అంతే ముఖ్యం. అలాంటి వ్యక్తిత్వాన్ని పెంపొందించేందుకు మహానుభావులు చెప్పిన 2700 సూక్తుల సంకలనమే 'మహానుభావుల మంచి మాటలు'.

పిల్లలు మనల్ని ఎన్నో ప్రశ్నలు అడుగుతూ ఉంటారు. ఆకాశం నీలంగా ఎందుకుంటుంది? ఆవిరి అంటే ఏమిటి? మంచు ఎలా ఏర్పడుతుంది?....ఇలా వారడిగే ప్రశ్నలకు తికమక పడకుండా పెద్దలకు ఉపయోగపడే పుస్తకం 400 ప్రశ్నలు -సమాధానాలతో కూడిన 'ఎందుకు? ఏమిటి? ఏది? ఎలా?'. అదేవిధంగా ప్రమాదాల్లో ప్రాథమిక చికిత్సచేసే పద్ధతుల్ని తెలియజేసే మరోపుస్తకం ఇళ్ళు, హాస్పిటల్స్, పరిశ్రమలు, నర్సులు, కాంపౌండర్లకు నిత్యం ఎంతో ఉపయోగపడుతుంది.

కాగా మరో పుస్తకం 'మానవుడి కథ' ఆదిమ మానవుడి కాలం నుండి ఆధునిక మానవుడి కాలం వరకు జరిగిన పరిణామ క్రమాన్ని అద్భుతమైన కథగా చెప్పిన పుస్తకం ఇది.

## స్వీకారాలు

**గాలిలో తేలిపోతున్నాం** అమెరికా అనుభవ కథలు
కూతురు రాంరెడ్డి
ధర: 100 రూపాయలు
పేజీలు: 138
ప్రతులకు: రచయిత, ఘటకేశ్వర్, హైదరాబాద్-88
సెల్: 9000415353

**చిచ్చర పిడుగులు**
మూలం: మార్క్‌ట్వేన్
అనువాదం: ఎమ్.వి.వి.సత్యనారాయణ
ధర: 60 రూపాయలు,
పేజీలు: 110
ప్రతులకు: మంచిపుస్తకం, తార్నాక, సికింద్రాబాద్-17 సెల్ 9490746614

**అందరికన్నా ఎవరు బలవంతులు?**
వి.సూస్లోవ్
అనువాదం: డా. వి. శ్రీనివాసచక్రవర్తి
ధర: 35 రూపాయలు
పేజీలు: 16
ప్రతులకు: మంచిపుస్తకం, తార్నాక, సికింద్రాబాద్-17 సెల్ 9490746614

**కణాలు, కోటానుకోట్ల కణాలు**
పి. కటిన్
ధర: 60 రూపాయలు, పేజీలు: 32
ప్రతులకు: విజ్ఞాన ప్రచురణలు (జనవిజ్ఞాన వేదిక), నెల్లూరు-04 సెల్ 94405 03061

**-లలితా త్రిపురసుందరి**

# పోట్లాట

## నోబెల్ కథలు

-పెరల్ ఎస్.బక్



*పెరల్ ఎస్. బక్ 26 జూన్ 1892న అమెరికాలో జన్మించారు. 1938లో సాహిత్యంలో నోబెల్ బహుమతి అందుకున్నారు. 80వ యేట 6 మార్చి 1973న మరణించారు.*

**తమ ఇంటి ముందు చేరిన ఆ గుంపు వంక అతను కోపంగా చూశాడు. అతని చుట్టూ, అతని భార్య చుట్టూ దాదాపు ముప్ఫయి నలభైమంది ఆడా మగా గుమికూడి ఆసక్తిగా వింటున్నారు. గ్రామంలోని ఆ చిన్న వీధిలో అలా వాళ్ళ చుట్టూ ఒక వలయం ఏర్పడింది. వేసవి తాపం కారణంగా దిశ మొలలతో ఉన్న చిన్నపిల్లలు పెద్దవాళ్ళ కాళ్ళ మధ్యనుంచీ దూరిపోయి ముందు వరసలోకి రావడానికి ప్రయత్నిస్తున్నారు. జరుగుతున్న పోట్లాటని దగ్గరనుంచి చూడాలని వాళ్ళ ప్రయత్నం. అతను ఏడుస్తున్న భార్యవైపు చూడకుండా తల వేలాడేసుకుని నేలవైపు చూస్తూ నుంచున్నాడు. అప్పుడు అతని కంట్లో ఈ చిన్నపిల్లలు పడ్డారు. వాళ్ళల్లో ఎనిమిది తొమ్మిదేళ్ళ అతని కొడుకు కూడా ఉన్నాడు. అతని మరో ఇద్దరు పిల్లలు కూడా అక్కడ ఏం జరుగుతుందో చూడడానికి వచ్చి తల్లిదండ్రుల వంక ఆశ్చర్యంగా చూస్తూ నుంచున్నారు.**

ఇక ఎక్కువసేపు సహించలేకపోయాడతడు. జరిగింది ఇంక చాలు అనుకున్నాడు. అతని భార్య కన్నీళ్ళు, రోజూ జరుగుతున్న పోట్లాట, సాధింపులు, ఇన్నాళ్ళుగా దాచిపెట్టుకున్న కోపం, భయాలు, పైకి చెప్పని ఆమె అనుమానాలు - ఇంక చాలు అనుకున్నాడు.

అతను తన మూడో కొడుకును అందిపుచ్చుకుని గట్టిగా ఒక దెబ్బవేసి "ఇంట్లోకి వెళ్ళరా" అంటూ గట్టిగా అరిచాడు. ఆ పిల్లవాడు గట్టిగా వెక్కిళ్ళు పెడుతూ ఏడుస్తూ అక్కడే నిలబడిపోయి జనం నుంచి సానుభూతి కోసం చూస్తున్నాడు. అప్పుడు ఆమె నోరు విప్పింది. కన్నీళ్ళతో తడిసిపోయిన మొహాన్ని అటూ ఇటూ నిలబడిన జనం కేసి తిప్పి చూస్తూ "ఇదుగో చూస్తున్నారుగా ఆయన ఏం చేస్తున్నాడో. ఈ మధ్య కాలంలో ఆయన ఇట్లాగే ఉంటున్నాడు" అని ఫిర్యాదు చేసింది.

చుట్టూరా మూగిన జనం అతనివైపే మౌనంగా రెప్పవెయ్యకుండా చూస్తూ నిలబడ్డారు. ఆమె అడుగుతున్న ప్రశ్నలకు అతను ముక్తసరిగా సమాధానాలు చెప్పటం వాళ్ళు విన్నారు. ఇప్పుడు అందరి మొహాల్లోనూ అతని పట్ల వ్యతిరేకత కనిపిస్తోంది. ఆ విషయం అతనికి కూడా అర్థం అయింది. అతను తలవంచుకుని చెప్పుల్లేని కాళ్ళతో నేలమీద గీతలు గీస్తూ నిలబడ్డాడు. అక్కడ లేస్తున్న దుమ్ము అతనికి తన పొలాన్ని గుర్తుచేసింది. పొలానికి నీరు పెట్టాలన్న విషయం గుర్తొచ్చింది.

"అక్కడ అంత పని పెట్టుకుని ఇక్కడ ఇలా సమయం వృథా చేయాల్సి వస్తోంది" అని అతను గొణుక్కున్నాడు. ఈ ఆలోచనతో అతని మొహం కోపంతో ఎరుపెక్కింది. అతను తలెత్తి భార్యవైపు కోపంగా చూస్తూ గట్టిగా అరిచాడు.

"నీకేం కావాలే? ఏం కావాలో త్వరగా చెప్పి ఏడు. నేను పొలానికి వెళ్ళాలి. పొలానికి వెళ్లకపోతే నిన్నూ, నీ పిల్లల్నీ మేపడానికి నాకు డబ్బు ఎక్కడి నుంచి వస్తుంది?".

"చూశారా అతను ఏమంటున్నాడో? ఎలా మాట్లాడుతున్నాడో? రెండు నెలల కిందటి వరకూ మంచిగా ఉండేవాడు. అతని గురించి మీ అందరితో ఎలా చెప్పుకుని మురిసిపోయేదాన్నో లేదో మీరే చెప్పండి. అతను సంపాదించిన ప్రతి పైసా నాకే ఇచ్చేవాడు. తర్వాత చిన్నపిల్లాడిలా నా దగ్గరికి వచ్చి పండగ రోజు క్షవరం చేయించుకోడానికనో, ఏదన్నా ఆటకనో, పొగాకు కొనుక్కోడానికనో పదీపరకా అడిగి తీసుకునేవాడు. అప్పుడు అతను అడిగినది ఇవ్వడం నాకెంతో సంతోషాన్ని కలిగించేది. ఈ రెండు నెలల నుంచీ అతను నాకు ఒక్క పైసా కూడా ఇవ్వడం లేదు. అతను ఈ మధ్య ధాన్యం కూడా అమ్మాడు. అమ్మగా ఎంత వచ్చిందో నాకు మాటమాత్రంగా కూడా చెప్పలేదు" ఆమె ఏడుస్తూ అంది. ముడతలు పడిన ఆమె చిన్న మొహం కన్నీటితో తడిసిపోయింది.

జనం ఇంకా మౌనంగా వాళ్ళనే చూస్తూ నిలబడ్డారు. అతని చిన్నపిల్లలిద్దరూ నిదానంగా అమ్మ దగ్గరకు చేరి ఆమె దుస్తుల్లో మొహాలు దాచుకుని ఏడవడం మొదలుపెట్టారు. ఈ మౌనం మధ్య అతను తలవంచుకునే అదే వీధిలోని ఒక గుమ్మం వంక అనాలోచితంగానే క్రీగంట చూశాడు. అక్కడ ఆకుపచ్చటి దుస్తులు ధరించిన ఒక యువతి నిలబడి ఉంది. పట్టణాల్లో కనిపించే అధునాతన అమ్మాయిలా ఆమె భుజాల వరకూ జుట్టు కత్తిరించుకుని ఉంది. గుమ్మానికి విలాసంగా అనుకుని నిలబడి, ఆమె ఈ పోట్లాటనంతా వినోదంగా చూస్తోంది. ఆమె అందమైన మొహంలో, కళ్ళల్లో ఎప్పుడూ ఒకలాంటి కవ్వింపు కనిపిస్తుంది. ఈ తమాషానంతా నవ్వుతూ చూస్తున్నదల్లా అతను దొంగచాటుగా తన వంక చూడగానే గమనించనట్టు ఆమె దువ్వెనతో తల దువ్వుకుంటూ అక్కడే నిలబడింది.

అతను మళ్ళీ తలదించుకున్నాడు. అతని మొహం పాలిపోయింది. తల దించుకుని చిన్న గొంతుతో - "ఎందుకు ఎప్పుడూ డబ్బులు డబ్బులు అని పీడిస్తావు?" అసలు నీకు డబ్బులు ఎందుకు? ఇంట్లో కావలసినంత ధాన్యం ఉంది. రొట్టెలకు పిండి ఉంది. వండడానికి నూనె ఉంది. పెరటి తోటలో క్యాబేజీలు ఉన్నాయి. ఇంకేం కావాలి నీకు" అన్నాడు.

అతని మాటలు వింటున్న ఆమె కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి. ఆమె చిన్నపాటి శరీరం ఉద్వేగంతో కంపించిపోయింది. పెద్దగా గొంతెత్తి "ధాన్యాన్ని, క్యాబేజీలని బట్టలుగా కూడా కప్పుకోమంటావా? పిల్లల కాళ్ళకు చెప్పులుగా కూడా వేయమంటావా? వాళ్ళకాళ్ళకు చెప్పులున్నాయో లేదో చూశావా? ఇదుగో నా బట్టలు చూడండి. చిరిగిపోయిన కోటునే కుట్టుకుని వేసుకుంటున్నాను. నేను ఎప్పుడన్నా కొత్త బట్టల మొహం చూశానా? మూడేళ్ళ కిందట క్లబ్బులో ఏదో ఆట గెలిచినప్పుడు ఆయనకి పది వెండినాణాలు వచ్చాయి. అప్పుడు రెండు తానుల ముతకబట్ట కొనుక్కు

**తెల్లని ఒంటిఛాయతో, అధునాతనమైన అమ్మాయిలా భుజాలవరకు జుత్తు కత్తిరించుకున్న యువతి ఆమె. రోజూ గుమ్మం ముందు నిలబడి కవ్వించే కళ్ళతో అతడివైపే చూస్తూ ఉంటుంది. అతడిలో ఎన్నో సందేహాలు! ఆ నవ్వు తనకోసమేనా? ఆ కళ్ళు తనొక్కడినే చూస్తున్నాయా? లేక అందరినీ అలాగే చూస్తున్నాయా? సమాధానం లభించక తికమకపడుతున్నాడతను. అతడికి నిజం కావాలి. మరి అతడి సందేహం తీరిందా? లేదా?**



వచ్చాడు. ఆ బట్టను నీలం రంగులో ముంచి ఆయనకు రెండు జతలు, నాకో జత, పెద్ద పిల్లాడికో జత బట్టలు కుట్టాను. అప్పటినుంచీ అవే బట్టలు అతుకులు వేసి లాక్కువస్తున్నాను. ఇంక అతుకులు కూడా వేయలేను. అతుకులు వేయడానికి ఇంక బట్టకూడా లేదు. నా కాళ్ళకి చెప్పులు కూడా లేవు. పిల్లల్లాగే నేను కూడా వట్టికాళ్ళతో చెప్పుల్లేకుండా తిరగనా? చెప్పులు కొనుక్కోడానికి డబ్బులిమ్మని ఇవాళ ఉదయం అడిగాను. ఆయనేం చేశాడో తెలుసా? డబ్బులు అడిగినందుకు నన్ను తిట్టాడు. అయినా నేను ఏమాత్రం పట్టించుకోలేదు. పైపెచ్చు కోపంతో ఇవాళ మధ్యాహ్నం ఇంటికి కూడా రాలేదు. కొట్టుకి వెళ్ళి రొట్టె తెచ్చుకున్నాడు. అతని కోసం నేను వండినదంతా వృథా అయిపోయింది. నేను అడిగితే డబ్బులు లేవన్నాడు. కానీ కొట్టుకు వెళ్ళి రొట్టె కొనుక్కోడానికి మాత్రం డబ్బులు వచ్చాయా..." ఆమె కోపం మళ్ళీ ఏడుపులోకి దిగింది.

"ఈ రోజుల్లో కొందరు అమ్మాయిలు ఆర్భాటంగా వేసుకునే పొడవైన గౌనులు కొనుక్కోడానికి నేనేమైనా డబ్బులడిగానా? అమ్మాయిలకి పొడవైన గౌనులు కొనడానికైతే అతని దగ్గర డబ్బులుంటాయి. భార్యకు ఇవ్వడానికి మాత్రం ఉండవా?"

ఈ మాటలు వినగానే అతని మొహం క్రోధంతో భయంకరంగా మారింది. అతను చెయ్యెత్తి భార్యను కొట్టడానికి ముందుకు వచ్చాడు. అయితే జనంలో కొందరు ముందుకు వచ్చి అతన్ని పట్టుకుని ఆపారు. ఆడవాళ్ళు అతని భార్యను వెనక్కు లాగారు. గుంపులోని ఒకతను "ఆమె నీ భార్య. నీ పిల్లలకు తల్లి. అది గుర్తుంచుకో" అని మృదువుగా అన్నాడు.

"నేను అతనికి మగపిల్లల్ని ఇచ్చాను. మగ పిల్లల్ని..." ఆమె వెక్కుతూ అంది. అప్పుడు ఒక మెత్తని గొంతు వినిపించింది. ఆ గొంతు ఊళ్ళోని ఒక వృద్ధ మహిళది. ఆమె ఈ గుంపులో ఒక పక్కగా నిలబడి చాలా సేపట్నుంచీ జరిగేదంతా చూస్తోంది.

"చూడండి. మీరిద్దరూ చిన్నపిల్లలేం కాదు. లీ! నీకు దగ్గర దగ్గర నలభై ఐదేళ్లు వచ్చాయి. నువ్వు పుట్టినప్పుడు నేను మీ అమ్మ పక్కనే ఉన్నాను. నీ భార్యకిప్పుడు నలభై నాలుగేళ్ళు. ఆమెకు పెళ్ళికూతురి ముస్తాబు నేనే చేశాను. నీకు పెళ్ళయి ఇప్పటికి ఇరవై ఎనిమిదేళ్ళు. పన్నెండు మంది పిల్లలు పుట్టి అందులో ఏడుగురు మిగిలారు. నీ పెద్దకొడుకు బతికి ఉంటే ఇప్పటికి వాడికి ఇరవై ఏడేళ్ళు వచ్చేవి. నువ్వూ, నీ భార్యా తాతా నాయనమ్మ అయి ఉండేవాళ్ళు. నీ చిన్న పిల్లాడికి ఇప్పుడు మూడేళ్ళ వయస్సు. వీటన్నిటి గురించీ, ఇన్నాళ్ళూ నువ్వు ప్రశాంతంగా పొలం దున్నుకుంటూ గడిపిన జీవితం గురించీ ఆలోచించు. మీరిద్దరూ గొడవలు మాని ఇప్పటికైనా మళ్ళీ మామూలుగా ఉంటే మంచిది' వృద్ధ మహిళ నచ్చచెపుతూ అంది.

గ్రామంలో ఆమె వయసులో అందరికన్నా పెద్దది. ఊళ్ళో అందరికన్నా ధనవంతుడైన వ్యక్తికి తల్లి. ఆమెని, ఆమె మాటని అందరూ గౌరవిస్తారు. అందుకే ఆమె చెప్పేదంతా అందరూ శ్రద్ధగా విన్నారు. అతని భార్య కూడా శ్రద్ధగా వింది. ఆమె చెప్పటం అవగానే అతని భార్య ముసలావిడ వైపు తిరిగి "పెద్దమ్మా, నువ్వే చెప్పు, మా ఆయన మంచివాడని, నన్నెంతో బాగా చూస్తాడని నీకు ఎన్నిసార్లు చెప్పలేదు! ఉత్తముడైన భర్త దొరికాడని మురిసిపోలేదూ. రెండు నెలల కిందటివరకూ అతను అలాగే ఉన్నాడు. ఇప్పుడు చూడు అతను ఎలా కోపంగా చూస్తున్నాడో" అంది. అందరి కళ్ళు అతనివైపు తిరిగాయి. అతను మళ్ళీ తలవంచుకున్నాడు.

"అతను ఎలా చూస్తున్నాడో చూడు పెద్దమ్మా. అతను ఎంత మెత్తగా, మృదువుగా ఉండేవాడు. ఇప్పుడు ఎప్పుడు చూసినా కోపంగా అరుస్తూ ఉంటున్నాడు. ఇంతకుముందు ఎప్పుడూ నవ్వుతూ సంతోషంగా ఉండేవాడు. ఇప్పుడు ఇంటికి రావటం రావటమే మొహం గంటు పెట్టుకుని వస్తున్నాడు. ఒక్కమాట మాట్లాడకుండా మౌనంగా ఉంటున్నాడు. ఒక్కరోజు సంతోషంగా నవ్వడం చూడలేదు. నోరు విప్పాడంటే నన్ను నానా రకాలుగా తిడుతున్నాడు. నా జుట్టు జడలు కట్టిందట. నా కోటు శుభ్రంగా లేదట. మురికిగా ఉందట. ఇలాంటి మాటలు అంటున్నాడు. నా ఒంటిమీద ఈ కోటు తప్ప రెండోది లేదు. నేను ఎప్పుడూ శుభ్రంగా ఎలా ఉండగలను? ఇంటి పని, పిల్లల పని, పొలం పనులు - ఇన్ని పెట్టుకుని కొందరు అమ్మాయిల్లాగా మొహానికి పౌడరు పూసుకుని, జుట్టుకి నూనె రాసుకుని షోగ్గా ఎలా ఉండగలను?" ఆమె మళ్ళీ అంది. అతను ఇంక ఇదంతా సహించలేకపోయాడు. అతను అసహనంగా అటూ ఇటూ కదిలి "ఇప్పుడు నీకేం కావాలో చెప్పు? అనవసరంగా ఈ రాద్ధాంతం అంతా దేనికీ? నేను నీకు ఏం చేయాలో చెప్పు?" అంటూ గట్టిగా అడిగాడు.

"నీనుంచి నాకేం కావాలా? నాకు ఒకే ఒక్కటి కావాలి. నువ్వు రెండు నెలల కిందటి వరకూ నాతో ఎలా ఉన్నావో అలా ఉండడం కావాలి. అది ఒక్కటి చాలు. నువ్వు మారిపోయావు. నేను నీకు నచ్చడం లేదు. అందుకే నేను అడిగేది ఒక్కటే. నువ్వు ఇదివరకటిలా ఉండు చాలు" ఆమె అంది.

అక్కడ ఇంకెవరూ లేనట్టు, ఆమె, ఆమె భర్తా మాత్రమే ఉన్నట్టు స్త్రీ సహజమైన అభిమానంతో గొంతు రుద్ధమవుతుండగా నరాలు ఉబ్బిపోయి చిట్లిపోయిన గోళ్ళతో ఉన్న తన పుల్లల్లాంటి చేతుల్ని అతనివైపు ప్రేమను అర్థిస్తున్నట్టు చాపుతూ "నువ్వు ఇదివరకటిలా ఉండు. ఇదివరకటిలా ఉండు" అంటూ ఆమె వెక్కిళ్ళు పెట్టింది.

అక్కడ చేరిన జనమంతా బరువుగా నిట్టూర్చారు. అతను పొడారిపోయిన పెదవుల్ని

నాలుకతో తడుపుకున్నాడు. అతని నుదుటినుంచీ రెండు చెమట చుక్కలు చెంపల మీదకు జారాయి. అతను అనుకోకుండా గుమ్మంలో విలాసంగా నిలబడిన ఆ యువతి వైపు చూశాడు. ఆమె నిలబడిన తీరు, ఆమె వేసుకున్న దుస్తులు యువకుల హృదయాల్లో గిలిగింతలు పెట్టేలా ఉన్నాయి. అతను తలెత్తి ఆమె మొహం వైపు చూడకపోయినా ఆ మొహం అతనికి బాగా పరిచితమే. తెల్లటి ఆమె ఒంటి ఛాయ, నవ్వుతున్నట్టుండే ఎర్రటి పెదాలు, అతన్నుంచీ చూపు తిప్పని నల్లటి భయంలేని కళ్ళు, అన్నీ ఆతనికి తెలిసినవే. ఆ దారంట అతను ఎప్పుడు వస్తూ పోతూ ఉన్నా కవ్వించే ఆమె చూపు అతన్ని నిలబెట్టేసేది. ఆమెతో ఒక్కమాట మాట్లాడకపోయినా, ఆ చూపు కోసమే అతను అవసరం ఉన్నా లేకపోయినా అక్కడక్కడే తిరిగేవాడు. ఆమె ఊళ్ళోకల్లా ధనవంతుడి మనుమరాలు. సెంటు భూమిలేని ఒక పేద రైతు అయిన అతను ఆమెతో ఏం మాట్లాడగలడు? పట్టణాల్లో మగవాళ్ళు వేసుకుని తిరిగే పొడవైన నీలిరంగు దుస్తులు కొనడానికి, ఒక బూట్ల జత కొనడానికి అతను రెండు నెలల నుంచీ డబ్బులు దాస్తున్నాడు.

డబ్బుల్ని దాయడం కోసమే అతను భార్య విషయంలో కఠినంగా ఉంటున్నాడు. ఇన్ని సంవత్సరాలనుంచీ భార్యాపట్ల విశ్వాసంగానే ఉన్నాడు. ఇప్పుడు నలభై అయిదేళ్ళ వయసు. ఇంతవరకూ ఒక్కరోజు తనకోసం తను సంతోషంగా బతకలేదు. సంవత్సరాల తరబడి భార్యా పిల్లల కోసం గొడ్డుచాకిరీ చేశాడు. నలభై అయిదేళ్ళు వచ్చినా అతని ఒంటి మీద పాత బట్టలు తప్ప ఇంకేమీ లేవు. ఎంత కష్టపడినా అతుకుల చొక్కాతోనే గడుపుకుంటూ వచ్చాడు.




అయితే అతన్ని ఇబ్బంది పెట్టేది ఇంకోటి కూడా ఉంది. ఆమె అందరివంకా అలాగే చూస్తోందా? లేక తన ఒక్కడినే అలా చూస్తోందా? చేప పిల్లల్లా చలిస్తున్నట్టు ఉండే ఆ కళ్ళు తననొక్కడినే చూస్తున్నాయా? ఇన్ని రోజుల్నుంచీ రాత్రింబగళ్ళు అతన్ని వేధిస్తున్న ప్రశ్న ఇది. ఆ ఇంటి ముందు నుంచి అతను ఎప్పుడు వెళుతున్నా ఆమె వంక చూసేవాడు. ఆమె తిరిగి చూసేది. కవ్విస్తున్నట్టు కళ్ళు తిప్పకుండా చూసేది.

ఈ రోజుల్లో అమ్మాయిలు చాలా మారిపోయారని, మగాళ్ళంటే భయపడకుండా స్వేచ్ఛగా ఎలా కావాలంటే అలా ఉంటున్నారని ఊళ్ళో మగవాళ్ళు అనుకోవడం అతను విన్నాడు. అతను మళ్ళీ నోరు తడిచేసుకున్నాడు. ఆమె ఇతర మగవాళ్ళవైపు కూడా అలా చూస్తోందో లేదో ఎలా తెలుసుకోవడం? లేకపోతే ఆ చూపు ప్రత్యేకంగా తన కోసమేనా? ఆ నిజం అతను తెలుసుకోవాలి.

“నువ్వు ఇదివరకటిలా ఉండు” అతని భార్య వెక్కిళ్ళు పెడుతూ ఇంకా అంటూనే ఉంది. ఆమె ఏప్రాన్‌తో కళ్ళు తుడుచుకుంది. ఆమెలో ఇదివరకటి కోపం పోయి దాని స్థానంలో బాధ కనిపించింది.

అతని దొంగ చూపుల్ని గమనించిన జనం అనుకోకుండా ఆ యువతి నుంచున్న గుమ్మం వైపు తలతిప్పి చూశారు. ఆమె గుమ్మంలోనే నిలబడి దువ్వెనతో నాజూగ్గా జుట్టు వెనక్కు దువ్వుకుంటోంది. ఆమె చెవులకున్న బంగారు రింగులు తల కదిలినప్పుడల్లా తళుక్కుమని మెరుస్తున్నాయి. మగవాళ్ళంతా ఆమెను అద్భుతం చూస్తున్నట్టు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

“ఆ అవతారం చూడు. మగవాళ్ళలా పొడవాటి గౌను వేసుకుని..” కొందరు ఆడవాళ్ళు గుసగుసలాడారు.

గుంపులో ఒక పక్కగా ఉన్న వృద్ధ మహిళ వాళ్ళంతా ఎటు చూస్తున్నారో గమనించి తను కూడా తలతిప్పి అటు చూసింది. అక్కడ ఆమె మునిమనవరాలు నిలబడి ఉంది. పట్నంలో ఉండే తల్లిదండ్రులు గారాబం చేసి ఆ పిల్లను చెడగొట్టారు. పిల్లకు ఒక్క సంబంధం కూడా రానంతగా ఆమెను తల్లిదండ్రులు ఎలా చెడగొట్టారో ముసలావిడ కొడుకుతో రోజూ చెబుతూనే ఉంది. ఆ పిల్లను చేసుకోబోయేవాడు దురదృష్టవంతుడు అంటూ రోజుకి ఒకటిరెండుసార్లు అంటూనే ఉంది. ఇప్పుడు ఆమె ఆ పిల్ల వంక, ఆ పిల్ల విలాసంగా నిలబడి చేస్తున్న చేష్టల వంక మరింత కోపంగా చూసింది. అందమైన ఆ మొహం వెనుక ఉన్న కవ్వింపును కూడా ఆమె గమనించింది. ముడతలుపడిన ఆమె మొహం కోపంతో ఒక్కసారిగా ఎరుపెక్కింది. ఆమె గట్టిగా అడుగులు వేసుకుంటూ ఆ యువతి ఉన్న వైపుకి వెళ్ళింది. ఆమె చూపులు గమనించి అవి ఎటు వైపు ఉన్నాయో ముసలావిడ తెలుసుకుంది. ఆమె ఓ యువకుడి వైపు అదేరకంగా చూస్తోంది. ఆ యువకుడు నోటీనుంచీ చొంగ కార్చుకుంటూ ఆమెవైపు చూస్తున్నాడు.

ముసలావిడ కర్రతో రాళ్ళమీద గట్టిగా కొడుతూ “ఇంట్లోకి వెళ్ళు సిగ్గుమాలినదానా” అంటూ యువతిని అరిచింది. ఆ యువతి తటపటాయిస్తూ అక్కడే నుంచోవడం చూసి “ఇంట్లోకి వెళ్ళమన్నానా లేదా?” అంటూ మళ్ళీ అరిచింది. దానితో ఆమె తలుపు చాటుకి జారుకుంది. అయితే ఉంగరం ఉన్న ఆమె చేయి ఇంకా తలుపును పట్టుకుని కనిపిస్తూనే ఉంది. ముసలావిడ కర్రతో ఆ చేతిమీద ఒక్క దెబ్బ వేసింది. దానితో అది కూడా నీడలోకి జారుకుంది.

“ఇలాంటి దరిద్రపుగొట్టు పిల్లని ఎక్కడా చూడలేదు. నిశ్చితార్థం జరిగి త్వరలో పెళ్ళి అవబోయే పిల్ల ఇలా గుమ్మం దగ్గర విలాసంగా నిలబడి వచ్చేపోయే మగాళ్ళ వైపు చూడడం... ఛీ ఛీ... ప్రపంచం ఏమైపోతుందో తెలీడం లేదు” అంటూ ముసలావిడ గట్టిగా నిట్టూర్చింది.

జనం గొడవ అప్పటికి కాస్త సద్దుమణిగింది. అతని భార్య ఇదంతా చూస్తూ కాస్త ఉపశమనం పొందినట్టు నవ్వింది. చుట్టూ గుమికూడిన జనం కూడా చెల్లాచెదురు అవుతున్నారు. ఆ యువకుడు మాత్రం ఖాళీ గుమ్మం వైపు చూస్తూ అలాగే నుంచున్నాడు.

అప్పుడు హఠాత్తుగా భర్తకి ఒక విషయం స్ఫురించింది. ఆమె అందరివైపూ అలాగే చూస్తోంది. తన ఒక్కడివైపే కాదు. ముసలావిడకి కూడా విషయం పూర్తిగా అర్థమైంది. జరుగుతున్నదేమిటో ఆమె గ్రహించింది. ఆమె లీ వైపు తిరిగి ఊతకర్రని అతనివైపు ఊపుతూ “ఇదుగో లీ. నువ్వొక మూర్ఖుడివి. ఇంక పొలానికి వెళ్ళి పని చూసుకో. ముందు నీ దగ్గరున్న డబ్బు నీ భార్యకి ఇచ్చి వెళ్ళు” అని గట్టిగా ఆదేశిస్తున్నట్టు చెప్పింది.

భర్త నడుముకున్న పట్టీని తడుముకుని అందులోంచి నాలుగు వెండినాణాలు తీసి భార్య వైపు చేయిచాపాడు. ఆమె కూడా కరకుగా మోటుగా అయిపోయిన తన చేతిని అతనివైపు చాపింది. అతను మెల్లగా తన కలలతో పాటే వాటిని కూడా ఆమె చేతిలో జారవిడిచాడు.

అతను చెదిరిపోతున్న జనం వంక చూస్తూ “ఆమె ఎందుకిలా పోట్లాట పెట్టుకుందో నాకు అర్థం కావడం లేదు. డబ్బులు కావాలని అడిగితే ఇచ్చేవాడిని కదా. ఎప్పుడూ ఆమెకు అట్లాగే ఇస్తున్నాగా” అని మనసులో అనుకున్నాడు.

అతను కిందకు వంగి అంతకుముందు విసిరేసిన పారను అందుకుని భుజం మీద పెట్టుకుని వెనక్కు తిరిగి ఎవరివంకా చూడకుండా కనీసం తన జీవితాన్ని గూడా మరోసారి చూడకుండా పొలానికి వెళ్ళిపోయాడు.

అనువాదం: **జి.లక్ష్మి** e-mail: guttalakshmi62@gmail.com

**యోగా గురించి తెలుసు కానీ ఈ డోగా ఏంటి కొత్తగా ఉందే, ఎప్పుడూ వినలేదే అనుకుంటున్నారా! అవునండీ ఈ కొత్తరకం శారీరక వ్యాయామ పద్ధతి ఇటీవలే ప్రారంభమైంది. యోగా అంటే ఒక్కరో లేదా కొంత మంది వ్యక్తులో కలిసి చేసే వ్యాయామం. అయితే మనుషులతో మాత్రమే కాదు, కుక్కలతో కలిసి కూడా యోగా చేసే కొత్తపద్ధతి ఒకటి ప్రారంభమైంది. దీన్నే డోగా అని పిలుస్తున్నారు. డోగా అంటే కొత్త రకం వ్యాయామం అనుకునేరు మన యోగానే కుక్కలతో కలిసి చేయడం. డాగ్ + యోగా = డోగా అయిందన్న మాట.**



# పెంపుడు కుక్కతో డోగాభ్యాసం!

ఇతర దేశాలలో జంతు ప్రేమికులు, పక్షి ప్రేమికులు ఎక్కువ మంది ఉంటారు. అయితే బిజీ లైఫ్ కారణంగా, రోజువారీ కార్యక్రమాలలో యజమానులు చాలామంది తమ పెంపుడు జంతువులకు తగిన సమయం కేటాయించలేకపోతున్నారు! అందుకే వాటితో మమేకం కావడానికీ, కొంత సమయం వాటితో గడపడానికీ డోగా ఎంతగానో ఉపయోగపడుతుందట. ఈ డోగా వల్ల మనుషులకు, కుక్కలకు కూడా అటు శారీరకంగానూ ఇటు మానసికంగానూ మేలు జరుగుతుందట. మరి ఈ వింత విచిత్ర వ్యాయామాల గురించి తెలుసుకోండి.

## రోజురోజుకూ ప్రాచుర్యం

అమెరికా, స్పెయిన్‌లాంటి దేశాల్లో డోగా ట్రైనర్లకు మంచి గిరాకీ ఉందట. కోస్టారికాలోని శాన్‌జోస్‌లో ఈ డోగా యమా పాపులర్ అయిపోయింది. మెర్సెలా క్యాస్ట్రో అనే 29 ఏళ్ల యువతి డోగా విద్యకు గురువుగా మారింది. మూడేళ్లుగా అక్కడ ఉన్న ఓ పార్కులోనే ఆమె సుమారు వంద మందికి డోగా క్లాసులు చెప్తోంది. యోగాభ్యాసంతో కేవలం మనిషికే లాభం, కానీ డోగా వల్ల కుక్కకు కూడా మంచి వ్యాయామం అవుతుందంటున్నారు. అందుకే శునకాలను వెంటబెట్టుకుని మరీ పార్కుల వెంట డోగా చేయడానికి సిద్ధమవుతున్నారట.

## ఇలా మొదలైంది

అసలీ విద్య ఎలా ప్రారంభమైంది? దీనికి ఆద్యులు ఎవరో తెలుసుకోవాలనుందా? మెర్సెలా క్యాస్ట్రో అనే యువతి ఈ డోగా ప్రక్రియను ప్రారంభించింది. ఈమెకు ఈ ఆలోచన ఎలా వచ్చిందంటే ఒకప్పుడు ఆమె యోగా నేర్చుకునేందుకు వెళ్తూ పెంపుడు కుక్కను తోడుగా తీసుకెళ్లేదట. అలా కుక్కను తీసుకెళ్లడం అక్కడ వాళ్లు చేసే వ్యాయామాలు కుక్క కూడా నేర్చుకోవడంతో కుక్కతో కలిసి వ్యాయామం చేస్తే ఎలా ఉంటుందన్న ఆలోచన వచ్చిందట! పైగా రోజూవారి పనులతో పెట్‌డాగ్‌కు ప్రత్యేక సమయం కేటాయించలేక, దాని శారీరక పరిస్థితిని పట్టించుకోలేక బాధపడుతున్న వారికోసం ఏదన్నా కొత్తగా చేయాలనుకుని ఈ డోగాను కనిపెట్టింది. ఆవిద్యే మెర్సెలా క్యాస్ట్రోకు జీవనోపాధిగా మారింది.



## ఎలా చేయాలంటే?

యోగా చేయడం తెలుసుగా! అయితే డోగా చేయడం ఈజీనే. దీనికి కావల్సిందల్లా మీ కుక్క మీకు సహకరించడమే. ఈ డోగా ప్రక్రియేంటంటే మనం నేల మీద పడుకుని ఉన్నప్పుడు పెంపుడు కుక్కను మన కాళ్లూ చేతులతో అమాంతం పైకెత్తేయడమే. ఇలా పైకీ కిందకీ కుక్కను ఎత్తి దింపుతూ ఉంటే మన కాళ్లకీ, చేతులకీ ముఖ్యంగా వెన్నెముకకీ మంచి వ్యాయామం అవుతుందని డోగాను పాపులర్ చేస్తున్న వారు సెలవిస్తున్నారు. ఇంకా ఈ డోగాలో ఇలాంటి వ్యాయామ భంగిమలు చాలానే ఉన్నాయి. అందుకు కుక్క కూడా సహకరించాలి. అయితే డోగా ఇంట్లో ప్రాక్టీసు చేసుకోవాలంటే కొంచెం కష్టమే. ఇందులో నైపుణ్యమున్న డోగా ట్రైనర్ సలహాలు తప్పనిసరి. నిపుణుల పర్యవేక్షణలోనే అభ్యాసం చేయాలి. ఎందుకంటే ఇది కుక్కతో వ్యవహారం కదా కాస్త జాగ్రత్తగా ఉండాలి మరి!

## డాగ్‌తో అనుబంధం రెట్టింపు

డోగా మన శరీరానికి ఎంత మేలు చేస్తుందో కుక్కకీ అంతే మేలు చేస్తుందిట! పైగా చీటికీమాటికీ అందరి మీదా కయ్యికయ్యిమని అరిచే కుక్కల వంకర బుద్ధిలో డోగా వల్ల గుణాత్మక మార్పూ కనిపిస్తోందంటున్నారు. డోగాభ్యాసం చేస్తున్న శునకాలు (అవి చేయవులెండి మనమే చేయిస్తాం) బుద్ధిగా జీవిస్తున్నాయని చాలామంది చెబుతున్నారు. ఒక్క కోస్టారికాలోనే కాదు న్యూయార్క్, ఫ్లోరిడా నగరాల్లోనూ డోగా మాస్టర్లున్నారు. పదేళ్ల క్రితమే ఈ డోగాభ్యాసం మొదలైంది. అయితే అప్పట్లో మార్కెటింగ్ ఎలా చేయాలో అర్థం కాక ఎవరికీ తెలియలేదు. ఇప్పుడు క్యాష్ చేసుకోవడం తెలిసిన మాస్టర్లు దీనికి తెగ పాపులారిటీ తీసుకొస్తున్నారు. మనిషికి, మూగ జీవికి ఆరోగ్యం వ్యాయామం అవసరమన్నది గుర్తించి దీన్నే మార్కెట్ సూత్రంగా చేసుకుంటున్నారు.

**- నివేదిత**




# ఆరడుగుల ఎత్తు మనిషి

**జయ విజయ అపార్ట్‌మెంట్... అందులో పన్నెండు కుటుంబా లుంటున్నాయి. మూడో అంతస్తులో వెంకట్రావు, తనూజ ఉంటున్నారు. వెంకట్రావు అపార్ట్‌మెంట్ సెక్రటరీ. మంచివాడు. చురుకైనవాడు. తనూజ కూడా కలివిడి మనిషే. ఆరోజు అపార్ట్‌మెంట్‌లో ఉన్నట్టుండి కరెంటు పోయింది.**

దాంతో అందరూ కిందకు చేరారు. ఫ్యూజ్ రిపేరు చేయించేపనిలో నిమగ్నమయ్యాడు వెంకట్రావు. పిల్లలు ఆటల్లో మునిగిపోతే, ఆడవాళ్ళు కబుర్లలో పడ్డారు. లైట్లు వెలిగాక ఎవరి ఇళ్లకు వాళ్ళు వెళ్ళారు. కానీ ఇంటికివెళ్లిన వెంకట్రావు 'షాక్' తిన్నాడు. ఎవరో అతడి భార్య తనూజను హత్య చేశారు. బెడ్‌రూమ్‌లో పడి ఉందామె. ఆమె గుండెల్లో కత్తి దిగింది. పోలీసులు వచ్చారు. వెంకట్రావు కింద తమతోనే ఉన్నాడని అపార్ట్‌మెంట్ వాళ్లంతా చెప్పటంతో వెంకట్రావుపై అనుమానం రాలేదు. కానీ వేరే వాళ్లెవరూ అపార్ట్‌మెంట్‌లోకి రాలేదు. అందరూ కిందనే ఉన్నారు. వాళ్లనిదాటి పైకి వెళ్లే ప్రసక్తిలేదు. అంటే, అపార్ట్‌మెంట్‌లో వాళ్ళే హత్యచేసి ఉండాలి.

కత్తిపై తనూజవి తప్ప వేరే వేలిముద్రలు లేవు. అపార్ట్‌మెంట్‌లోకి దొంగతనంగా ఎవరో ప్రవేశించారనటానికీ ఆధారాల్లేవు. పోలీసు జాగిలాలు ఎలాంటి ఆధారాన్నివ్వలేదు. హంతకుడిని పట్టుకోలేక పోతున్నందుకు పోలీసులపై విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. పోలీసులు అపార్ట్‌మెంట్‌లో ప్రతి వారినీ ఒకటికి రెండుమార్లు ప్రశ్నించారుకానీ, ఏమీ తేలటం లేదు.

వెంకట్రావు, తనూజల వ్యక్తిగత జీవితాలను జల్లెడ పట్టారు. వెంకట్రావుది మామూలు జీవితం. తనూజ డిగ్రీ చదువుకుంది. ప్రైవేట్ ఉద్యోగాలు చేసింది. ప్రస్తుతం ఆమె ఇంటి దగ్గరి స్కూల్లో టీచర్ ఉద్యోగంలో ఉంది. ఇద్దరి మొబైల్ ఫోన్లలో కాల్‌డేటా, చాట్ హిస్టరీ పరిశీలించారు. ఆధారాలు దొరకలేదు. కేసు వివరాలన్నీ విని ఆలోచిస్తూ ఇన్‌స్పెక్టర్ విజయ్‌ని అనుసరించాడు డిటెక్టివ్ శరత్. 'సీల్' చేసి ఉన్న ఇంటిదగ్గర గార్డు కాపలా ఉన్నాడు. విజయ్ ఆదేశంతో 'సీల్' బ్రేక్‌చేసి తాళం తెరిచాడు గార్డు.

వారం రోజులుగా గది తలుపు మూసి ఉండటంతో, తలుపు తెరవగానే ఓ రకమైన వాసన వారిద్దరినీ బలంగా తాకింది.

హాలు పరిశీలించాడు శరత్. బెడ్‌రూమ్‌లోకి వెళ్లాడు. మంచం మీద శవం పడి ఉన్న పొజిషన్ గీసి ఉంది. పరిశీలించాడు. మంచం కింద, షెల్ఫ్‌లు, బీరువాలు వెతికాడు. వంట గది, చెత్త డబ్బాలు పరిశీలించాడు. బాత్‌రూమ్‌లోకెళ్లాడు. గోడలకు నాలుగువైపులా మనిషి ఎత్తున టైల్స్ ఉన్నాయి. ఆ తరువాత టైల్స్‌లేవు. శరత్ దృష్టి, కమోడ్ ఉన్న గోడ మీద, టైల్స్‌పైన కనిపిస్తున్న నల్లటిచుక్కపై పడింది. దగ్గరకు వెళ్లి చూశాడు. అది నల్లని చుక్కకాదు. ఎవరో సిగరెట్ తాగి గోడకు నలిపి పారేశారు. కమోడ్ చుట్టు పక్కల వెతికాడు.

కమోడ్ వంపులో ఇరుక్కుని కనిపించింది చాలా చిన్న సిగరెట్టుముక్క.

'వెంకట్రావుకు సిగరెట్ తాగే అలవాటుందా?' అడిగాడు శరత్.

'బుద్ధిమంతుడు'.

'అయితే.. ఒక ఆధారం దొరికినట్టే' అన్నాడు శరత్ గోడకు అంటిన సిగరెట్ మసిని బ్లేడుతో తెల్లటి కాగితంపై సేకరిస్తూ.

'ఏమిటది?' అడిగాడు విజయ్.

శరత్ మాట్లాడలేదు.

కమోడ్ దగ్గర నుంచుని సిగరెట్ మచ్చఉన్న ప్రాంతం వైపు చూశాడు. తాను సిగరెట్ తాగినట్టు చేసి గోడపై సిగరెట్ పీకను చిదిమినట్టు నటించి చూశాడు. శరత్ చర్యలను విజయ్ ఆసక్తితో గమనించసాగాడు. గార్డు దగ్గర నుంచి సిగరెట్ అడిగి తీసుకున్నాడు శరత్. దాన్ని ఫిల్టర్‌గుర్తు వరకూ చింపాడు. గోడపై చిదిమి వదిలేశాడు. అది సరిగ్గా కమోడ్ వంపులో చిక్కుకుంది.

'హంతకుడు హత్యచేసిన తరువాతో, అంతకు ముందో టాయ్‌లెట్ వాడాడు. కమోడ్ దగ్గర నుంచుని మూత్ర విసర్జన చేస్తూ సిగరెట్ నులిమి పారేశాడు. సాధారణంగా ఇలాంటివారు సిగరెట్‌పీకను కమోడ్‌లో పారేసి ఫ్లష్ చేస్తారు. ఇతనికి అంత తీరిక ఉన్నట్టు లేదు' అన్నాడు. 'అది హంతకుడి ఆధారమేనా? అదెలా?' అడిగాడు విజయ్.

'వెంకట్రావు, తనూజలకు సిగరెట్ అలవాటు లేదు. మరిది ఎలా వచ్చింది? అదీగాక ఆ మచ్చను చూస్తే హంతకుడు కనీసం అయిదడుగుల ఏడంగుళాల పైనే ఎత్తు ఉండిఉండాలి'. వెంకట్రావు అంత ఎత్తులేడు కదా' చెప్పాడు శరత్.

•••

నువ్వు కోరినట్టే ఈ మసిని అనలైజ్ చేశాను. ఇది ఏ బ్రాండో కనుక్కున్నాను. సిగరెట్టు ముక్క మీద వేలిముద్రలు లేవు కానీ పెదిమల ముద్ర, లాలాజలం ఉంది. 'డిఎన్ఎ' తీయవచ్చు. కానీ శాంపిల్‌పై దుమ్ముకూడా ఉంది. అయినా ఫరవాలేదు' చెప్పాడు ఫోరెన్సిక్ నిపుణుడు ఫణి.

'గుడ్... ఇది చాలు' అన్నాడు శరత్.

•••

'బాస్... ఆ కాంపౌండ్‌లో సిగరెట్టు తాగేవాళ్లు ఏడుగురున్నారు. వారిలో ఈ బ్రాండు తాగేవాళ్లు ఇద్దరే ఉన్నారు. కానీ ఇద్దరూ అయిదడుగుల అయిదంగుళాల లోపు వారే' శరత్‌కి చెప్పాడు అసిస్టెంట్ రాము.

ఆలోచించాడు శరత్. తరువాత రాముని అడిగాడు. 'నువ్వు ఆ అపార్ట్‌మెంట్‌లో ఉండే వాళ్లందరి ప్రొఫైళ్లు తయారుచేశావు కదా! ఓ సారి ఆ ఫైలు ఇవ్వు'.

రాము అందించగానే, దాన్ని చదువుతూ మధ్యలో తలెత్తి రామువైపు చూశాడు.

'రాఘవేంద్ర సంగతి ఏమిటి?' అడిగాడు.

రాము ఫైలు తీసుకుని చూసి చెప్పాడు. 'రాఘవేంద్ర ప్రైవేట్‌ఉద్యోగి. ఆ భార్యాభర్తల మధ్య సఖ్యత లేదు. భార్య పుట్టింటికి వెళ్లింది. ఒక్కడే ఉంటున్నాడు. ఆరోజు అతడే అందరికన్నా ఎక్కువ యాక్టివ్‌గా రిపేరు పనిలో పాల్గొన్నాడు. అతడిని అనుమానించటానికి లేదు'.

ఆలోచిస్తూ కూచున్నాడు శరత్. చివరికి నిట్టూర్చి లేచాడు. 'ఓసారి రాఘవేంద్రను కలవాలి. అతడి భార్య ఎందుకు వెళ్ళిపోయింది?' అడిగాడు. 'అతన్ని ఎప్పుడూ సాధించేదట. అయినా రాఘవేంద్ర సిగరెట్ కాల్చడు' చెప్పాడు రాము.

అది విననట్టే లేచాడు శరత్.

•••

వెంకట్రావు ఇల్లున్న ఫ్లోర్‌లోనే ఉంది రాఘవేంద్ర ఇల్లు. రాఘవేంద్ర ఇంటి ముందు నిలబడి

**ఆ అపార్ట్‌మెంట్‌లో కరెంటుపోయింది. అందరూ కిందకు వచ్చేశారు. పిల్లలు ఆటల్లో పడ్డారు. ఆడాళ్ళు కబుర్లలో పడ్డారు. మగవాళ్ళు ఫ్యూజ్ రిపేరు పనిలో పడ్డారు. కరెంట్ వచ్చాక చూస్తే వెంకట్రావ్ ఇంట్లో అతడి భార్య హత్యకు గురైంది. బయటనుండి ఎవరూ అపార్ట్‌మెంట్‌లో ప్రవేశించలేదు. దొరికిన ఒక్క ఆధారం ఎవరికీ మ్యాచ్ కావడం లేదు. జాగిలాలు కూడా విఫలమయ్యాయి. మరి ఎవరీ హత్య చేశారు?**



హత్య జరిగిన ఇంటి వైపు చూశాడు శరత్. వేగంగా వెంకట్రావు ఇంటి వైపు నడిచాడు. అయిదు సెకన్లు పట్టింది. ఆలోచిస్తూ వెనక్కువచ్చి రాఘవేంద్ర ఇంటి తలుపు తట్టాడు. తలుపు తెరచి అనుమానంగా చూస్తున్న రాఘవేంద్రను పరిచయం చేసుకున్నాడు శరత్.

'మీ భార్య ఎందుకు వెళ్లిపోయింది?' అడిగాడు శరత్.

రాఘవేంద్ర ముఖం ఎర్రబడింది. 'అది మా స్వవిషయం' అన్నాడు.

'ఆమె అలా వెళ్లిపోతే, సయోధ్య కుదర్చటానికి ఎవ్వరూ రాలేదా?' మళ్ళీ అడిగాడు.

'మా ఇద్దరి సమస్యను మూడోవాళ్లు మాత్రం ఎలా తీరుస్తారు?' ప్రశ్నించాడు రాఘవేంద్ర.

'ఇటీవలి కాలంలో చివరిసారి ఎప్పుడు వచ్చారు?'

'వారం పదిరోజులై ఉంటుంది. బామ్మరిది వచ్చాడు. వెళ్లాడు' అని చెప్పాడు. బైటకు నడిచాడు శరత్.

●●●

'ఆయన మంచివారే. కానీ...' మాట మింగేసింది రాఘవేంద్ర భార్య మాధురి.

'కానీ..' రెట్టించాడు శరత్.

'ఇల్లు మారదామంటే మారరు. ఈ ఫ్లాట్ అమ్మేసి కొత్తది కొందామంటే వినరు' ఆపేసింది.

ఆమెను నిశితంగా చూశాడు శరత్. 'ఎవరి కోసం?'

చాలాసేపు మౌనంగా ఉంది మాధురి. తనూజ కోసమే! ఆమె మంచిదే. మావారే చెడ్డవారు. తనూజను చూసినప్పటి నుంచీ నేను అందవిహీనమయ్యాను. నేను ఇద్దరుపిల్లల తల్లిని. తనూజకు కొత్తగా పెళ్లయింది. దాన్నిచూసి నన్ను చులకన చేయటం మొదలు పెట్టారు. ఈయన వెర్రి వేషాలు వేసేవాడు. తనూజ పట్టించుకునేది కాదు. వెంట తిరిగేవాడు. నేను పోట్లాడాను. నన్ను పొమ్మన్నాడు. నేను పోతే ఇప్పుడు తనూజ పోయింది. నన్ను రమ్మంటున్నాడు' కోపంగా చెప్పింది మాధురి.

'తనూజను ఎవరు హత్యచేసి ఉంటారు.' అడిగాడు శరత్.

'ఛ...ఛ.. ఆయనకు అంత ధైర్యం లేదు. మాటలు, చూపులు తప్ప చేతలు లేవు. కానీ పొద్దస్తమానం నన్ను పొరుగువాడి భార్యతో పోల్చి చులకన చేయటాన్ని మించిన హింస ఏముంటుంది చెప్పండి?'

'మీకు తమ్ముడు ఉన్నాడని విన్నాను?' ప్రశ్నించాడు శరత్.

'తమ్ముడు కాదు. అన్న. వాడు పోలీస్ కానిస్టేబుల్. వాడు కూడా మా ఆయన్ని బెదిరించాడు. లాభం లేకుండా పోయింది'.

●●●

'కానిస్టేబుల్ కాంతారావు శరత్వైపు కుతూహలంగా చూశాడు. శరత్ ప్రశ్న విని సూటిగా అడిగాడు. హత్య నేను చేశానని అనుకుంటున్నారా.'

'తల ఊపాడు శరత్. దాదాపుగా ఆరడుగుల ఎత్తు ఉన్న కాంతారావు కళ్లల్లోకే చూస్తూ 'నేనూ మీలాగే నేరస్థులను పట్టుకుంటాను. నేరం చేయను' అన్నాడు కాంతారావు.

నవ్వాడు శరత్. 'మీ దగ్గరకు వచ్చేముందు నేను కొన్ని పరిశోధనలు చేసి వచ్చాను. మీరు తాగే సిగరెట్ బ్రాండ్ తెలుసు నాకు. మీ డిఎన్ఎ ప్రొఫైల్ తెలుసుకున్నాను. అంతేకాదు. మీకు మూత్రం వస్తే ఆగదని, దానికి మీరు ఆయుర్వేదం మందులు వాడుతున్నారనీ తెలుసుకున్నాను' అన్నాడు శరత్.

'దానికి, హత్యకి సంబంధం ఏమిటి? అయినా ముక్కూ మొహం తెలియనిదాని జోలి నాకెందుకు?'

'మీ చెల్లికాపురం కాపాడటానికి. మీరు ఆ రోజు రాఘవేంద్రని బెదిరించటానికి వెళ్లారు. కరెంటు పోయింది. అందరూ కిందకు పరుగెత్తారు. తనూజ ఒక్కతే ఇంట్లో ఉండటం చూశావు. బెదిరించాలని వెళ్ళావు. కోపం పట్టలేక హత్య చేశావు. మూత్రం ఆపుకోలేక బాత్రూమ్కి వెళ్ళావు. ఇంతలో లైట్లు వెలగడంతో అందరూ వస్తారనే తొందరలో సిగరెట్ గోడకు నులిమి పారేసి పరుగెత్తుకు వచ్చావు నీ గదికి. నువ్వు ఆపార్ట్మెంట్కి చెందినవాడివి కాకపోవటంతో నిన్నెవరూ పట్టించుకోలేదు. హడావుడిలో నెమ్మదిగా జారుకున్నావు, అంతేనా?' అడిగాడు శరత్.

కాంతారావు ముఖం పాలిపోయింది. పెదిమలు వణికాయి. 'నేను హత్య చేయాలనుకోలేదు. సిగరెట్ తాగుతూ యధాలాపంగా చూస్తే ఒక్కత్తే కనిపించింది. మాట్లాడాలని వెళ్లాను. ఆమె నన్ను రేపిస్టు అనుకుని కత్తితో బెదిరించింది. నేను కోపం పట్టలేకపోయా. బావని పటాయించింది... నాతో పతివ్రత వేషాలు వేస్తోందని కోపం వచ్చింది..' చేతుల్లో ముఖం దాచుకున్నాడు కాంతారావు.

**-కస్తూరి మురళీకృష్ణ**
**సెల్: 98496 17392**

7

# హవేలీ

-ఎస్. ఘటికాచలరావు సెల్:90031 41474



**అరగంట తర్వాత టాటాసుమో అరకునుంచి బయలుదేరి కొండ మార్గంలో రత్నగిరి వైపు ప్రయాణం సాగించింది. అందులో డ్రైవర్ సోంబాబు కాక ముగ్గురున్నారు. రాఘవ, లోకేశ్, త్రిలోక్.**

**"వాణ్ణెందుకు బకరాగాడంటున్నావు?" నవ్వుతూనే అడిగాడు లోకేశ్.**

"లేకపోతే ఆ పల్లెటూరి బైతుకూ, మనకూ పొంతనా? మన స్టేటస్, వాడి స్టేటస్ ఒకటేనా? రాజా రవీంద్ర వర్మ! పేరుకు ముందు రాజా అని తగిలించుకున్నంత మాత్రాన లేక రాజవంశానికి చెందినవాడైనంత మాత్రాన రాజైపోతాడా? బ్లడీ ఇడియట్. మన మీదే అధికారం చెలాయించాలని చూస్తున్నాడు. ఈ బిజినెస్ గురించి మనకన్నా వాడే ఎక్కువగా తెలుసుకున్నాడట. మనం వాడు చెప్పినట్టు నడుచుకోవాలట. అప్పుడే మనం మరింత పైకి రాగలమట. వాణ్ణి ఈ లైన్లోకి లాగింది మనం. అలాంటిది మనకే చెవులు కుట్టాలని చూస్తున్నాడు. సరుకు చేతికి రానీ, చెప్తాను. మొదట్లో వాడి ప్రవర్తన ఇలా లేదు. గత మూడు నాలుగు నెలలుగా కాస్త విపరీతంగా ప్రవర్తిస్తున్నాడు. అథారిటీ చెలాయించడం కాస్త ఎక్కువైంది. వాడికింకా ఫ్రెండ్సున్నారట. కాబట్టి ఈ బిజినెస్ ఎలాగైనా చేసుకోగలడట. మన అవసరం అతనికి లేదట. అతని అవసరం లేకుండా మనం ఉండలేమట. వాడి మాటలు వింటుంటే కోపం నషాళానికంటుతోంది. నుంచున్న పళాన వాణ్ణి పిట్టను కాల్చినట్టు కాల్చి పడేయాలనిపిస్తోంది" అతని ఆవేశం హద్దులు దాటుతోందని మిగతా ఇద్దరూ గ్రహించారు.

"కూల్‌డౌన్ గురూ. వాడు బావిలో కప్పన్న సంగతి మనకు తెలుసు. కానీ వాడికి తెలీదు. అక్షరం ముక్క అబ్బని పరమశుంఠ. వాడెదురుగానే మనం హాయిగా ఇంగ్లీషులో మాట్లాడుకున్నా వాడికొక్క ముక్క కూడా అర్థం కాదు. వాడి నుంచే ఐడియాలు తీసుకుని వాణ్ణెదురుగా ఉంచుకునే మన పనులు కూడా చక్కబెట్టుకోవచ్చు. చాణక్య నీతి అనుకో" అంటూ రాఘవను శాంతపరచే ప్రయత్నం చేశాడు త్రిలోక్.

"దొంగనోట్లు అచ్చెయ్యడమంటే పెళ్ళి పత్రికలు అచ్చేయడమనుకుంటున్నాడు. అందులో ఎంత రిస్కుందో ఇంకా వాడికి అనుభవంలోకి రాలేదు. ముందు ఆ బ్లాకులు మన చేతికి రానీ, అప్పుడు వాణ్ణొక ఆటాడిస్తాను".

టాటాసుమో కొండ మలుపు తిరిగి హోటల్ పాకకు కొద్ది దూరంలో ఒక చెట్టు దగ్గర ఆగింది. అక్కడికి కొంత దూరంలో ఎదురుగా మరొక సుమో ఆగి ఉంది. ఆ సుమో నుంచి ఫ్లాష్‌లైట్ ఈ సుమో మీద పడింది. అప్పుడు సమయం రాత్రి తొమ్మిది గంటలు.

"మీరిక్కడే ఉండండి. నేను మాత్రం వెళ్ళి వస్తాను" అని బండి దిగి ముందుకు నడిచాడు రాఘవ. అతని మాటకు కట్టుబడి మిగతావాళ్ళు సుమోలోనే ఉండిపోయారు.

ఐదు నిమిషాలు గడిచాక రాఘవ వెనక్కువచ్చి "వాడు హవేలీలోనే ఉన్నాడట. వాడి అనుచరుణ్ణి పంపించాడు. వీడెవడో ముసలాడిలా ఉన్నాడు. వీడితోబాటు హవేలీకి వెళ్ళి ఒక గంటలో వచ్చేస్తాను. మీరిక్కడే ఉండండి" అన్నాడు ఏదో ఆలోచిస్తూ.

"రాఘవా, ఒంటరిగా వద్దురా.



### జరిగిన కథ

అరకులోయ మార్గంలో ఉన్న కుగ్రామానికి వెళ్ళే తోవలోనే ఉంది పాడుబడిన హవేలీ ప్యాలెస్. ప్రశాంత వాతావరణంలో చదువుకుని ఐపీఎస్ పరీక్షకు సిద్ధమయ్యేందుకు ఆ ఊరికొస్తాడు విష్ణు. హవేలీ ప్యాలెస్ పూర్వకథ తెలుసుకుంటాడు. రాజా విజయేంద్ర వర్మ, అతడి నమ్మినబంటు, అతడి కూతురు, రాజా వారి కుమారుడు..ఇలా ఒకరి తరువాత ఒకరు ఆ ప్యాలెస్ నుండి అదృశ్యమై పోతారు. ఆ పాడుబడిన ప్యాలెస్ నుండి అర్ధరాత్రిళ్ళు ఆర్తనాదాలు వినిపిస్తూ ఉంటాయి. ఆ మిస్టరీని కనిపెట్టాలని నిర్ణయించుకుంటాడు విష్ణు. సొంత ఊరికి వెళుతున్నట్టు అబద్ధం చెప్పి చీకటివేళ హవేలీలో ప్రవేశిస్తాడు. అక్కడ ఒక మనిషి చేత మరో మనిషిని కాల్చి చంపించడం, ఆ శవం, మనుషులు మరుక్షణంలో పత్తా లేకుండా మాయం కావడం వంటివి అతడిని తీవ్ర దిగ్భ్రాంతికి గురిచేస్తాయి. ఆ తర్వాత.....

మేం కూడా వస్తాం. అసలే రాత్రి పూట. మనం వెళ్ళేప్రదేశం, వెళ్తున్న పని కూడా ప్రమాదకరమైనవే. నాకెందుకో కాస్త సందేహంగా ఉంది" లోకేశ్ ఆందోళన చెందాడు.

"పని ప్రమాదకరమైనదని చెప్పు, ఒప్పుకుంటా. ప్రదేశం మనకు తెలిసిందేకదా. ఇక భయం దేనికి? డోంట్ వర్రీ! ఇప్పటికి వందసార్లు వెళ్ళొచ్చాం" అని వాళ్ళను సమాధాన పరచి ముందుకు కదిలాడు రాఘవ.

ఎదురొచ్చిన టాటాసుమో కాసేపటికి రాఘవను ఎక్కించుకుని కనుమరుగైంది.

ఇక్కడ కూర్చున్న ముగ్గురూ అక్కడున్న హోటల్ అనబడే పాకలోకెళ్ళి టిఫిన్‌కు కూర్చున్నారు. చూస్తుండగానే గంట గడిచిపోయింది.

పాక బయటికి వచ్చి కొండ అంచువద్దకు వెళ్ళి దూరంగా కనబడుతున్న హవేలీ వంక చూశాడు లోకేశ్. కనుచూపు మేరలో వాహనమేదీ వస్తున్న ఆనవాళ్ళు కనబడలేదు.

మరో అరగంట గడిచింది. అక్కడున్న ముగ్గురిలోనూ టెన్షన్ అధికం కాసాగింది.

రాఘవను ఒంటరిగా పంపడం నిజానికి ముగ్గురికీ సుతరామూ ఇష్టం లేదు.

అయితే అతనిదే పైచేయి కావడం వల్ల మరో మాట మాట్లాడలేకపోయారు. పైగా వచ్చిన వాడెవడో ముసలాడని చెప్పడంవల్ల పెద్దగా పట్టించుకోలేదు.

సమయం రాత్రి పదకొండు గంటలు దాటింది. ఆ రోడ్డంట జన సంచారం పూర్తిగా ఆగిపోయింది. అప్పుడప్పుడూ వచ్చే బస్సు శబ్దాలు తప్ప మరేమీ లేవు. పాక కూడా కట్టేశాడు. చుట్టూ



పరిసరాల్లో చూసినంత మేరకు చిమ్మ చీకటి. ఉండుండి గబ్బిలాల అరుపులు వికృతంగా విని పిస్తున్నాయి. శరీరాన్ని కొరికే చల్లని కొండగాలి రివ్వున వీస్తూ ఒళ్ళంతా గగుర్పాటు కలిగిస్తోంది.

హవేలీలో కూడా లైట్లు ఆరిపోయి ఉన్నాయి. రాఘవ జాడ మాత్రం తెలియరాలేదు. ముగ్గురికీ వెన్నులో సన్నగా వణుకు ప్రారంభమైంది. వాళ్ళ మొదటి భయం రాఘవ తండ్రికి ఏమని సమాధానం చెప్పాలన్నదే. రెండో భయం ఈ అర్ధరాత్రి చీకటి. ఈ చీకట్లో ఇక్కడ ఇంకెంతసేపు అతని కోసం వేచి ఉండాలో అర్థం కాలేదు.

బిక్కుబిక్కుమంటూ ఆ నిశిరాత్రిలో, నిర్జన ప్రదేశంలో, చలిగాలిలో పాక పక్కనే ఉన్న కల్వర్టు మీద చాలాసేపు కూర్చున్నారు ముగ్గురూ. ఆ తరువాత వెళ్ళి సుమోలో కూర్చున్నారు. కూర్చున్న వాళ్ళు ఎప్పుడు నిద్రలోకి జారుకున్నారో వాళ్ళకే తెలీదు.

పక్షుల కిలకిల రావాలతో ఉలిక్కిపడి లేచారు. సమయం చూస్తే ఐదున్నర. అప్పుడే పాక తెరుస్తున్నాడు. కాస్త దూరంగా ఉండడం వల్ల సుమో బహుశా ఆ పాక ఓనరు కంటబడి ఉండదు. పైగా చెర్రీరంగు సుమో. తామున్న ప్రదేశమేదో తెలుసుకోడానికి వాళ్ళకు కొంత సమయం పట్టింది. ఆ తరువాత రాత్రంతా తాము ఆ కొండ మీదే ఉన్నామని గుర్తొచ్చి ఉలిక్కిపడ్డారు. అప్పటికీ రాఘవ ఇంకా రాలేదన్న విషయం గుర్తించి చాలా కలవరపడ్డారు ముగ్గురూ.



ముగ్గురికీ కడుపులో ఆకలి నకనకలాడుతోంది. పాకలోకెళ్ళి ఏమైనా తీసుకుందామనుకుంటే అంతలోనే ఏదో అనుమానం!

'నిన్న రాత్రినుంచి వీళ్ళిక్కడే ఉన్నారేంటని ఓనరుగాడికి అనుమానం వస్తే... పైగా రాత్రి తామే వాడికి ఆఖరి కస్టమర్లు. అంతత్వరగా మర్చిపోలేడు' అందువల్ల సాహసించి పాక వద్దకు వెళ్ళలేకపోయారు. కానీ మరోవైపు ఆకలి దహిస్తోంది.

అయితే అంతకన్నా ముఖ్యమైన విషయం రాఘవ ఇంకా రాకపోవడమే! వాళ్ళ మనసేదో కీడు శంకించింది. రవీంద్రవర్మను రాఘవ, తక్కువగా అంచనా వేశాడు. పైగా నోటికొచ్చినట్టు మాట్లాడాడు. అదే ఆవేశాన్ని అక్కడ రవీంద్రవర్మ ముందు కూడా ప్రదర్శించి ఉంటే దాని పర్యవసానం ఊహించుకోవడం కష్టం.

'పోనీ ఎలాగూ తెల్లారింది. కొండ దిగి హవేలీలోనికి వెళ్ళొస్తే...' అనుకున్నారు గానీ ఆ సాహసం అసలే చేయలేకపోయారు. ప్రస్తుతానికి అది చాలా ప్రమాదకరమైన విషయం. ప్రాణాలతో తిరిగి వెళ్తే కనీసం జరిగిందేమిటో ఎవరితోనైనా చెప్పొచ్చు. ఎవరినైనా సహాయానికి కూడా తీసుకురావచ్చు.

అలా అనుకుంటుండగానే అటుగా మరో సుమో వచ్చి నిలిచింది. అందులో నుంచి దివాకర్ రెడ్డి అనుచరులు నలుగురు దిగారు.

"ఏరా సోంబాబూ, అబ్బాయిగారెక్కడ?" అనడిగాడు అందులో అందరికన్నా దృఢంగా ఉన్న మనిషి. నలుగురూ ఇంచుమించు అలాగే ఉన్నారు.

డ్రైవర్ సోంబాబు సమాధానం చెప్పలేక గుటకలు మింగాడు. రాఘవ స్నేహితుల పరిస్థితి కూడా అందుకు భిన్నంగా ఏమీ లేదు.

కాసేపాగి మెల్లగా జరిగింది చెప్పాడు లోకేశ్.

"పిరికి దద్దమ్మల్లారా. ఏం ఫ్రెండ్సురా మీరు? వెళ్ళండి. మరో గంటకల్లా రాఘవబాబును పిలుచుకుని ఇక్కడికి రావాలి. లేకుంటే మీరెవ్వరూ అరకు వెళ్ళరు. గుర్తుంచుకోండి" అంటూ హూంకరించాడు వాడు మళ్ళీ. వెంటనే సోంబాబు బండి స్టార్ట్ చేశాడు.

"నువ్వెక్కడికి వెళ్ళేది? వాళ్ళిద్దరే వెళ్తారు. నువ్వు మాతోబాటుగా ఉండు".

ఆ గర్జన విని సోంబాబు ఠక్కున బండి దిగేశాడు భయంతో.

సుమో కొండ కిందికి బయలుదేరింది. సమయం సుమారు ఉదయం ఏడు గంటలు. అక్కణ్నుంచి హవేలీకి చేరుకునేందుకు దాదాపుగా అర గంట పట్టింది లోకేశ్, త్రిలోక్‌లకు.

కొండ అంచున నిలబడి సోంబాబు, మిగతా నలుగురూ బైనాక్యులర్‌తో ఆ సుమోనే గమనిస్తున్నారు. మూసి ఉన్న హవేలీ ప్రహరీ ద్వారం కనబడుతోంది. ప్రహరీ ద్వారం ముందు సుమో ఆగింది. అందులోనుంచి ఒకడు దిగి ద్వారాన్ని తెరిచాడు. వెంటనే సుమో లోపలికి ప్రవేశించింది. తరువాత సుమో కనబడలేదు.

వెనక్కువచ్చి పాక హోటల్లో ఐదుగురూ చాయ్ తాగారు. పాక ఓనర్ సోంబాబును గుర్తించాడు. అతను అదోలా చూడ్డంతో తనను గుర్తించాడన్న విషయం సోంబాబుకు తెలిసిపోయింది. అతని ముఖంలో భావాలే అతన్ని పట్టిచ్చాయి. సోంబాబుతో ఉన్న మరో నలుగురు దృఢకాయుల్ని కూడా బిక్కుబిక్కుమంటూ చూడసాగాడా ఓనర్. ఏం జరగబోతుందోనన్న భయం అతని కళ్ళల్లో స్పష్టంగా కనిపిస్తోంది. మిగతా నలుగురికీ తెలియకుండా ఏంటి విషయమన్నట్టు కళ్ళెగరేశాడు సోంబాబు. భయంగా తల అడ్డంగా, వేగంగా ఊపాడతను. సోంబాబు తన చూపులతోనే వాణ్ణి నోరు మూసుకోమన్నాడు.

అయితే తామక్కడ ఉన్న విషయం ఆ నలుగురికీ ఎలా తెలిసిందో అర్థం కాలేదు సోంబాబుకు. ఆ నలుగురూ దివాకర్‌రెడ్డికి అతి ముఖ్య అనుచరులు. దివాకర్ తాను నడిపే రియల్ ఎస్టేట్ వ్యాపారంలో గొడవలేవైనా తలెత్తితే సర్దడానికీ, అవసరమైతే కొత్త గొడవలు సృష్టించడానికీ ఆ నలుగుర్నీ అత్యంత విశ్వాసపాత్రులుగా తయారు చేసుకున్నాడు. తేడా ఏదన్నా వస్తే ఎవర్నైనా అక్కడే అడ్డంగా నరికేసి వెళ్ళిపోయే రకం. అది తలుచుకుని బిక్కచచ్చిపోయాడు సోంబాబు.

క్రితం రోజు సాయంత్రమనగా బయటికి వెళ్ళిన కొడుకు రాత్రంతా ఇంటికి తిరిగి రాకుండా,

**అతడో గ్రానైట్ క్వారీ యజమాని కొడుకు. స్నేహితులతో కలిసి బయలుదేరాడు. రాత్రి పొద్దుపోయాక హవేలీ ప్యాలెస్‌కు కొంచెం దూరంలో కారు ఆపి ఇప్పుడే వస్తానంటూ ఎవరితోనో కలిసి ప్యాలెస్‌లోకి వెళ్ళాడు. తెల్లారిపోయింది. అతడు తిరిగి రాలేదు! అతన్ని వెతికేందుకు ప్యాలెస్‌లోకి వెళ్ళిన మరో ఇద్దరుకూడా తిరిగి రాలేదు. వాళ్ళు ప్యాలెస్‌లోకి ఎందుకు వెళ్ళారు? అక్కడేం పని? వాళ్ళని ఎవరు రమ్మని పిలిచారు?**

## హిట్లున్నా పిలుపులు లేవట!

*'అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శని' అన్న చందంగా తయారైంది. సురభి పరిస్థితి. 'జెంటిల్‌మన్' సినిమా హిట్టు అయినా, స్టార్ హీరోల నుంచి సురభికి ఇంత వరకూ పిలుపు రాలేదట! చిన్న చిన్న సినిమాల ఆఫర్లు చాలానే వస్తున్నా, పెద్ద హీరోలు, పెద్ద బ్యానర్ల నుంచి పిలుపులు రాకపోవడంతో సురభి తీవ్రమైన అసంతృప్తిని వ్యక్తం చేస్తోందట! తన వెనుక వచ్చిన హీరోయిన్లు మంచి మంచి ఆఫర్లు అందుకుంటూంటే తనకు మాత్రమే ఎందుకిలా జరుగుతోందో అర్థం కావడం లేదంటూ సన్నిహితుల వద్ద వాపోతోందట!*

కనీసం ఫోన్ కూడా చెయ్యకుంటే ఎవరికైనా ఆందోళనగానే ఉంటుంది.

ఎంతగా ఎదిగిన కొడుకనుకున్నా తల్లిదండ్రుల మనసులో ఆరాటం ఉండనే ఉంటుంది. అయితే ఎవరో చెప్పినట్టుగా ఆ నలుగురూ ప్రత్యేకించి తామున్న చోటికే వచ్చి ఎలా చేరుకున్నారన్నదే సోంబాబుకు అర్థం కాని ప్రశ్న.

సమయం పది గంటలైనా వెళ్ళిన సుమో జాడగానీ, కనీసం లోకేశ్, త్రిలోక్‌ల జాడ గానీ తెలియలేదు. నలుగురు దృఢకాయులూ సోంబాబు వంక గుర్రుగా చూస్తున్నారు.

వాళ్ళ చూపులనుంచి తప్పించుకోవడం సాధ్యం కాని పని అని సోంబాబుకు అర్థమైపోయింది. వాళ్ళ చేతికి చిక్కకుండా పారిపోవడమొక్కటే అతను చెయ్యగలిగిన పని. అయితే ప్రస్తుతం అందుక్కూడా అవకాశం లేదు. అతను పరిగెత్తితే వాళ్ళు సుమోలో వచ్చి దాన్ని మీదికెక్కించి చిదిమేస్తారు. ఎలాగైనా ఉపాయం పన్ని వాళ్ళ దృష్టి మళ్ళించాలి అన్నదే ప్రస్తుతం అతని ఆలోచన.

పాక నుంచి బయటికి వచ్చి మళ్ళీ కొండ అంచునుంచి లోయలోనికి తొంగి చూశాడు సోంబాబు. దూరంగా హవేలీ కనబడుతోంది. కానీ దాని పరిసరాల్లో మాత్రం ఎటువంటి వాహనం గానీ, జనసంచారం గానీ లేదు. మూసి ఉన్న హవేలీ ప్రహరీ ద్వారం స్పష్టంగా కనిపిస్తోంది. సోంబాబు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. కొండవాలులో కూడా చెట్లు కాస్త దట్టంగానే పెరిగి ఉన్నాయి. వెనక్కు తిరిగిచూస్తే నలుగురూ ఏదో మాట్లాడుకుంటున్నారు. కేవలం క్షణకాలం ఆలోచించి లిప్తపాటులో సోంబాబు పిల్లిమొగ్గ వేశాడు కొండ ఏటవాలులోనికి. అది గమనించని ఆ నలుగురూ ఏవో మాట్లాడుకుంటూనే ఉన్నారు. ఐదు నిమిషాల తరువాత తిరిగి చూస్తే సోంబాబు జాడలేదు.

ఉలిక్కిపడ్డ నలుగురూ పెద్ద అంగలతో కొండ అంచుకు చేరుకున్నారు. అయితే సోంబాబు జాడ మాత్రం లేదు. నలుగురి ముఖాల్లోనూ తాము ఏమార్చబడ్డామన్న భావన క్రోధం రూపంలో కనిపించింది.

అవమాన భారం తట్టుకోలేనట్టుగా ఉన్నాయి ముఖకవళికలు. ఇప్పుడు వెళ్ళి దివాకర్ రెడ్డితో ఏమని చెప్పాలి?

అంతలో ఒకరివద్ద ఉన్న సెల్ మోగింది. తీసి చూస్తే తమ బాస్ దివాకర్‌రెడ్డి!

"ఎక్కడున్నార్రా?" అంటూ గర్జించిన శబ్దం మిగతా ముగ్గురికి కూడా వినిపించింది.

ఉలిక్కిపడి ఫోన్ కట్ చేసేశాడు వాడు.

"బాస్‌కు ఏం చెప్పాలి? ఫోన్ రావడంతో చెప్పకుండా వచ్చేశాం."

ముగ్గురి ముఖాల్లోనూ ఆందోళన.

అందులో ఒకడు "మనం కూడా ఆ హవేలీలోకి వెళ్ళి చూసొద్దాం" అన్నాడు.

"ముందు వెళ్ళిన రాఘవబాబు తిరిగి రాలేదు. చూసొస్తామని వెళ్ళిన అతనిస్నేహితులు కూడా వెనక్కి రాలేదు. ఇక్కడున్న సోంబాబు కూడా మనకు మస్కాకొట్టి పారిపోయాడు. మనం అక్కడికి వెళ్తే తిరిగొస్తామన్న గ్యారెంటీ ఏమిటి? అక్కడేదో మర్మం ఉంది. వెళ్ళి పెద్దాయనకు చెప్పడమే మంచిది. లేదంటే ఈ విషయం ఎప్పటికీ బయటికి రాదు" అన్నాడు మరొకడు.

"ముందు పెద్దాయనకేం సమాధానం చెప్పాలో అది ఆలోచించండి. అలాగని రాఘవబాబు సమాచారం తెలుసుకోకుండా వెనక్కు వెళ్ళడం కూడా మంచిది కాదు. ఇక్కడ కాకపోతే అక్కడైనా మనకు చావుదెబ్బ తప్పదు" అది మరొకడి మనోభావన.

అంతలో మళ్ళీ ఫోన్ మోగింది. మళ్ళీ దివాకర్ రెడ్డి! ఈసారి ఫోన్ తీయదల్చుకోలేదు. తీయటానికి ధైర్యం చాల్లేదు. చాలాసేపు ఫోన్ మోగి ఆగిపోయింది. కాసేపాగి మళ్ళీ మోగింది. అలా నాలుగైదు సార్లు మోగింది. నలుగురికీ ఏం చెయ్యాలో తోచడం లేదు.

క్రితం రాత్రి సుమారు పదిన్నర గంటలకు ఫోన్ వచ్చింది. ఫోన్ చేసిందెవరో తెలియదు కానీ విన్న సమాచారం మాత్రం నూటికి నూరుపాళ్ళు నిజమని అర్థమైంది.

'మీ రాఘవబాబు గురించి తెలుసుకోవాలంటే కొండమలుపు దగ్గరికి రా. అక్కడ పద కొండో మైలు రాయి దగ్గర మీ వాళ్ళు మరో ముగ్గురున్నారు. వాళ్ళనడిగితే చెప్తారు' అన్న మాటలు వినబడి ఫోన్ కట్ అయింది. అది కూడా రాఘవ ఫోన్ నుంచే వచ్చింది.

ఆ మాటలు విన్న వెంటనే మరో ఆలోచన లేకుండా బయలుదేరారు నలుగురూ. ఇక్కడి పరిస్థితి చూసి ఎలాగైనా రాఘవబాబు సమాచారం తెలుసుకోవచ్చనుకున్నారు. కానీ సమస్య మరింత జటిలమవుతుందన్న సంగతి ఊహించలేదు.

అంతలో మరోసారి ఫోన్ మోగింది. చూస్తే రాఘవబాబు నంబరు!

ఆత్రంతగా "హలో" అన్నాడు.

"మర్యాదగా వాళ్ళిద్దరూ వెనక్కు వెళ్ళిపోతే బాగుండేది. ఇప్పుడు వాళ్ళు కూడా ఇరుక్కుపోయారు. కేవలం ఇరుక్కుపోయారో, ఇక లేకుండా పోయారో... వెండి తెర పై చూడండి" అన్న మాటలు వినబడి మళ్ళీ కట్ అయింది ఫోన్.

నలుగురికీ ముచ్చెమటలు పోశాయి. అంటే ఆ లెక్కన రాఘవ సంగతి... ఆపై ఇక ఊహించుకోలేకపోయారు. ఇక అక్కడ ఉండి కూడా ప్రయోజనం లేదన్న విషయం అర్థమైంది. తలలు వేలాడేసుకుని సుమోను వెనక్కు మళ్ళించారు. తిరిగి అరకు చేరుకునేసరికి మధ్యాహ్నం

## దయ్యం పాత్రలు చెయ్యదట!

*పూర్ణాని చూసినప్పుడు దక్షిణాదికి మరో అసిన్ దొరికిందని చాలా మంది సంతోషపడ్డారు. రూపు రేఖల్లో కొద్దిపాటి పోలికలున్నా, కెరీర్ పరంగా మాత్రం అసిన్ స్థాయిని అందుకోలేకపోయిందనే చెప్పాలి. 'అవును' సినిమా సక్సెస్ సాధించినా అది పూర్ణాకు ఏమాత్రం ఉపయోగపడలేదు. ఆ తరువాత ఒకటి రెండు దయ్యం సినిమాలు చేసి భయపెట్టాలని ప్రయత్నించింది కానీ, ఫలితం లేకపోయింది. అసలు దయ్యం సినిమాలే తన కెరీర్‌ని దెబ్బ తీశాయన్న సంగతి పూర్ణాకి ఇంతకాలానికి తెలిసి వచ్చినట్టుంది. అందుకే ఇక మీద దయ్యం పాత్రలు చేయకూడదని ఫిక్స్ అయిందట! మంచి కథ దొరికితే తప్ప సినిమాలు చేయకూడదని కూడా డిసైడ్ అయిందట! గతంలో వచ్చిన ప్రతి అవకాశాన్ని ఒప్పుకున్నందువల్లే కెరీర్ ఈ స్థాయిలో ఉందని పూర్ణా ఇపుడు తీరిగ్గా బాధపడుతోందనేది తాజా సమాచారం!*



రెండు గంటలైంది.

వెంటనే దివాకర్ వద్దకు వెళ్ళలేదు. వెళ్ళా లంటే జంకుగా ఉంది. నాలుగైదుసార్లు ఫోన్ చేసినా తీయకపోవడం వల్ల పెద్దాయన అగ్గిమీద గుగ్గిలంలా ఉంటాడన్నది సత్యం. అలాంటి సమయంలో అతనికంట పడటం మంచిది కాదు. అయితే ఎప్పుడతని కంటపడ్డా మంచిది కాదన్న విషయం కూడా సత్యమే.

సుమో అరకు చేరుకుంది. అయితే దివాకర్ రెడ్డి ఇంటికి వెళ్ళలేదు. నలుగురూ కూడబలు క్కుని మరుసటిరోజు ఉదయం పది గంటలకు అతనింటికి వెళ్ళారు.

వీళ్ళను చూడగానే ఒక్కసారిగా విరుచుకు పడ్డాడు దివాకర్.

'చెప్పాపెట్టకుండా ఎక్కడికెళ్ళార్రా గాడిద కొడకల్లారా"

వాళ్ళ నోటి నుండి సమాధానం రాలేదు.

"రెండు రోజులుగా బాబింటికి రాలేదు. ఎక్కడి కెళ్ళాడో, ఏం చేస్తున్నాడో కనుక్కుందామని నిన్న నగా మీకు ఫోన్ చేస్తే కనీసం ఫోన్ తీయాలన్న జ్ఞానం కూడా లేదు మీకు. ఏమిటి మీకంతటి రాచకార్యాలు" తీవ్రస్థాయిలో విరుచుకు పడ్డాడు దివాకర్.

అప్పటికి ఒకడు నోరు విప్పాడు. వాడి నోటి నుంచి జరిగిందంతా వింటుంటే దివాకర్ ఒంట్లో రక్తం సలసల కాగిపోతున్నట్టనిపించింది.

కాసేపటి తరువాత దివాకర్ అసహనంగా తచ్చాడుతున్నాడు. క్రోధంతో అతని కళ్ళు అగ్ని గోళాల్లా ఉన్నాయి. ఆ నలుగురు తలలు వంచుకుని నిల బడి ఉన్నారు.

"కనీసం ఏం జరిగిందన్న విషయం కూడా తెలుసుకోలేకపోయారా?" అంటూ గర్జించాడు ఐదు నిమిషాల తరువాత. దానికి మౌనమే వాళ్ళ సమా ధానమైంది.

రాజప్రాసాదం లాంటి పెద్ద భవంతి ముందు లాన్‌లో పచార్లు చేస్తున్నాడతను. పచ్చగా పెరి గిన పచ్చిక పట్టు పరుపులా ఉంది. అయితే ప్రస్తుతం అది ఆస్వాదించే పరిస్థితిలో లేడతను. అది ముళ్ళపాన్పులా అనిపిస్తోందతనికి.

ఆ నలుగురూ ఒకరి ముఖాలొకరు చూసు కుని మళ్ళీ తలలు వంచుకున్నారు.

"మీరెప్పుడు బయలుదేరారు?"

"మొన్న రాత్రి పది గంటలకు"

"ఆ సోంబాబుగాణ్ణైనా తన్ని విషయం రాబట్ట లేకపోయారా?"

"........" మళ్ళీ మౌనమే వాళ్ళ సమాధానమైంది.

"మీ నలుగురిలో ఎవరో ఒకరు ఎప్పుడూ బాబు వెనకే ఉండాలని చెప్పానా లేదా? అతను బైటికెళ్ళేటప్పుడు మీరిక్కడ లేకుండా ఎక్కడి కెళ్ళారు? పైగా వెళ్ళి ఇరవై నాలుగ్గంటలైందని ఇప్పుడు నింపాదిగా చెప్తున్నారు. ఇప్పటిదాకా నాకు చెప్పకుండా ఏం చేస్తున్నారు? ఇందుకా మిమ్మల్ని మూడు పూటలా మేపేది? సిగ్గుగా లేదు" ఆవేశం తట్టుకోలేక ఠక్కున తుపాకీ తీసి అక్కడున్న ఒకడి కాలిమీద కాల్చాడు దివాకర్. అనుకోని పరిణామానికి ఉలికిపడ్డ మిగతా ముగ్గురూ దూరంగా పారిపోయారు. తుపాకీ దెబ్బ తగిలినవాడు కాలు పట్టుకుని అక్కడే కుప్ప కూలాడు.

"ఎక్కడికి పారిపోతార్రా. రండి. మీ ప్రాణాలు తీయలేదు, సంతోషించండి" అంటూ హిస్టీరిక్‌గా అరిచాడు దివాకర్.

తుపాకి శబ్దం విన్న అతని భార్య హేమ బయటికివచ్చింది ఆందోళనగా.

"నువ్వెందుకొచ్చావ్? వెళ్ళు లోపలికి" అంటూ గర్జించి గాల్లో కాల్చాడు దివాకర్.

అడుగు ముందుకేయబోయిన హేమ ఠక్కున ఆగి నిశ్చలంగా అక్కడే వాకిలి వద్ద నిలబడి పోయింది. ఆమె ముఖంలో ఆందోళన కలగలసిన భయం గోచరిస్తోంది.

ఐదు నిమిషాల తరువాత దివాకర్ ఆవేశం అదుపులోకి వచ్చింది. వాతావరణం ప్రశాంతంగా మారింది. దబ్బున పచ్చికలో కూలబడ్డాడు.

కాలికి దెబ్బతగిలిన వాణ్ణి ఉద్దేశించి "చెప్పు, చివరిసారిగా ఎప్పుడు, ఎక్కడ చూశావు?" అనడి గాడు మెల్లగా.

వాడు నోరు విప్పడానికి జంకుతున్నాడు. ఏం చెప్తే ఏ సమస్య ఉత్పన్నమవుతుందోనన్న




భయం అతని కళ్ళల్లో స్పష్టంగా కనిపిస్తోంది.

"అరకు దాటిన తరువాత ఒక కొండ ప్రాంతం ఉందయ్యా. అక్కడ డ్రైవర్ సోంబాబు, మన బాబు స్నేహితులు ఇద్దరు సుమోతో కనబడ్డారు. క్రితం రాత్రే రాఘవబాబు మన బండి దిగి వేరే ఎవరితోనో వేరే బండ్లో వెళ్ళిపోయారట. 'ఇక్కడే ఉండండి. ఒక గంటలో వచ్చేస్తా'నని చెప్పి వెళ్ళా రట. అయితే తిరిగి రాలేదు. మొన్నరాత్రి పది గంటలకు వెళ్ళారట. నిన్న తెల్లారగట్ల మేం వెళ్ళే వరకూ ఇంకా రాలేదు. మేం వెళ్ళాక సోంబాబును బెదిరించి అడిగితే ఈ విషయాలన్నీ చెప్పాడు.

కొండ మీది నుంచి చూస్తే రత్నగిరి సంస్థానం తాలూకు హవేలీ కనబడుతుంది. అక్కడికే వెళ్ళా రని సోంబాబు చెప్పాడు. అయితే తరువాత వాడు కూడా మా కళ్ళుగప్పి లోయలోకి దూకి పారిపోయాడు" అతని మాటలు నూతిలో నుంచి వచ్చినట్టున్నాయి.

"రత్నగిరి సంస్థానమా?" సాలోచనగా తల పంకించాడు దివాకర్‌రెడ్డి.

"అక్కడ ఎవరుంటారు?" కాసేపాగి మళ్ళీ అడిగాడు.

"రాఘవబాబు స్నేహితుడు రవీంద్రవర్మ అని ఆ హవేలీ యజమాని కొడుకట. అతనే వీళ్ళను రమ్మన్నాడట. ఏదో వ్యాపారం కోసమని చెప్పాడు సోంబాబు. వివరాలు మాత్రం చెప్పలేదు".

"వ్యాపారమా?" మరింతగా ఆశ్చర్యం పలి కింది దివాకర్ గొంతులో.

కేవలం రెండు నిమిషాలు ఆలోచించి "వెంటనే మనం బయలుదేరాలి. పదండి" అంటూ పెద్ద పెద్ద అంగలతో బయటికి నడిచాడు దివాకర్‌రెడ్డి.

అతని వెనక నలుగురూ పరుగు తీశారు. గుమ్మం వద్ద నిలబడ్డ హేమ ఏమీ అర్థం కాక వాళ్ళనే చూస్తూ నిలబడిపోయింది. కొడుకు తిరిగి రాలేదన్న విషయం గురించిన ఆందోళన ఎవరివద్ద వెలిబుచ్చాలో కూడా అర్థం కాలేదు.

సుమో వాయువేగంతో బయటికి దూకింది. సుమారు అరగంట ప్రయాణం తరువాత కొండ మలుపు దగ్గర ఆగింది సుమో.

నలుగురిలో ఒకడు దిగి కొండ అంచుకు వెళ్ళాడు. అతని వెనకే దివాకర్‌రెడ్డి కూడా వెళ్ళాడు. కొండ దిగువ దూరంగా కనబడుతున్న హవేలీని చూపిస్తూ "అదేనయ్యా బంగళా" అన్నాడు వాడు.

"అయితే బండి ఇక్కడెందుకు ఆపావు. పద అక్కడికే" అంటూ అరిచి విసుగ్గా వచ్చి బండిలో కూర్చున్నాడు దివాకర్.

ఆ గర్జనకు బెంబేలెత్తినట్టుగా ఉరుకులు పరుగులతో వాడు వెళ్ళి బండిలో కూర్చుని స్టార్ట్ చేసి వేగంగా ముందుకు దూకించాడు.

పాకఓనరు ఇదంతా బిక్కుబిక్కుమంటూ గమనిస్తూనే ఉన్నాడు. ఆ నలుగురు అనుయా యుల్లో ఒకడు వాణ్ణే తీక్షణంగా గమనిస్తూ ఉండడం వాణ్ణి మరింతగా బిగుసుకుపోయేలా చేసింది. సరిగ్గా పావుగంటకు హవేలీ ముందా గింది సుమో.

**(ఇంకావుంది)**

# నీరంటే నీరు కాదు
# అల్లాటప్పా నీరు కాదు!




**గుక్కెడు నీళ్లకోసం ఎన్ని పాట్లు పడాలో ఇప్పుడు అందరికీ తెలిసొచ్చిన వాస్తవమే. ఎండాకాలంలో, కరువు ప్రాంతాల్లో అయితే ఇక ఆ పాట్లు చెప్పనలవికాదు. నీళ్ళు కూడా కొనుక్కుంటారా! అని ఒకప్పుడు విడ్డూరంగా చెప్పుకున్న వాళ్ళు కూడా ఇప్పుడు డబ్బిచ్చి నీళ్ళు తాగాల్సిన పరిస్థితులు దాపురించాయి. నీళ్ళు కొనుక్కోడం అంటే వాటర్ క్యాన్ ఇరవై రూపాయలో, యాభై రూపాయలో ఉంటుందనుకునేరు! మనకు రెండు రూపాయల వాటర్ ప్యాకెట్ల గురించే తెలుసు. కానీ ప్రపంచంలో మంచినీళ్ళు తాగడానికి వేల రూపాయలు ఖర్చు పెట్టేవారున్నారు.**

నిజమా! అని నోరెళ్ళబెట్టకండి. ఎందుకంటే అవేం అల్లాటప్పా నీళ్ళు కాదట! ఆ నీరు తాగితే ఆరోగ్యానికి ఆరోగ్యం, స్వచ్ఛతకు స్వచ్ఛతానట! కాకులు దూరని కారడవుల్లోంచి చీమలు దూరని చిట్టడవుల్లోంచీ ఆ నీటిని తెస్తారట! అసలు ఆ నీటికి అంత ఖరీదు ఎందుకు వచ్చిందో మనం తెలుసుకుంటే ఆశ్చర్య పోవడమే కాదు, నీటిబొట్టు విలువ, దాని గొప్పతనం మనకి తెలిసొస్తుంది! మనం కోల్పోతున్నదేమిటో తెలుస్తుంది. నీటిని కలుషితం చేయకుండా ఎంత జాగ్రత్త పడాలో కూడా తెలుస్తుంది!

### కోనా నిగరి

కోనానిగరి అనే ఈ బ్రాండ్ నీటి ఖరీదు 27 వేల రూపాయలు! అంతమొత్తం చెల్లిస్తే 750 మి.లీ. వాటర్ బాటిల్ మన సొంతం అవుతుంది! ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన నీళ్ళివి. ఏంటి దీని గొప్ప? అనకండి. ఈ నీరు తాగితే ఆరోగ్యం మెరుగుపడుతుంది. బరువు తగ్గుతాం. చర్మం నిగారింపు వస్తుంది. ఒత్తిడి దూరమవుతుంది. ఈ నీటిని ఎక్కడనుంచి తెస్తారో తెలుసా? హవాయి దగ్గర్లోని పసిఫిక్ సముద్ర తీరంలో రెండువేల అడుగుల లోతు నుంచి తోడుకొస్తారు! ప్రత్యేక పద్ధతుల్లో ఉప్పును పోగొట్టి బాటిళ్ళలో నింపుతారు. సముద్రం అడుగున వేల అడుగుల లోతు నుంచి బయటకు తీయడంవల్ల ఈ నీరు స్వచ్ఛంగా ఉంటుంది. ఈ నీటిలో ఖనిజ లవణాలు ఎక్కువ మోతాదులో ఉంటాయి. ఈ నీటికి జపాన్‌లో మహా డిమాండ్. రోజుకు 80 వేలకు పైగా బాటిళ్ళు అక్కడకు దిగుమతవుతాయి.



### బ్లింగ్ హెచ్‌టూవో

ఇంత ఖరీదైన నీళ్ళు తాగే వారిలో ఎక్కువగా ఉండేది సెలబ్రిటీలే. బ్లింగ్ హెచ్‌టువో కంపెనీ వాటర్ బాటిల్ కూడా ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. ఈ బాటిల్ ఖరీదు 2,680 రూపాయలు. ఈ నీటిని టెనెస్సీ దగ్గ రున్న నీటి బుగ్గల నుంచి సేకరిస్తారు. ఈ జలంతో నింపే ఈ బాటిళ్లను స్వరోవ్‌స్కీ రాళ్ళతో తీర్చి దిద్దుతారు.



### ఫిన్లాండ్ వీన్ వాటర్

ఫిన్లాండ్‌కు చెందిన వీన్ కంపెనీ ఈ నీరు విక్రయిస్తోంది. 750 మిల్లీ లీటర్ల ఈ బాటిల్ ధర 1500 రూపాయలు. పచ్చదనం, స్వచ్ఛమైన వాతావరణం ఉన్న ప్రాంతాల్లోని నీటి బుగ్గల నుంచి ఈ జలం సేకరిస్తారు. ప్రపంచంలోనే ప్రకృతి సంపద ఎక్కువ ఉన్న దేశంగా గుర్తింపు పొందిన భూటాన్‌లోని హిమాలయ ప్రాంతం నుంచి ఈ నీటిని సేకరించి వివిధ దేశాలకు ఎగుమతి చేస్తున్నారు

### మంచునుండి తీసిన ఖరీదైన నీరు

కెనడాలోని వాంకోవర్ నగరానికి 200 మైళ్ళ దూరంలో ఉన్న పర్వత ప్రాంతంలో జనసంచారం, జంతు సంచారం ఉండదు. అక్కడ ఆరువేల అడుగుల లోతుతో వాలుగా ఉండే హిమనీనదాలను కరిగించి మంచినీరు బాటిళ్ళలో నింపుతోంది 10 థౌజండ్ కంపెనీ. 750 మిల్లీలీటర్ల ఈ నీటి బాటిల్ ఖరీదు కేవలం 950 రూపాయలే. నిర్మానుష్యమైన పర్వతప్రాంతం కాబట్టి ఆ నీరు కలుషితం కాదు. పైగా హిమనీనదాల నీరు. ఈ నీరు తాగితే రోగనిరోధక శక్తి పెరుగుతుందనీ, చర్మం మీద ముడుతలు రావనీ చెబుతోందీ టెన్ థౌజండ్ కంపెనీ.




### ఆక్వాడెకా

10 థౌజండ్ బీసీ వాటర్‌లాగే కెనడాకు చెందిన ఆక్వాడెకా కంపెనీ కూడా హిమానీ నదాల నుంచే నీటిని సేకరిస్తుంది. సుమారు 18 వేల సంవత్సరాల కిందట ఘనీభవించిన హిమనీ నదాల నుంచి సేకరించిన నీరిది. ఉత్తమ నాన్ కార్బొనేటెడ్ స్ప్రింగ్ వాటర్‌గా 2007లో బంగారు పతకాన్ని కూడా సాధించింది ఈ కంపెనీ. 750 మి.లీ ఈ వాటర్ బాటిల్ ఖరీదు 800 రూపాయలు.

### ఏవియాన్

ఈ ఫ్రాన్స్ కంపెనీ నీటి ధర లీటరుకు ఆరు వందలకు పైమాటే. క్రికెట్ మ్యాచ్‌ల సమయంలో విరాట్ కోహ్లీ కోసం తప్పనిసరిగా ఏవియాన్ బ్రాండ్ నీరు తెప్పించాల్సిందేనట. 1789లో ఫ్రాన్స్‌కు చెందిన మార్కిస్ అనే వ్యక్తి రోజూ వాకింగ్‌కి వెళ్తూ ఏవియాన్‌లెస్ బెయిన్స్ దగ్గరున్న నీటి బుగ్గలో నీరు తాగేవాడట. ఆ నీరు తాగడం మొదలుపెట్టాక అతడికున్న కిడ్నీ లివర్ సమస్యలు నయమయ్యాయట. అది కాస్తా ప్రచారం కావడంతో ఆ నీటిని అమ్మడం వ్యాపారంగా మారింది. అదే తర్వాతి కాలంలో ఏవియన్ బ్రాండ్‌గా విస్తరించింది. చాలామంది ప్రముఖులు ఈ నీటిని ప్రత్యేకంగా తెప్పించుకుని తాగుతారు. మన దేశంలోనూ ఆన్‌లైన్ ద్వారా ఈ బాటిళ్ళు అమ్ముతున్నారు.

### లాక్వెన్ ఆర్టెస్ వాటర్

ఈ నీటి ధర 400 రూపాయలు. దక్షిణ అమెరికాలోని ఆండీస్ పర్వతాల దగ్గర ఎలాంటి కాలుష్యం లేని మారుమూల ప్రాంతంలో 1500 అడుగుల లోతుకు వెళ్ళి తవ్వి తీసిన నీరే లాక్వెన్ మినరల్ వాటర్. బాటిల్లో నింపే వరకూ గాలి కూడా తాకనంత స్వచ్ఛంగా ఉంటాయట ఈ నీళ్ళు.

- విక్రం




**ఆధ్యాత్మిక సుగంధ పరిమళాలు ఆహ్లాదాన్ని కలిగిస్తూ, ఆ గిరి శిఖరాగ్రానికి చేరుకుంటున్న భక్తులందరినీ సేదతీరేలా చేస్తుండడమే కాకుండా అలౌకికమైన ఆనందానుభూతి కలిగేలా చేస్తోంది. స్వామి నామస్మరణతో ఆ పర్వత శ్రేణి పులకితమవుతోంది.**

**మదినిండా పొంగి పొరలుతున్న భక్తిభావంతో చేతులు జోడించి సాగుతున్న భక్తులు విచ్చుకున్న గొంతులతో దైవస్మరణ చేస్తూ తమ మదిలో కొలువైన స్వామిని కనులారా దర్శించుకునేందుకు తహతహలాడుతూ ముందుకు నడుస్తున్నారు.**

మెట్ల మార్గం ద్వారా నడుచుకుంటూ వస్తున్న భక్తులకు దూరాన్నుంచి మెరిసిపోతున్న గోపుర శిఖరం కనపడగానే వారిలో అలసట మాయమయింది. కొత్త శక్తి పుట్టుకొచ్చింది. ఎంత త్వరగా వీలయితే అంత వేగంగా స్వామిని సేవించుకుని పునీతులమవ్వాలనే కోరికతో దర్శనం క్యూలలో చేరుతున్నారు. కొద్ది నిమిషాలు వెనకబడినా చాలాసేపు నిరీక్షించాలనే ఆదుర్దాతో పరుగులు తీస్తూ కంపార్టుమెంట్లలోకి చేరుకుంటున్నారు.

రెండేళ్ళ క్రితం సెక్యూరిటీ గార్డుగా ఉద్యోగంలో చేరిన సామంతు ఇన్నాళ్ళూ గెస్ట్ హౌస్ దగ్గర డ్యూటీ చెయ్యగా, వారం క్రితం నుంచి ఆలయంలో డ్యూటీకి మార్చారు. తన మనసులో ముద్రవేసిన స్వామి సన్నిధిలో పని అతనికి సంతృప్తి కలిగిస్తోంది.

ఎక్కడో కొండకోనల్లో బతికే తనకు చివరికి ఈ స్వామి కొండమీద పనిచేసే అవకాశం రావడం, ఒకానొక దశలో ఆత్మహత్య చేసుకునేందుకు ఉద్యుక్తుడయిన తనకు ఇలా బతికే అవకాశం కలగడం తన అదృష్టమనిపిస్తోంది. గతంలో ఎదురైన ఆటుపోటులూ, ఒడిదుడుకులూ కనులముందు కనిపించాయి.

●●●

"దండాలు దొరా" తండా దగ్గరకి వస్తున్న నారాయణమూర్తి మాస్టారుగారిని చూసి చేతులు జోడించాడు కోదులు.

"ఏం కోదులూ... బావున్నావా?" గుడిసెల్లోంచి బయటికొచ్చిన జనాలను చూసి నవ్వారు మాస్టారు.

విజయనగరానికి ఉత్తరంగా సుమారు డెబ్బై కిలోమీటర్ల దూరాన ఉన్న మక్కువ గ్రామాన్ని దాటుకుని దుగ్గేరు చేరుకున్నాక కనిపించే గిరిశ్రేణుల మీద పన్నెండు కిలోమీటర్లు కాలినడకన ప్రయాణిస్తే తొలుత కనిపించే జాతాపు తండా అది. అరవై మంది వరకూ జనాలున్న ఆ తండాకి నాయకుడు కోదులు.

జాతాపు తెగల ఆచార వ్యవహారాలు, భాష, జీవన విధానాలను అధ్యయనం చేసే నిమిత్తం అప్పుడప్పుడూ వచ్చే నారాయణమూర్తి మాస్టారంటే వాళ్లందరికీ గౌరవమే. ఆయన వచ్చినప్పుడల్లా డాక్టర్ శ్రీరామమూర్తి గారి దగ్గర్నుంచి మందులూ, మాత్రలూ తెచ్చి ఇవ్వడం, తమ బాగోగుల కోసం తపించడం వారికి ఆయన్ను మరింత దగ్గర చేశాయి.

"దొరా... మీరొకపక్క మా గురించి, మా బాస గురించి మంచిగా రాత్తావుంటే ఇక్కడ ఒక్కక్కలూ కొండ దాటి ఊర్లోకు పోతున్నారు. రెండేళ్ళక్రితం వందమందికి పైగా ఉండేవోళ్ళం..."

తమ తెగకి ఉన్న ప్రత్యేక సంస్కృతి అంతర్ధానమయిపోతున్నదన్న బాధ కోదులు మాటల్లో వ్యక్తమవుతోంది. అందరూ తెలుగు పదాలే

నేర్చుకుని మాట్లాడుతూండడంతో తమ కువ్వి భాష క్షీణించిపోతున్నదని అతను చింతిస్తున్నాడు.

"కోదులూ.. జీవన సంస్కృతిని కాపాడుకోవడం కోసం వాళ్ళు ఇక్కడే ఉండిపోవాలనుకోవడం భావ్యం కాదు. బయటకి వెళ్ళి చదువుకుని, జ్ఞానాన్ని పెంచుకుని బాగుపడడం వాళ్ళ హక్కు. అసలు మీ తెగల వాళ్ళకి ఎదగడానికి ఎన్నో అవకాశాలు ఉన్నాయక్కడ. అయినా అభివృద్ధిలోకొచ్చిన తర్వాత వారు మరింతగా తమ సంస్కృతిని పరిరక్షించేందుకు ముందుకొస్తారు."

తండ్రి వెనకాలే వేటకీ, వ్యవసాయానికీ వెళుతున్న సామంతుణ్ణి పట్టుబట్టి ఎంతో మక్కువగా తనతోబాటు తీసుకుని వెళ్ళారు మాస్టారు. అక్కడ స్కూల్లో చేర్పించడమే కాకుండా హాస్టల్లో వసతి దొరికేలా చూశారు.

చదువుకోవడం మొదలెట్టిన సామంతుకి క్రమంగా సమాజంమీద అవగాహన పెరిగింది. తన హక్కులు తెలిసి వచ్చాయి. చదువుతో ఆర్థిక స్థితిగతులెలా మెరుగవుతాయో అర్థమైంది.

ప్రతీవారం నారాయణమూర్తి మాస్టారు క్లాసులో పిల్లలకి చెప్పే పౌరాణిక, చారిత్రక కథలు అతనిలో అవగాహన కలిగించాయి. ఎన్నో రూపాలలో భగవంతుడు భూమి మీదకొచ్చి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ధర్మాన్ని నిలబెట్టడం

**తిరుమల సన్నిధిలో కంపార్ట్‌మెంట్లన్నీ భక్తజన సందోహంతో నిండిపోయాయి. పసిపిల్లల ఏడుపులతో గోల గోలగా ఉంది. క్యూలో కదలిక లేదు. ఆ స్వామిని కన్నులారా దర్శించాలని వచ్చిన వృద్ధులు ఓపిక నశించి స్పృహతప్పే స్థితికి వస్తున్నారు. అప్పుడే ఎవరో వివిఐపి వచ్చాడు. అతడికి పూర్ణకుంభ స్వాగతం పలికేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆ సమయంలో ఏం జరిగింది?**

అతనిపై ఎంతో ప్రభావాన్ని చూపాయి. కొత్త ఆలోచనలకు నాంది పలికాయి.

అందమైన భవిష్యత్తు గురించి కలలు కనడం, వాటిని సాకారం చేసుకోవాలంటే ఏం చేయాలో యోచించడం అసంకల్పితంగా అలవాటయింది.

సామాజిక జీవనంపై అవగాహన పెరిగాక గిరిపుత్రులు ఎంతలా వంచించబడుతున్నారో అర్థమైంది. గత అరవై ఏళ్ళుగా వీర్రాజు మనుషులు తమ తండా ప్రజల కష్టాన్ని ఎలా దోచుకుంటున్నారో తెలిసివచ్చింది. ప్రాణాలకోర్చి సేకరించే వనరులూ, సరుకులని, పదో పరకో చేతిలో పెట్టి కొల్లగొట్టుకుపోవడం, లక్షల్లో వ్యాపారం చేసుకోవడం ఏళ్ళ తరబడి దినవారీ కృత్యమయింది.

టెన్త్ క్లాసు పాసయిన తర్వాత ఇంటికెళ్ళిన సామంతు తనవారందరికీ తామెంత మోసపోతున్నామో అర్థమయ్యేలా చెప్పాడు. తమ హక్కుల పరిరక్షణకు ప్రశ్నించడాన్ని అలవాటు చేశాడు.

దశాబ్దాలుగా వినిపించని గొంతులు సవరించుకోవడం వీర్రాజుకి నచ్చలేదు. అప్పటికే రాజకీయాల్లోనూ క్రియాశీలకంగా ఉంటూ ఉన్నత స్థానానికి ఎదిగిన వీర్రాజుకి తననీ, తన మనుషులనీ ప్రశ్నించే అవకాశం ఎవరికీ ఇవ్వకూడదనుకున్నాడు. ఫలితంగా కోదులు స్వరం మూగబోయింది. చింతచెట్లు దట్టంగా ఉండే గుట్ట మీద కెళ్ళిన కోదులు కాలుజారి బండమీద పడి చనిపోయాడు.

ఈ హఠాత్ పరిణామం సామంతుని కుంగదీసింది. ఏం చేయాలో తెలియని పరిస్థితిలో ఇంటర్ సెకండియర్ చదువు వదిలేసి సాలూరునుంచి తండాకి వెళ్ళిపోయాడు. తండ్రి మరణంపై సామంతులో ఎన్నో అనుమానాలు? ఇన్నాళ్ళుగా లేని ప్రశ్నించే నైజం కొత్త కష్టాలు తెచ్చి, జీవితంలో తేరుకోలేని నష్టాలు కలిగిస్తోంటే తను

## మనమీదేనర్రోయ్!

సరసి





మారాలో లేదో అర్థం కాని పరిస్థితిలో కొట్టుమి ట్టాడాడు.

చిన్నతనంలోనే తల్లిని కోల్పోయిన సామం తుకి ఇప్పుడు తండ్రి దూరమవడం భరించలేని ఒంటరితనాన్ని పరిచయం చేసింది. దిక్కుతోచని స్థితిలో ఆత్మహత్య శరణ్యమా అనిపించినా చదువు నేర్పిన యోచనాశక్తి అతన్ని అందుకు పురి గొల్ప లేదు.

నెలరోజుల క్రితం నారాయణమూర్తి మాస్టారు తమ కూతురింటికి హైదరాబాద్ వెళ్ళి ఉండడంతో తనకి మార్గనిర్దేశం చేసేవారు లేక నిర్వేదానికి గురయ్యాడు సామంతు.

హైదరాబాద్ నుంచి తిరిగొచ్చిన మాస్టారు గారికి వివరాలు తెలిసిన తరువాత తండాకి వెళ్ళారు. "సామంతూ, మీ నాన్న చనిపోవడం వెనుక కుట్ర ఉన్నట్లే అనిపిస్తోంది" తన సందేహాన్ని వెలి బుచ్చారు.

సామంతులో కోపం కట్టలు తెంచుకుంది? "వీర్రాజుని చంపాలని ఉంది" అతని ఉద్రేకానికి అడ్డు కట్ట వేశారు మాస్టారు.

"సామంతూ.. వీర్రాజు ఇప్పుడు సామాజికంగా చాలా ఉన్నతమైన స్థానంలో ఉన్నాడు. నీవున్న పరిస్థితిలో అతన్నేమీ చెయ్యలేవు. నీ వయసు దృష్ట్యా సాధ్యం కాని పని. నువ్వు ఇంకా చదవాలి. ఎదగాలి. సమాజం అండతో ధర్మానికి లోబడి నీ శత్రువులను ఎదుర్కోవాలి."

మాస్టారి మాటలు అతన్ని ఆలోచింప జేసినా మళ్ళీ చదువు కొనసాగించడానికి అతను సంసిద్ధం కాలేదు. అతని పరిస్థితి అర్థం చేసు కున్న మాస్టారు తన ఓల్డ్ స్టూడెంట్స్ సహా యంతో సెక్యూరిటీ గార్డ్‌గా ఉద్యోగం వేయిం చారు.

ఉద్యోగస్థుడిగా కొత్త జీవితం అతని దిన చర్యలో మార్పులు తేవడంతోబాటు కొత్త వాతా వరణం అతని మనసుగాయాన్ని మాన్పడంతో బాటు ఆలోచనల్లోనూ మార్పుకు తోడయింది.

●●●

"ఇదుగో బాబూ.. మా పిల్లకి.. ఒంట్లో బాగో లేదు. కాస్త వదిలిపెట్టవా.."

"నాలుగ్గంటలనుండీ వెయిట్ చేస్తున్నాం. ఎప్పటికి వదులుతారూ?"

సాయంత్రం ఏడు గంటలకే రిటర్న్ బస్సు. ఆలోగా దర్శనం అవుతుందో లేదో"

భక్త జనాలతో కిక్కిరిసిన కంపార్టు మెంట్లలో అంతా రణగొణధ్వని.. పసిపిల్లల ఏడుపులతో గోలగా ఉంది. గంటల తరబడి ఎదురు చూస్తున్నా క్యూలలో కదలిక లేకపోవడం, ఇంకా ఎంతసేపు ఇలా ఓపిక పట్టాలో తెలియకపోవడం అందర్నీ తెలియని అసహనా నికి గురిచేస్తోంది. అదికాస్తా కోపంగా పరిణమించి పక్క పక్కన నిలబడ్డవారి మధ్య తగ వులకూ, ఘర్షణలకూ దారితీ స్తోంది. కూర్చోడానికి ఉన్న సీట్లన్నీ నిండిపోవడంతో చాలామంది భక్తులు గంటల తరబడి నిలబడి ఉన్నారు.

వరుసలో ఉన్న పన్నెండు కంపార్టుమెం ట్లకూ సెక్యూరిటీ బాధ్యత వహిస్తున్న సామంతు దృష్టికి భక్తజనాల ఇబ్బందులు చేరుతున్నప్ప టికీ ఏం చేయలేని నిస్సహాయస్థితిలో ఉన్నాడు. సూపర్‌వైజర్ దగ్గర్నించి సూచన వచ్చేవరకూ ఏ కంపార్ట్‌మెంట్ తలుపూ తెరిచే వీలులేదు.

"అమ్మా.. ఏవయింది?" డెబ్భైఏళ్ల తల్లి నేలకు ఒరిగిపోవడంతో ఒక్క ఉదుటన ముందుకు దూకి చేతుల్లోకి తీసుకున్నాడు కొడుకు. ఉపవాస దీక్షలో ఉన్న ఆ వృద్ధురాలు శక్తి హరించుకుపోవడంతో నిస్సత్తువ ఆవరించి కళ్ళు తిరిగి కింద పడి పో యింది. ఆమె కోడలు తన ఒడిలో పడుకోబెట్టు కుని బాటిల్లోని మంచినీళ్ళు మొహాన జల్లింది. కాళ్ళూ చేతులూ మర్దనా చేసింది. కొద్ది నిమిషా లకి కళ్ళు తెరిచిందా తల్లి.

ఆ పరిస్థితిలో నీరసంగా ఉన్న తల్లిని క్యూలో నడిపించి దైవదర్శనానికి తీసుకెళ్ళడం వీల య్యేలా అనిపించలేదు. కిక్కిరిసి ఉన్న జన సమూహం మధ్య వెనక్కి వెళ్ళగలిగే అవకా శమూ లేదు.

"బాబూ.. మా అమ్మగారు కళ్ళు తిరిగి కింద పడిపోయారు. నడిచే పరిస్థితిలేదు. కొంచెం వదిలిపెట్టవా..." ఆ కొడుకు అభ్యర్థనలో న్యాయం ఉన్నప్పటికీ తన ఉద్యోగ బాధ్యత, అధికార పరి మితి సామంతుని నిస్సహాయుడిగా నిలబెట్టింది.

స్వామిని కనులారా దర్శించుకోవాలనే ఏకైక ఆశతో ఎంతో దూరాన్నుంచి వచ్చిన సామాన్య భక్తులకు ఈ కష్టాలెందుకూ? అనే ప్రశ్న సామంతు మదిలో ఉదయించింది. దేవదేవుని దగ్గర బాధల్ని ఏకరువు పెట్టుకుని సాంత్వన పొందా లని వచ్చే క్రమంలో మరిన్ని బాధలకు గురికా వడం ఎంతవరకూ సమంజసం అనే సందేహం జనించింది.

"ఒక్క అరగంటలో వదిలిపెడదామని మా సూపర్‌వైజర్ చెప్పారు. ఈ కొద్దిసేపు ఓపిక పట్టండి" అభ్యర్థిస్తున్నట్లుగా చెప్పాడు సామంతు.

ఆ పెద్దావిడలాగే ఎందరో వృద్ధులు ఓపిక తెచ్చుకోలేక ఆపసోపాలు పడడం సామంతుణ్ణి తెలియని అసౌకర్యానికి గురిచేసింది. ఇంత మందిని ఇంత నిరీక్షణలో ఉంచడం భావ్యం కాదనిపించిందిగానీ పరిష్కారం తోచలేదు.

# డేటింగ్‌లో లేదట!

*ఒక హీరోయిన్ హీరోతో డేటింగ్‌లో ఉందనో, లేక పోతే ఆ హీరోని ప్రేమిస్తోందనే వార్తలు వస్తే వాటిని ఖండించడం, తమకు సంబంధం లేని వార్తలు రాస్తున్నారని గోల గోల పెట్టడం హీరోయిన్లు చేసే మొదటి పని. ఇలాంటి వార్తలు తమకు ఫ్రీ పబ్లి సిటీ ఇస్తాయని నమ్మే కొందరు హీరోయిన్లు వీటి పైన మౌనంగా ఉండిపోతారు. కృతి సనన్ మొదటి కోవకి చెందిన హీరోయిన్నే! ఇటీవలి కాలంలో కృతి సనన్ తనతో చాలా క్లోజ్‌గా మూవ్ అవుతోందనీ, ఇద్దరం డేటింగ్‌లో ఉన్నామంటూ అర్థం వచ్చే రీతిలో ఉన్న ఫోటోలను బాలీవుడ్ హీరో సుశాంత్‌సింగ్ రాజ్ పుట్ సోషల్ మీడియాలో పోస్ట్ చేయసాగాడు. ఈ ఫోటోల గొడవ చూసి కృతి నెత్తీ నోరూ కొట్టుకుంటోంది. అతనికీ తనకూ ఎలాంటి సంబంధం లేదంటూ వాపో తోంది. ఆ వ్యక్తిని తను ఇంత వరకూ కలవనేలేదనీ, ఇక అతనితో డేటింగ్ ఎలాచేస్తాననీ? ప్రశ్నిస్తోంది.*

అదే సమయానికి సూపర్‌వైజర్ అటుగా రావడంతో కంపార్ట్‌మెంట్ల గేట్లు తెరవమని ఆదేశాలు ఇవ్వడానికే వస్తున్నాడనే ఊహతో ఎదురెళ్ళాడు సామంతు.

"ఇదుగో.. అనుకోకుండా ఒక వీఐపీ వచ్చారు. ఆయనకి పూర్ణకుంభ స్వాగతం ఏర్పాటు చేశారు. ఈ జనాలని వదలడానికి కనీసం రెండు గంటలు పడుతుంది. జాగ్రత్తగా చూసుకో."

సామంతు మనసంతా బాధతో నిండిపో యింది. వెనక్కి తిరిగి వెళ్ళబోతున్న సూపర్ వైజర్ని అడిగాడు "ఎవరు సార్.. ఆ వీఐపీ?"

"వీర్రాజుగారు.. చాలా పెద్ద పొలిటికల్ లీడర్" సూపర్‌వైజర్ వెళ్ళిపోయాడు.

సామంతు విద్యుద్ఘాతం తగిలినవాడిలా నిలుచుండిపోయాడు. వీర్రాజు పేరు వినగానే అతని మెదడులో ప్రకంపనలు వెల్లువెత్తాయి. రాక్షసత్వానికీ, అధర్మానికీ ప్రతీక అయిన వీర్రాజుకి పూర్ణకుంభ స్వాగతమా? అధర్మానికి ప్రతిరూప మైన వీర్రాజుకి సగౌరవ మర్యాదలా?

ఇది చాలా అన్యాయమనిపించింది సామం తుకి. దైవ సాన్నిధ్యంలో ఇలా జరగడాన్ని అతని మనసు అంగీకరించడంలేదు. కంపార్ట్‌మెంట్ గోడపై ఉన్న స్వామి చిత్తరువుకేసి తదేకంగా చూశాడు. స్వామి కళ్ళల్లో చిద్విలాసం కనపడింది. నా ప్రబోధం ఎప్పుడూ ఒకటే గానీ మీ మనుషులు అర్థం చేసుకోవడంలోనే ఉంది లోపం అని చెబు తున్నట్లుగా అనిపించింది.

స్వామి సందేశం అర్థం చేసుకున్నవాడిలా అతని ఆలోచనలు ఆగిపోయాయి. ఒక స్థిర నిశ్చ యానికొచ్చిన వాడిలా ముందుకి కదిలాడు. వేగం అందుకుని పరుగుపెడుతూ ఒక్కొక్క కంపార్ట్‌మెంటు గేటునీ తెరుచుకుంటూ పోయాడు.

ఉప్పొంగిన సాగరకెరటాల్లా జనం పరు గులు పెట్టారు. స్వామిని తమకు తోచిన నామంతో ఎలుగెత్తి పిలుస్తూ మహామండపం వైపు సాగిపోయారు.

వేవేల భక్తజనాల తాకిడికి మండపానికి వెళ్ళే దారంతా కిక్కిరిసిపోయింది. లాకులు ఎత్తిన ఆనకట్ట దగ్గర పొంగిపొర్లే జలప్రవాహంలా దూసుకొస్తోంది జనవాహిని.

తరంగ ధ్వనితో విరుచుకుపడుతున్న జన సంద్రాన్ని చూసి వీర్రాజుకి పూర్ణకుంభంతో స్వాగతం పలకడానికి ఎదురెళుతున్న అర్చక బృందం నివ్వెరపోయారు. చేష్టలుడిగి నిలుచుండి పోయారు. ఏంజరిగిందో అర్థం కాలేదెవ్వరికీ.

దేవాలయంలో పూర్ణకుంభ స్వాగతం పల కడం అనేది అందరికీ దక్కే అవకాశం కాదు. దాన్ని అదృష్టంగా భావిస్తారు. ఇప్పటికాలంలో దాన్ని పొందే అర్హత ఒక్కటే.. ఆర్థికంగా తగినంత పరి పుష్టి ఉండడం లేదా రాజకీయ రంగంలో ఏదోలా ఉన్నత స్థానంలో ఉండడం. అలాంటి స్థానంలో ఉన్నవారు తమకున్న ప్రత్యేక హక్కులు, సౌకర్యాలను వినియోగించుకుని తమ అహాన్ని సంతృప్తి పరుచుకుంటుంటారు. పూర్ణకుంభ స్వాగతం పొందగలిగే అర్హత సాధిం చడం లోపలి మనిషి ఎలా ఉన్నా బైటికి మాత్రం స్వచ్ఛమైన భక్తుడిగా ముద్ర పడినట్లే! నిర్మలమైన భక్తుడు కాబట్టే దేవుని కృపకు పాత్రుడయినట్లుగా అందరూ భావించాలని వారు ఆశిస్తారు.

పట్టువస్త్రాలు ధరించి, భుజం చుట్టూ కాషాయం రంగు గావంచా వేసుకుని, కుటుంబ సభ్యులూ, కొందరు అనుచరులూ అనుసరిస్తుం డగా తాదాత్మ్యం నిండిన చూపులతో.. ఆధ్యాత్మి కత నిండిన ముఖకవళికలతో మండపద్వారం దగ్గరకు వచ్చి స్వాగతసత్కారాలకోసం నిలబడ్డ వీర్రాజు చెవిన జనహోరు సోకింది.

వెనుదిరిగి చూసిన అతని కళ్ళకు పరుగులు పెడుతూ వస్తున్న జనావళి కనిపించారు. సాధా రణంగా నేరాలతోనూ, మోసాలతోనూ, అక్రమాల తోనూ బతికే వ్యక్తిలో భయం ఏదో ఒక మూల గూడుకట్టుకుని ఉంటుంది. దాన్ని తొక్కిపెట్టేసి గుంభనంగా బతికేస్తుండొచ్చు గానీ ఏదో ఒకనాడు లావాలా ఆ భయం వెలువడే పరిస్థితి రావొచ్చు.

ఇప్పుడు సరిగ్గా వీర్రాజుకి అదే పరిస్థితి ఎదురైంది. తనద్వారా మోసపోయిన వాళ్ళెవ రైనా ఈ జనసమూహంలో ఉండి తనకు ఆపద కలి గిస్తారేమోనన్న భయం అంకురించింది. క్షణాల్లో అది పదింతలైంది. వందరెట్లకు చేరింది. అదుపు తప్పిన రక్తప్రసరణ రూపంలో ఆ భయం బయ టకు తన్నుకొచ్చింది.

పట్టాలమీద దూసుకుపోయే రైలుబండిలా నరాల్లో పరిగెడుతున్న రక్తప్రసరణ మీద ఒత్తిడి పెరిగింది. మెదడులోని రక్తనాళాలు పోటుకి గురయ్యాయి. కుడి కాలూ, కుడి చెయ్యీ మెలితిరిగి పోతూ, స్వాధీనాన్ని కోల్పోతుంటే వీర్రాజు నేల కొరిగిపోయాడు.

పక్షవాతానికి గురైన వీర్రాజుని మోసు కుంటూ పక్కకి తీసుకుపోయారు అతని కుటుంబ సభ్యులూ, అనుచరులూ.

తమ మనసుల్లో కొలువైన స్వామి నిజరూపాన్ని కనులారా వీక్షించాలనే ఆతురతతో ఎదు రుగా పరుగులు పెడుతూ వస్తున్న జనసందోహాన్ని చూస్తూ నిశ్చేష్టులై నిలుచుండిపోయారు పూర్ణ కుంభసహితంగా ఉన్న అర్చక బృందం. క్షణాల్లో సమీపానికొచ్చిన జనాన్నుంచి తప్పించుకునే ఉద్దేశంతో వెనుదిరిగి వాళ్ళు పరుగులు తీస్తుం టే, సామాన్య భక్తుడికి పూర్ణకుంభ స్వాగతం పలుకుతున్నట్లుగా రమణీయ దృశ్యం ఆవిష్కృ తమయింది.

•••

కంపార్ట్‌మెంట్ గోడపై ఉన్న స్వామి చిత్తరువులో చిద్విలాసం చెరిగిపోకుండా కనపడుతూనే ఉంది సామంతుకి.

సెల్:98481 10790

## ప్రతికూలం



ఒక్కోరాత్రి
తలుపులన్నీ మూసేసి
నిద్రకు ప్రవేశాన్ని నిషేధిస్తుంది
నీరవ ప్రశాంతత నిశీధి అంతా అలుముకున్నా
నిద్రరాని హృదయం
కల్లోల సాగరమై కలతబారుతుంది.

ఒక దిగులు, ఒక నిట్టూర్పు, ఒక క్రుంగుబాటు
చాలు
జీవితం మూడు కాలాల్నీ
ముద్దచేసి అగాధంలో పడెయ్యడానికి.
ప్రతి మలుపులో ఎదురయ్యేది ప్రతికూలతే.
స్వప్నించిన స్వర్గసీమలు స్వాగతించవు
ప్రవాహ దిశలోనే పడవ సాగుతానంటే ఎలా?
ఎదురీత నేర్చుకోవాలి
గాలివాలులోనే ఎగురుతానంటే సాగదు
ఎదురుగాలిని చీల్చుకొని పోవాలి
సుడిగాలిని పిడికిట బంధించుకోవాలి.
ప్రకృతిలో ప్రతిదీ
వర్తమానాన్ని ఆస్వాదిస్తూ జీవిస్తుంది,
ఒక్క మనిషి తప్ప!
వెన్నెల తళతళల అలల హార్మోనియం మీటుతూ
నిండుగా కదలాడే చెరువు
రాబోయే మండువేసవిని గూర్చి దిగులుపడదు.
పత్రహరితంతో పరిఢవిల్లే చెట్టు
ఆగామి ఋతువుల్లో మోడువారాలని కలత
చెందదు.
ఆఖరి కళను కూడా అమావాస్య ఆర్పి వేస్తుందని
పున్నమినాడు చందమామ పుట్టెడు దుఃఖంలో
మునగదు.
ప్రతికూలించిన రాత్రుల్లో పరచుకునే కాన్వాసుపై
నక్షత్రాల ముగ్గులు చిత్రించుకున్నప్పుడే
మనిషి కూడా ప్రకృతిలో నిజమైన భాగస్వామి
అవుతాడు.
నాది ఒకటేమాట-
నిద్రరాని రాత్రుల్లోనే
నిబ్బరమైన కవిత్వం పండించాలి.

-డా. వై.రామకృష్ణారావు,
వాట్సప్: 89857 43964




**హనుమ భుజాన్ని అధిరోహించి రావణునితో యుద్ధానికి తలపడ్డాడు రాముడు. అతని శరాఘాతాలకు రావణుని గుర్రాలు నేలకూలాయి. సారథి మరణించాడు. రథం ముక్కలు చెక్కలై ముగిసిపోయింది. కిరీటం ఎగిరి కిందపడి, నెత్తుటిబురదలో కూరుకుపోయింది. చూసి, చేష్టలుడిగిపోయాడు రావణుడు. రాముణ్ణి చూడలేక చూడలేక కళ్ళెత్తి చూశాడు. అలా చూసిన రావణుణ్ణి హెచ్చరించాడిలా రాముడు. ఈనాటికి నాతో నీ యుద్ధం చాలు! వెళ్ళి అలసట తీర్చుకో! రేపు రథికుడవై యుద్ధానికి రా! మళ్ళీ నా పౌరుష ప్రతాపాలు చూద్దూగాని అన్నాడు. ఆ మాటలు తట్టుకోలేకపోయాడు రావణుడు. పెద్దగా రోదించాడు. యుద్ధభూమి నుంచి నిష్క్రమించాడు.**

# నిద్రలేచిన కుంభకర్ణుడు:క్రుద్ధుడైన రావణుడు

అడుగులో అడుగు వేసుకుని లంకకు చేరుకున్నాడు. మంత్రాలోచనా మందిరంలోనికి ప్రవేశించాడు. సింహాసనాన్ని సమీపించాడు. కూలబడ్డాడందులో. తలపట్టుకుని కళ్ళు మూసుకున్నాడు. ఆలోచించసాగాడు రావణుడు.

అజేయుడన్న తన బిరుదు అణగారిపోయింది. గర్వం అంతా చిత్తు చిత్తు అయిపోయింది. సింహం లాంటి రాముడికి మదగజంలా దొరికిపోయాడు తను. గాయపడ్డాడు. ఔదార్యంతో రాముడు వదలివేశాడు కాబట్టి సరిపోయింది. బతికిపోయాడు. లేకపోయి ఉంటే?! ఛీ అనుకున్నాడు రావణుడు. తనని తాను అసహ్యించుకున్నాడు. గట్టిగా నిట్టూర్చి, లేచి నిలబడ్డాడు. సింహాసనానికి తలకొట్టుకున్నాడు. బ్రహ్మదండాన్నీ, మెరుపుల్నీ మరపించే రామబాణాలను గుర్తు చేసుకున్నాడు. వణికిపోయాడు.

రాజు మంత్రాలోచనా మందిరంలో ఉన్నాడంటే రమ్మని పిలుపు ఇచ్చినట్టే అనుకున్నారు మంత్రులంతా. మందిరానికి చేరుకున్నారు. ఎవరి ఆసనాల్లో వారు కూర్చున్నారు. వణికిపోతున్న రావణుణ్ణి చూశారు. ఆశ్చర్యపోతూ ఒకరిని ఒకరు చూసుకున్నారు. అలా ఒకరిని ఒకరు మౌనంగా చూసుకుంటున్న మంత్రుల్ని చూసి అన్నాడిలా రావణుడు.

"ఎంతటి విపదపకాలం? నా మహాద్భుత తపస్సంతా ఏమైపోయింది? ఇంద్రుణ్ణే ఓడించిన నేను, ఓ మానవుని చేతిలో ఈరోజు ఓడిపోయానంటే... ఇంతకంటే విపరీతం ఇంకొకటి లేదు. తప్పు చేశాను. ఆనాడు బ్రహ్మదేవుని వరాలు పొందినప్పుడు నరులవల్లా, వానరులవల్లా నాకు ప్రమాదం లేదని వారిని తృణీకరించాను. మానవుల వల్లే నీకు ముప్పు ఉన్నదన్నాడు బ్రహ్మ. పట్టించుకోలేదానాడు. ఈనాడు అది నిజమైంది."

"అవును ప్రభూ" అన్నారు ముక్తకంఠంతో మంత్రులంతా.

"చేసిన తప్పులే కాదు, పొందిన శాపాలన్నీ గుర్తుకొస్తున్నాయి ఇప్పుడు. చాలా కాలం కిందట, అయోధ్యాధీశుడు అనరణ్యుడు యజ్ఞదీక్షలో ఉంటే... అతన్ని యుద్ధానికి ఆహ్వానించాను. యుద్ధంలో గాయపడి, కూలిపోయాడతను. కూలిపోతే హేళన చేసి అవమానించానతన్ని. అప్పుడు అతను నన్నిలా శపించాడు.

'రాక్షసాధమా! నన్ను కూల్చావని తుళ్ళిపడకు! కాలం ఎప్పుడూ ఒక్కరికే కలిసిరాదు. రోజులు గడవనీ! కొంతకాలానికి నా వంశంలోనే ఓ మహాత్ముడు జన్మిస్తాడు. ఆ మహాత్ముడు నిన్నూ, నీ బంధుమిత్రులనూ నాశనం చేస్తాడు.' అన్నాడు. అది నిజమవుతోందిప్పుడు. ఆ మహాత్ముడు రాముడేనా?" తనని తను ప్రశ్నించుకుంటూ, మంత్రుల్ని కూడా ప్రశ్నించాడు రావణుడు. సమాధానం లేదు. నోట మాటలేక కూర్చున్నారు మంత్రులంతా.

"మరో శాపం! తపస్విని వేదవతిని బలాత్కరించబోయాను. ఆమె నా నుండి తప్పించుకుంది. తప్పించుకుని శపించిందిలా.

'నీచుడా! నేను అయోనిజనై జన్మించి, నిన్నూ, నీ బలగాన్నీ నాశనం చేస్తానన్నది. ప్రాణత్యాగం చేసింది. ఆ వేదవతే ఇప్పుడు ఈ సీతగా జన్మించిందా?" అనుమానించాడు రావణుడు.

అనుమానించదగ్గదన్నట్టుగా కుడిచేతి చూపుడు వేలెత్తి ఆడిస్తూ, మంత్రులంతా తలలూపారు.

"ఇంకొక శాపం గుర్తుకు వస్తున్నది. మహావిక్రమశాలినని గర్విస్తూ పార్వతీపరమేశ్వరుల నివాసం, కైలాసగిరిని అరచేత్తో ఎత్తి గడగడలాడించినప్పుడు పరమేశ్వరి నన్ను శపించింది. ఆమె శాపాన్ని హరాయించుకున్నా, నేను శాపగ్రస్తుణ్ణయ్యానని నవ్వుతున్న నందిని క్షమించలేకపోయాను. అతని వికృతాకారాన్ని గేలి చేశాను. అప్పుడతను శపించాడిలా.

'ఓరీ రావణా! నా వికృతాకారాన్ని గేలి చేశావు కదా! ఇలాంటి వికృతాకారులైన వానరులే గోళ్ళూ, దంతాలే ఆయుధాలుగా నిన్నూ, నీ బలగాన్నీ నాశనం చేస్తారు.' అన్నాడు. నిజమైందది. ఇప్పుడు మనం అంతా ఆ వానరులతోనే పోరాడుతున్నాం. మహాత్ముల శాపాలన్నీ ఫలిస్తున్నాయి." అన్నాడు రావణుడు.

అవునవును అన్నట్టుగా తలలాడించారు మంత్రులు.

ఏం చెయ్యాలో పాలుపోక, సింహాసనం మీద కాక, సింహాసనాన్ని ఆనుకుని, కింద కూర్చున్నాడు రావణుడు. కళ్ళు మూసుకున్నాడు. అప్పుడతనికి కుంభకర్ణుడు కనిపించాడు. మహావీరుడు కుంభకర్ణుడు యుద్ధం చేస్తే గెలుపు తనదే అనుకున్నాడు రావణుడు. ఆశలు చిగురించాయి.

శాపాలు ఫలించనీ, శత్రువులు విజృంభించనీ, వెనక్కి తగ్గేది లేదనుకున్నాడిక. కళ్ళు తెరచి చూశాడు. దిగ్గున లేచి నిల్చున్నాడు. ఆజ్ఞాపించాడిలా.

"మంత్రులారా! ప్రాకారాలపై సైనికులగస్తీ ముమ్మరం చెయ్యండి. అలాగే దుర్గద్వారాలన్నిటినీ జాగ్రత్తగా కాపాడండి. వాటికి ముందు నా తమ్ముణ్ణి, మహావీరుడు కుంభకర్ణుణ్ణి నిద్రలేపండి."

"అసాధ్యం మహారాజా! కుంభకర్ణుడు గాఢనిద్రలో ఉన్నాడు." చెప్పారెవరో.

"గాఢనిద్రలో ఉండే అవకాశమే లేదు. అతను పడుకుని తొమ్మిదిరోజులే కదా అయింది. ఏం పర్వాలేదు. వెళ్ళి లేపండి. కుంభకర్ణుడే ఈ నరవానరుల్ని మట్టుబెట్టగలడు. వెళ్ళండి." అన్నాడు రావణుడు.

మంత్రులంతా మూకుమ్మడిగా అక్కణ్ణుంచి నిష్క్రమించారు.

నిద్ర లేస్తూనే కుంభకర్ణుడు ఆకలి అంటూ అలమటించిపోతాడు. ఆహారం కోసం వెర్రెత్తిపోతాడు. అందుకని రాసులుగా ఆహారభక్ష్యాలూ, మాంసాలూ, కుండలతో మద్యం, జలాలూ సిద్ధం చేశారు. వాటన్నిటినీ కుంభకర్ణుని మందిరానికి తరలించి, మంత్రులు కూడా చేరుకున్నారక్కడికి. స్పృహలేకుండా కొండలా నిద్రపోతున్న కుంభకర్ణుని చూశారు. లేపేందుకు అతనికి ముందుగా చందనాలు పూశారు. ధూపాలు వేశారు. స్తోత్రపాఠాలు వినిపించారు. సింహనాదాలు చేశారు. ఫలితం లేకపోయింది. కుంభకర్ణుడు మేలుకోలేదు. అప్పుడు కట్టెలూ, గదలతో అతన్ని మోదారు. శూలాలతో పొడిచారు. భేరీలు మోగించారు. చెవుల్లో నీరుపోశారు. ఆపై చెవులూ,

**మంత్రాలోచనా మందిరంలో వణికిపోతూ కూర్చున్న రావణుణ్ణి చూసి ఆశ్చర్యపోయారు మంత్రులు. చేసిన తప్పులూ, పొందిన శాపాలూ అతడికి గుర్తుకురాసాగాయి. అవన్నీ గుర్తుచేసుకుని మంత్రులకు చెప్పి వాపోయాడు రావణుడు. ఏం చెయ్యాలో తెలియక సింహాసనం దిగి దాన్ని ఆనుకుని నేలమీద కూర్చుని కళ్ళుమూసుకున్నాడు. మూసుకున్న కళ్ళల్లో అతడికెవరు కనిపించారు? కళ్ళు తెరచి దిగ్గున లేచికూర్చున్న రావణుడు ఏమన్నాడు?**

తలవెంట్రుకలూ గట్టిగా పీకిపెట్టారు. ఇంకా అనేక విధాల బాధించారు. అలా బాధిస్తే అప్పుడు మాగన్నుగా మేల్కొన్నాడు కుంభకర్ణుడు. ఒడలు విదిల్చి, చేతులు జాడించాడు. లేచి కూర్చున్నాడు. పూర్తిగా కళ్ళు విప్పి చూశాడు. ఎదురుగా ఇష్టమైన ఆహార పదార్థాలు కనిపించాయి. ఆనందించాడు. అందుకున్నాడు వాటిని. ఆరగించి బ్రేవ్‌న తేన్చాడు. తేన్చి, తనకి చేతులు జోడించి నమస్కరించి నిల్చున్న మంత్రులను చూశాడు.

"చెప్పండి! నన్ను ఎందుకు నిద్ర లేపారు?" అడిగాడు.

విషయం ఎలా మొదలు పెట్టాలి. ఎలా చెప్పాలన్నది అంతుచిక్కక నేల చూపులు చూడ సాగారు మంత్రులు.

"ఏదేని ప్రమాదపరిస్థితి ఏర్పడితేనే తప్ప, మా అన్న రావణుడు నన్ను నిద్ర లేపమనడు. ఏమిటి ఆ ప్రమాదపరిస్థితి?" అడిగాడు కుంభకర్ణుడు.

"అది...అది..." అని నీళ్ళు నములుతున్న మంత్రులని చూసి, అనుమానంగా మళ్ళీ అడిగాడిలా.

"మా అన్న రావణుడు క్షేమమే కదా?"

"వారు క్షేమమే" అన్నాడు ధైర్యం చేసి ఓ మంత్రి. అతని పేరు యూపాక్షుడు.

"ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థం కావట్లేదు ప్రభూ! లంకానగరం మొత్తం ప్రమాదంలో చిక్కుకుంది. సీతాదేవిని విడిపించేందుకు ఆమె భర్త రాముడు, ఆపార వానరసేనావాహినితో నగరం మీదికి దండెత్తి వచ్చాడు. నగరాన్ని దిగ్బంధం చేశాడు. చాలా సైన్యాన్నీ, ఎందరో రాక్షస వీరుల్నీ మనం కోల్పోయాం." చెప్పాడు యూపాక్షుడు.

కళ్ళు పెద్దవి చేసి ఆశ్చర్యపోయాడు కుంభకర్ణుడు.

"నిన్నటిరోజు మహారాజు రావణుడే యుద్ధానికి వెళ్ళి, ఆ రాముడి చేతిలో చిత్తుచిత్తుగా ఓడిపోయారు. అదృష్టవశాత్తూ ప్రాణాలతో బయటపడ్డారు. ఇక ఈ యుద్ధంలో గెలవాలంటే మీరే దిక్కు. అందుకే మిమ్మల్ని నిద్ర లేపాం." అన్నాడు యూపాక్షుడు.

అన్న రావణుడు, రాముడి చేతిలో ఓడిపోయాడనగానే తట్టుకోలేకపోయాడు కుంభకర్ణుడు. చేతిలో ఉన్న బిందెలాంటి మద్యంపాత్రని ఆవేశంగా విసిరి లేచి నిలబడ్డాడు.

"రాముడు అంతు చూస్తాను." అన్నాడు. అటు నుంచి అటే రణరంగానికి బయల్దేరాడు. రెండు అడుగులు వేశాడో లేదో మంత్రులు వారించడంతో ఆగిపోయాడతను.

"ముందుగా మహారాజుని దర్శించడం మర్యాద. ఆపైన వారి సలహా స్వీకరించడం సముచితం." అన్నారు మంత్రులు. వారి మాట కాదనలేకపోయాడు కుంభకర్ణుడు. సరేనన్నాడు. స్నానం చేశాడు. చూడముచ్చటైన వస్త్రాభరణాలు ధరించాడు. మళ్ళీ మరింతగా ఆహార పానీయాలు స్వీకరించి, మంత్రులసహా కొలువుకి బయల్దేరాడు.

రాచబాటలో నడచి వస్తున్న కుంభకర్ణుణ్ణి, ఆ బాటకు ఇరువైపులా నిల్చుని ఉన్న పౌరులు చూసి, హర్షాతిరేకంతో కేకలు వేశారు. జయజయధ్వానాలు చేశారు. అతనికి చేతులు జోడించి నమస్కరించి, అతనిపై పుష్పవర్షం కురిపించారు. అందరి ఆనందాలనూ, అభినందనలనూ స్వీకరించి, మంత్రుల సహా కుంభకర్ణుడు మంత్రాలోచనామందిరానికి చేరుకున్నాడు. సింహాసనంపై తలపట్టుకుని కూర్చున్న అన్న రావణుణ్ణి చూశాడు. వెళ్ళి అతని పాదాలపై తలాన్చి, నమస్కరించాడు.



వచ్చింది కుంభకర్ణుడు. జయం చేకూర్చగల వీరుడు. గుండెలకు హత్తుకుని అభినందించాలనుకున్నాడు రావణుడు. రెండు చేతులా పట్టి తమ్ముణ్ణి లేవనెత్తాడు. గట్టిగా కౌగిలించుకున్నాడు. కూర్చోమని సముచితాసనాన్ని చూపించాడతనికి. కూర్చున్నాడు కుంభకర్ణుడు.

"అన్నా! చెప్పు, ఎవరిని చంపాలి?" అడిగాడు.

"ఎవరిని చంపాలి అంటే ఏం చెప్పమంటావు? నువ్వు నిద్రపోయావు. నీకేమీ తెలీదు. నేనెన్ని బాధలు పడుతున్నానో...ఆ పరమేశ్వరునికే ఎరుక." అన్నాడు రావణుడు. జాలిగా చూశాడతన్ని కుంభకర్ణుడు.

"క్షత్రియుడు రాముడు, వానరరాజు సుగ్రీవుడూ ఇద్దరూ స్నేహితులయ్యారు. సాగరంపై సేతువు నిర్మించారు. ఆపారసేనావాహినితో తరలి వచ్చి మన రాక్షస జాతిని మట్టుబెడుతున్నారు." అన్నాడు రావణుడు.

ఆశ్చర్యపోయాడు కుంభకర్ణుడు.

"యుద్ధానికి వెళ్ళిన మహావీరులెవరూ తిరిగి రాలేదు. అంతా చనిపోయారు. మూడువంతుల సైన్యాన్ని మనం నష్టపోయాం. నగరంలో స్త్రీ బాల వృద్ధులు తప్ప ఎవరూ లేరు. ఏం చెయ్యాలో అంతుబట్టని స్థితి. అప్పుడు నువ్వు గుర్తొచ్చావు. నువ్వు తప్ప ఈ పరిస్థితిని చక్కబెట్టే నాథుడు లేడు. అందుకే నిన్ను నిద్ర లేపాం." అన్నాడు రావణుడు.

భయం, బాధ, వణకుతో మాట్లాడుతున్న మహారాజుని చూసి ఆక్రోశించాడు కుంభకర్ణుడు. నిద్రించక ముందు సభలోని చర్చలూ, విభీషణుని సలహా గుర్తొచ్చాయి అతనికి. రావణునికి నచ్చజెప్పే ధోరణిలో అన్నాడిలా.

"అన్నా! గుర్తుందా? ఒకనాడు ఇదే మందిరంలో తమ్ముడు విభీషణుడు చెప్పిందే ఇప్పుడు జరుగుతోంది. ఆనాడు అతని మాటలు నువ్వు విని ఉంటే ఇప్పుడీ అనర్థాలు జరిగేవి కావు. నువ్వు బాధపడనంటే ఒక మాట అంటాను, సీతను అపహరించినప్పుడు నువ్వు ఎవరిని సంప్రదించావు? సంప్రదించలేదు సరికదా, అదో పెద్ద విజయంగా భావించి, అందరికీ చెప్పుకొచ్చావు. అది నీకు తగునా?"

ఊహించని వ్యతిరేకత. కుంభకర్ణుణ్ణి వింతగా చూశాడు రావణుడు.

"ఏ రాజు అయితే నీతియుక్తంగా, దేశ కాలానుగుణంగా విచారణ జరిపి నిర్ణయాలు తీసుకుంటాడో ఆ రాజే విజయుడై వర్ధిల్లుతాడు. అందుకు విరుద్ధంగా ప్రవర్తించే రాజు, ఓటమినే చవి చూస్తాడు. ఇందులో అనుమానం లేదు. ఇప్పటికైనా మించిపోయింది లేదన్నా! విభీషణుడు చెప్పినట్టుగా చెయ్యి! సీతాదేవిని రామునికి అప్పగించు. అంతా శుభం జరుగుతుంది." అన్నాడు కుంభకర్ణుడు. ఆ మాటకి రావణుడు అయోమయంగా కుంభకర్ణుణ్ణి చూశాడు. ఏం జరిగింది? ఏం జరుగుతోంది? ఏం జరగబోతోంది? ఏదీ అర్థం కాక చేతిలోని గదను గిరగిరా తిప్పి, గాలిలోనికి విసిరాడు రావణుడు. అది మందిరం పైకప్పుకి తగిలి కిందపడింది. భూకంపం సృష్టించింది. ఆ కంపానికి మంత్రుల సహా కుంభకర్ణుడు కూడా వణకిపోయాడు.

**-అరణి**

# సౌభాగ్య చక్రం

ఆగస్టు 3 నుంచి
ఆగస్టు 9 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, వృత్తిపరమైన నిర్ణయాలు, ఆరోగ్య అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. 5,6 తేదీల్లో కృషి రంగంలో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రియతముల ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. 7,8,9 తేదీల్లో స్పెక్యులేషన్లు, పొదుపు పథకాలు లాభిస్తాయి. శ్రీవారు, శ్రీమతి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. వేడుకలు, బృంద కార్యక్రమాల్లో పాల్గొంటారు.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, గృహోపకరణాల సేకరణ, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారికి శుభప్రదం. ఇల్లు, కార్యాలయంలో మార్పులు, చేర్పుల కోసం ప్రయత్నిస్తారు. 5,6 తేదీల్లో విద్యాసంస్థల్లో ప్రవేశం లభిస్తుంది. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. వేడుకల కోసం ఖర్చులు అంచనాలు మించుతాయి. 7,8,9 తేదీల్లో రాతకోతలు, చర్చల్లో ఇబ్బందులు ఎదురవుతాయి. బదిలీలు, మార్పులు చేర్పులకు అనుకూలం. కుటుంబ సభ్యుల ఆరోగ్యం మెరుగుపడుతుంది.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, వృత్తిపరమైన సమావేశాలు, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. విద్యార్థులకు శుభప్రదం. 5,6 తేదీల్లో స్థిర చరాస్తులకు సంబంధించిన చర్చలు ఫలిస్తాయి. ఇంటి కోసం అవసరమైన వస్తువులు సమకూర్చుకుంటారు. సోదరీసోదరుల వైఖరిలో మార్పు గమనిస్తారు. 7,8,9 తేదీల్లో విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ఒక శుభవార్త అందుకుంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, ఇంక్రిమెంట్లు, విద్యా విషయాలు, స్థిరచరాస్తి విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడులు లాభిస్తాయి. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 5,6 తేదీల్లో చెక్కులు అందుకుంటారు. బిల్లులు, ఫీజులు చెల్లిస్తారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల నుంచి మొహమాటం ఎదురవ్వొచ్చే అవకాశం ఉంది. 7,8,9 తేదీల్లో ఆర్థిక విషయాల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ఇంటి అవసరాల కోసం నిధులు సర్దుబాటవుతాయి. రుణాలు మంజూరవుతాయి.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

కొత్త ప్రాజెక్టులు, పెట్టుబడులు, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో కొత్త పనులు ప్రారంభిస్తారు. మీ మనసు మార్పు కోరుకుంటుంది. అదనపు సౌకర్యాలు సమకూర్చుకుంటారు. 5,6 తేదీల్లో పెట్టుబడులు, అదనపు ఆదాయంపై దృష్టి సారిస్తారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ఖర్చులు అధికం. 7,8,9 తేదీల్లో మార్కెటింగ్, రవాణా, స్టేషనరీ, ఏజెన్సీలు, బోధన, రవాణా రంగాల వారికి శుభప్రదం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, సమీక్షలు, ప్రయాణాలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సినిమా, రాజకీయాలు, ఫోటోగ్రఫీ, గ్రాఫిక్స్, ఆధ్యాత్మిక రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. 5,6 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారు కొత్త పనులకు శ్రీకారం చుడతారు. పైచదువుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఏదో తెలియని అశాంతి వెంటాడుతుంది. 7,8,9 తేదీల్లో ఆర్థిక విషయాలు ప్రోత్సాహకరం. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అవసరమైన నిధులు సమకూరతాయి.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వేడుకలు, విద్యా విషయాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బృందకార్యక్రమాలు, వేడుకలు ఉల్లాసం కలిగిస్తాయి. సహకార సంఘాలు, యూనియన్ కార్యకలాపాల్లో విజయం సాధిస్తారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 5,6 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. కొత్త పరిచయాలు లాభిస్తాయి. బంధుమిత్రుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 7,8,9 తేదీల్లో సమావేశాల్లో మాట పడాల్సి రావచ్చు. పెట్టుబడులకు సంబంధించి కీలక నిర్ణయాలు తీసుకుంటారు. వేడుకల్లో ఉల్లాసంగా పాల్గొంటారు.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

కీలక నిర్ణయాలు, ఇంక్రిమెంట్లు, వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో ఉన్నత పదవులు అందుకుంటారు. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. పెద్దలు, ప్రముఖులను కలుసుకుంటారు. 5,6 తేదీల్లో సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. ఆర్థిక విషయాల్లో పెద్దల సహకారం అందుకుంటారు. ఖర్చులు అధికం. 7,8,9 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో శుభప్రదం. రాజకీయ, సినీరంగాల వారు ఉన్నత పదవులు అందుకుంటారు. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, దూరప్రయాణాలు, వృత్తి, వ్యాపారాలు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురువారాల్లో సంకల్పం నెరవేరుతుంది. న్యాయ, బోధన, రవాణా రంగాల వారికి శుభప్రదం. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 5,6 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో పట్టుదలతో వ్యవహరించి అనుకున్నది సాధిస్తారు. ప్రముఖులను కలుసుకుంటారు. సంకల్పం నెరవేరుతుంది. 7,8,9 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు ఫలిస్తాయి. సమావేశాలు లాభిస్తాయి. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

పెద్దల ఆరోగ్యం, ఆర్థిక సంస్థలతో పనులు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో రుణప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. పెట్టుబడులు సమీక్షించుకుంటారు. 5,6 తేదీల్లో ఆర్థికపరమైన సమావేశాలు, ప్రయాణాలకు అనుకూలం. పెట్టుబడుల విషయంలో అంచనాలు తప్పే అవకాశం ఉంది. 7,8,9 తేదీల్లో వయోధికుల ఆరోగ్యం మెరుగుపడుతుంది. పెద్దల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. మెడికల్ బెనిఫిట్స్, బీమా, గ్రాట్యుటీ పనులకు అనుకూలం.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, శుభకార్యాలు, సినీ, రాజకీయ విషయాలు, ఆరోగ్య అంశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. 5,6 తేదీల్లో స్పెక్యులేషన్లు, పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఖర్చులు అధికం. 7,8,9 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. న్యాయ, రవాణా, బోధనా రంగాల వారికి ప్రోత్సాహకరం. సమావేశాలు లాభిస్తాయి.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, స్పెక్యులేషన్లు, వేడుకలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వైద్యం, హోటల్, వ్యవసాయం, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. 5,6 తేదీల్లో భాగస్వామి సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. కార్యాలయంలో కొత్త పరిచయాలు ఏర్పడతాయి. సన్నిహితుల ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. 7,8,9 తేదీల్లో సహోద్యోగుల అంతరంగిక విషయాలపై దృష్టి పెడతారు. మెడికల్ క్లెయిములు మంజూరవుతాయి. బీమా, పెన్షన్ వ్యవహారాలు ఒక కొలిక్కి వస్తాయి.

# నవ్య సినిమా

## టర్న్ తీసుకున్న టబూ



ఒకప్పటి హీరోయిన్లు అమ్మ, అక్క, వదిన, అత్త క్యారెక్టర్లలో దూసుకుపోతుంటే టబూ మాత్రం పై పాత్రలకు దూరంగా ఉండిపోయింది. హీరోయిన్‌గా చేయడానికి టబూ రెడీగా ఉన్నా ఆమెతో చేయడానికి దర్శకనిర్మాతలు సాహసించడం లేదు. దాంతో కొంత కాలంగా ఖాళీగా ఉన్న టబూ తను కూడా తోటివారి దారిలో నడవడానికి డిసైడ్ అయిపోయిందట! టబూ డిసైడ్ అయ్యిందో లేదో అనుష్క తల్లి పాత్ర ఆమెను వెతుక్కుంటూ వచ్చిందట! అనుష్క నటిస్తున్న 'భాగమతి' సినిమాలో అనుష్క తల్లిగా టబూ చేయబోతోందట! ముందు ఈ పాత్రకు నదియాను అనుకున్నా, ఆ తరువాత మనసు మార్చుకుని ఆ అవ కాశాన్ని టబూకి ఇచ్చారట ఆ సినిమా దర్శక నిర్మాతలు.

## 'నాయుడి'కి సినిమా కష్టాలు

కమల్‌హాసన్ ఏ ముహూర్తాన 'శభాష్ నాయుడు' సినిమా ప్రారంభించాడో కానీ అప్పటి నుంచీ ఆ సినిమాకు కష్టాలు మొదలయ్యాయి. ప్రారంభంలో దర్శకుడు అనారోగ్యంతో ఈ ప్రాజెక్టు నుంచి తప్పుకోవడంతో కమల్ స్వయంగా దర్శకత్వ బాధ్యతలు చేపట్టాడు. ఇప్పుడు సినిమాటోగ్రాఫర్ పనితీరు కమల్‌కి నచ్చడం లేదట! ఆయన స్థానంలో వేరే వ్యక్తిని తీసుకోవాలన్న ఆలోచనలో ఉన్నాడట! సినిమాలో కమెడియన్ పట్ల కూడా కమల్ అసంతృప్తిగా ఉన్నాడంటున్నారు. మొత్తానికి 'శభాష్ నాయుడు' సినిమా కష్టాలతో విలవిల్లాడుతోందట!



## శంకర్ ఏం చేస్తాడో?

ఎన్నో భారీ అంచనాల మధ్య విడుదలైన 'కబాలి' రజనీ అభిమానులకు కొంత నిరాశను కలిగించిందనే చెప్పాలి. ఇప్పుడు ఆయన అభిమానుల కళ్ళన్నీ శంకర్ దర్శకత్వం వహిస్తున్న 'రోబో2' మీదే ఉన్నాయి. శంకర్ అన్నా ఈ సారి సూపర్ స్టార్ అనుకున్న స్థాయిలో సక్సెస్‌ని ఇస్తాడా? లేదా? అన్న టెన్షన్ అభిమానులను పట్టుకుందట! గతంలో రజనీ, శంకర్ కాంబినేషన్‌లో వచ్చిన 'శివాజీ', 'రోబో'లు సూపర్ డూపర్ సక్సెస్ అయ్యాయి. ఇప్పుడు కూడా అదే రిపీట్ అయ్యేలా చూడమని రజనీ అభిమానులు ఆ భగవంతుడిని ఇప్పటి నుంచే ప్రార్థిస్తున్నారట!





## జాకీచాన్‌కు 'బాహుబలి' కష్టాలు

'బాహుబలి' రికార్డుల మోత అప్రతిహతంగా సాగిపోతూనే ఉంది. ఇప్పటి వరకూ అంతర్జాతీయ నటులెవ్వరూ 'బాహుబలి'ని చూసి భయపడలేదు కానీ, జాకీచాన్ మాత్రం ఈ సినిమాకి ఇస్తున్న రేటింగ్ చూసి తెగ టెన్షన్ పడుతున్నాడట! జాకీచాన్ సినిమా కన్నా 'బాహుబలి'కి ఎక్కువ క్రేజ్ రావడమే ఈ టెన్షన్‌కు కారణమట! ఈ సినిమాకు ప్రారంభంలో '7' రేటింగ్ ఇచ్చినా, ఇప్పుడు '7.7' రేటింగ్ ఇచ్చారట! ఈ సినిమాకు దక్కిన, దక్కుతున్న ఆదరణ చూసి అమెరికాకు చెందిన ఓ కొత్త డిస్ట్రిబ్యూటర్ 'బాహుబలి 2' వెర్షన్ రైట్స్‌ను 37 కోట్లకు కొనుగోలు చేశాడని అంటున్నారు.

## బుల్లితెరపై దేవిశ్రీ

తెర వెనుకా, ఆడియో ఫంక్షన్లలోనూ తెగ సందడి చేసే దేవిశ్రీ త్వరలో బుల్లితెరమీద కూడా దర్శనమివ్వబోతున్నాడు. గత కొన్ని రోజులుగా దేవిశ్రీ హీరోగా సినిమా చేస్తాడని ఆశిస్తున్న ఆయన అభిమానులను ఈ వార్త కొద్దిగా నిరాశ పరిచినా, బుల్లితెర మీద దేవిశ్రీని చూడవచ్చన్న ఆనందంలో ఉన్నారట! త్వరలో ఓ తెలుగు ఛానల్‌లో దేవిశ్రీ ఓ సంగీత కార్యక్రమం చేయబోతున్నాడట! దేవిశ్రీ స్వయంగా ట్విటర్ ద్వారా తన అభిమానులకు ఈ విషయాన్ని తెలియజేశాడు. దేవిశ్రీ సంగీత కార్యక్రమం ఓ రేంజ్‌లో ఉండబోతోందనేది తాజా సమాచారం! అడపా తడపా జరిగే సినిమా ఫంక్షన్లలో మాత్రమే కనిపించే దేవిశ్రీ ఇక నుంచి బుల్లితెర మీద దర్శనమివ్వబోతున్నాడనే వార్త ఆయన అభిమానులకు ఫుల్ జోష్‌నిచ్చిందని అంటున్నారు.



# మనసు అటు మళ్ళింది

## -తమన్నా

**తమన్నా అందంగా ఉంటుంది...మరింత అందంగా నవ్వుతుంది...చక్కగా డ్యాన్స్ చేస్తుంది.... ఇవన్నీ అందరికీ తెలిసిన విషయాలే! అయితే తెలియని విషయాలు చాలానే జరిగిపోతున్నాయి. మొన్నటి 'బాహుబలి' వరకూ తమన్నా గ్లామర్ హీరోయిన్ మాత్రమే! ఆ సినిమా తరువాత తమన్నా ఆలోచనల్లో మార్పు వచ్చింది. ఫలితం 'అభినేత్రి' సినిమా! హఠాత్తుగా ఆమె ఆలోచనల్లో మార్పు రావడానికి కారణం ఏమిటో ఆమె మాటల్లోనే....**

**ఉన్నట్టుండి హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమా చేయడానికి కారణం?**

'బాహుబలి' ముందు వరకూ గ్లామర్ పాత్రలే చేశాను. ఆ సినిమా తరువాత నా ఆలోచనల్లో మార్పు రావడం మొదలైంది. విభిన్న పాత్రలు చేస్తే ప్రేక్షకుల స్పందన ఎలా ఉంటుందో అర్థమైంది. అప్పటి నుంచే నా మనసు అటు మళ్ళింది. రొటీన్‌కి భిన్నంగా సినిమా చేయాలని నిర్ణయించుకున్న తరువాత వచ్చిన అవకాశం 'అభినేత్రి'. ఈ సినిమా మూడు భాషల్లో రూపొందుతోంది. ఇప్పటి వరకూ తమన్నాలోని గ్లామర్‌ని మాత్రమే చూశారు. ఇక నుంచి సినిమాల్లో తమన్నాలో నటిని చూస్తారు.



**ఇక నుంచి అలాంటి సినిమాలే చేస్తారా?**

అన్నీ అవే చేస్తే ప్రేక్షకులకే కాదు నాకూ బోరే! చేసే వాటిల్లోనే కొత్తదనం ఉండేలా చూసుకుంటాను. నటనకి అవకాశం ఉన్న సినిమాలే ఎక్కువ అంగీకరించాలని నిర్ణయించు కున్నాను.

**ప్రభుదేవాతో చేయడం ఎలా ఉంది?**

ఆయన మంచి డ్యాన్సర్ అన్న

విషయం తెలిసిందే! ఆయనలో నటుడి గురించి ఇప్పుడు తెలుసుకుంటున్నాను. డ్యాన్సుల విషయంలో ఆయనతో పోటీపడడం ఎవరికీ సాధ్యం కాదు. నేనైతే ఒకటికి పది సార్లు రిహార్సల్స్ చేసుకుని మరీ చేస్తున్నాను.

### హీరోయిన్‌గా చేస్తూ ఐటెంసాంగ్స్ చేయడానికి కారణం?

హీరోలతో ఉన్న మంచి రిలేషన్ షిప్పే దానికి కారణం. అయినా హీరోయిన్లు ఐటెంసాంగ్స్ చేయకూడదని ఎక్కడా లేదు కదా?

### డబ్బుల కోసమే ఐటెంసాంగ్స్ చేస్తున్నారన్నది నిజం కాదా?

నూటికి నూరు పాళ్ళు నిజం కాదు. ఈ రంగంలోకి వచ్చింది డబ్బు సంపాదించడానికే అయినా, డబ్బు కోసం ఐటెంసాంగ్స్ చేస్తున్నానన్నది మాత్రం అబద్ధం.

### ఖాళీ సమయంలో ఏం చేస్తారు?

ఖాళీ దొరికితే ఏదైనా చేయడం అన్నది అస్సలు ఇష్టం ఉండదు. గంటల తరబడి ఏ పనీ చేయకుండా కూర్చోవడం అంటే చాలా ఇష్టం. టీవి కూడా చూడను. ఎప్పుడైనా చూస్తే కామెడీ షోలే తప్ప, ఏడుపుగొట్టు సీరియల్స్ అంటే నాకు చిరాకు. చాలా వరకూ అలాంటి సీరియల్సే వస్తుంటాయి. అందుకే టీవి పెట్టడానికి జంకుతాను. నా పెంపుడు కుక్కతో ఆడుకుంటూంటే టైమే తెలియదు. ఈ మధ్యే కొత్తగా మరో అలవాటు అయింది. అదే సెల్ఫీ దిగడం. కొత్త ఫోన్ కొనుక్కున్నప్పటి నుంచీ సెల్ఫీలు దిగడం ఎక్కువైపోయింది. ఈ అలవాటు మంచిది కాదని తెలుసు కానీ, మానుకోవడమే కొద్దిగా కష్టంగా ఉంది.

### మీకు స్నేహితులు ఎక్కువే అంటారు నిజమేనా?

నేను ఎవరితోనైనా చాలా త్వరగా కలిసిపోతాను. అందుకే నాకు చాలామంది స్నేహితులుంటారు. నాతో ఫ్రెండ్‌షిప్ చేసేవారి ప్రతి ఒక్కరి ఫోన్ నెంబరూ నా దగ్గర ఉంటుంది. వీలున్నప్పుడల్లా వారికి ఫోన్ చేసి మాట్లాడుతుంటాను.

### వ్యాపారం ఎవరు చూసుకుంటున్నారు?

మా ఫ్యామిలీ మెంబర్స్ చూసుకుంటున్నారు. అప్పుడప్పుడు నేనూ చూసుకుంటూ ఉంటాను. ప్రస్తుతానికి చాలా బాగా నడుస్తోంది.

### మీరు బాగా ఇష్టపడేది?

చాలానే ఉన్నాయి. తమన్నా మంచి నటి అనిపించుకోవాలి. వెరైటీ రోల్స్ చేయాలి. దక్షిణాదిన టాప్ స్టార్‌గా పేరు తెచ్చుకోవాలి. ఇలా చాలా ఇష్టాలున్నాయి. వీటన్నిటి కన్నా ఉదయాన్నే అమ్మ ఇచ్చే వెజిటబుల్ జ్యూస్ అంటే చాలా ఇష్టం. చెప్పుకుంటూ పోతే లిస్టు పెద్దది అవుతుంది.

### ఇష్టపడనివి...

టీవీలో వచ్చే ఏడుపుగొట్టు సీరియల్స్. అలాంటి వాటిని ఎలా చూస్తున్నారో నాకు ఇప్పటికీ అర్థం కాదు. పరిసరాల పరిశుభ్రత విషయంలో నేను కచ్చితంగా ఉంటాను. ఒక్క పరిసరాలనే కాదు, నా చుట్టూ ఉండే వారు కూడా పరిశుభ్రంగా ఉండాలని కోరుకుంటాను. అపరిశుభ్రత ఎక్కడ ఉన్నా క్షణం కూడా అక్కడ ఉండలేను.

### సహజీవనం మీద మీ అభిప్రాయం..?

నాకు వివాహ వ్యవస్థ మీద పూర్తి నమ్మకం, గౌరవం ఉన్నాయి. సహజీవనం అనే పద్ధతి భారత దేశ పరిస్థితులకు సెట్ కాదన్నది నా అభిప్రాయం. నేను పెద్దలు కుదిర్చిన పెళ్ళే చేసుకుంటాను. అందుకే దీని మీద అవగాహన పెద్దగా లేదు. సంవత్సరాల తరబడి సహజీవనం చేసిన వాళ్ళు కూడా చివరకి పెళ్ళి చేసుకుంటున్నారు. అంటే మన వివాహ వ్యవస్థ పటిష్టమైనదనేగా?

### ఎప్పుడూ వెళ్ళే టూరిస్ట్ ప్లేస్ గురించి...

సినిమాల షూటింగ్ సందర్భంగా చాలా ప్రదేశాలు చూశాను. అన్ని ప్రాంతాల్లోకి దుబాయ్ నాకు బాగా నచ్చుతుంది. కొద్దిగా ఖాళీ దొరికినా, దుబాయ్‌కి వెళుతుంటాను. అక్కడికి వెడితే ఎందుకో మనసు చాలా ప్రశాంతంగా అనిపిస్తుంది. అక్కడి నుంచి తిరిగి వచ్చిన తరువాత రెట్టింపు ఉత్సాహంతో తిరిగి షూటింగ్‌లలో పాల్గొంటూ ఉంటాను. అక్కడ షాపింగ్ చేయడంలో కలిగే మజా నాకు ఎక్కడా దొరకదు. నా అదృష్టం కొద్దీ నా సినిమాల షూటింగ్‌లు ఏవీ అక్కడ ఇంత వరకూ జరగలేదు. దాంతో అక్కడి వారికి నా గురించి పెద్దగా తెలియదు. స్వేచ్ఛగా నా ఇష్టం వచ్చినట్టు తిరుగుతూ ఎంజాయ్ చేస్తాను. నేను ప్రకృతి ప్రేమికురాలిని. ఒంటరిగా ప్రకృతిని చూస్తూ ఎంత సేపన్నా ఉండిపోతాను.

### ఇన్ని సంవత్సరాల కెరీర్‌లో బాధపడిన సందర్భం?

ఏదీ లేదు. నేను కోరుకుని వచ్చిన రంగం ఇది. చిన్నతనం నుంచీ నటిని కావాలని ఉండేది. చిన్నతనంలో అయితే సినిమా చూసి వచ్చిన తరువాత ఇంట్లో అద్దం ముందు నిలబడి హీరోయిన్ ఎలా చేసిందో అలా చేస్తూ ఉండేదాన్ని. చదువుకోకుండా ఏమిటీ పిచ్చి వేషాలు అంటూ మా ఇంట్లో చివాట్లు పెట్టిన సందర్భాలున్నాయి కానీ, నటన మీద నా ఆసక్తి పెరిగిందే తప్ప తరగలేదు. అంత ఇష్టంగా వచ్చాను కాబట్టి బాధపడింది ఎప్పుడూ లేదు. కాకపోతే 'మిస్టర్ పర్‌ఫెక్ట్' సినిమాలో కాజల్ పాత్ర నాకు వచ్చి ఉంటే బాగుండేది అని ఇప్పటికీ అనుకుంటూ ఉంటాను.







### హీరోయిన్ల మధ్య పోటీ ఎక్కువైనట్టుంది?

ఎప్పటికప్పుడు కొత్త కొత్త అమ్మాయిలు వస్తూనే ఉంటారు. పోటీ అనుకుంటే ఎలా? ఎంతమంది వచ్చినా ఎవరి స్థానం వారిదే! మనం బాగా చేయకపోతే కొత్త పిల్లల దగ్గర చులకనైపోతాం అన్న ఫీలింగ్ వచ్చి బాగా కష్టపడి చేస్తుంటాను.

### పెళ్ళి ఎప్పుడు?

మొన్నామధ్య పెళ్ళి చేసేశారుగా? పెళ్ళెప్పుడు అని అడుగుతారేం? ఎలా వచ్చిందో ఎక్కడి నుంచి వచ్చిందో తెలియదు కానీ తమన్నా ఓ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌ని చేసుకోబోతోందన్న రూమర్ బాగా స్ప్రెడ్ అయింది. ఎన్నిసార్లు వివరణ ఇచ్చానో నాకే గుర్తు లేదు. నా పెళ్ళి సంగతి మా ఫ్యామిలీకి వదిలేశాను. వాళ్ళే చూసుకుంటారు. వాళ్ళు ఎప్పుడు చెబితే అప్పుడు నేనూ అందరికీ చెబుతాను.

-చిన్ని



# ఒక శృంగార దేవత పతనం!

**కొందరు స్త్రీలు శృంగార రసాధిదేవతలుగా ప్రపంచ చరిత్రలో మిగిలిపోతారు. అలా పండితుల నుండి పామరుల వరకు పురుష ప్రపంచంలో గొప్ప క్రేజ్ సృష్టించుకున్న హాలీవుడ్ నటి మార్లిన్ మన్రో. ఆమె నవ్వు, నడక, ఒయ్యారం, ఒంపుసొంపులు, మాటలు, చేతలు చెప్పాలంటే నఖశిఖ పర్యంతం ఆమె అందచందాలు జనాన్ని వెర్రెక్కించేవి. ఆమె మరణించి యాభై నాలుగేళ్ళు గడిచిపోయినప్పటికీ ఆమె జ్ఞాపకాలు శృంగార ప్రపంచాన్ని వదిలిపెట్టలేదు. అంతేకాదు, నేటికీ ఆమె సుమారు 36 కోట్ల రూపాయల మేరకు తన వారసులకు ఆర్జించిపెడుతోంది. అది సాధ్యమేనా? అంటే సాధ్యమేనని నిరూపించింది.**

ఒక సర్వే సంస్థ ప్రకారం, కీర్తిశేషులైన వారి జాబితాల్లో ఉన్న అగ్రశ్రేణి మహిళా ప్రముఖుల్లో మార్లిన్ మన్రో ఒకరు! ఇప్పుడు కూడా ఆమె ఉపయోగించిన వస్తువులు ఆక్షన్ హాలుకు వస్తే, లక్షలకు లక్షల డాలర్లు ఇచ్చి సొంతం చేసుకునే అభిమానులు కోకొల్లలు! ఇంతటి విశేష ప్రజాదరణ చూరగొన్న మార్లిన్ మన్రో అర్ధాంతరంగా తనువు చాలించింది! 36 యేళ్ళు మాత్రమే జీవించిన మార్లిన్‌మన్రో నిద్రమాత్రలు మింగి చనిపోయిందన్న వార్త ప్రేక్షక ప్రపంచాన్ని కల్లోలానికి గురిచేసింది. ఆ విషాద వార్త తట్టుకోలేక ప్రపంచవ్యాప్తంగా ఇరవైనాలుగు మంది యువకులు ఆత్మహత్య చేసుకున్నారంటే, ఆమె ప్రభావం ఎంతగా ఉందో అర్థమవుతుంది. ఆమె వివాదాస్పద సినీ జీవితంలో పలువురు ప్రముఖుల పాత్ర ఉంది. కొందరిని ఆమె వాడుకుని లాభాలు పొందడానికి ప్రయత్నించింది. కొందరు ఆమెను వాడుకుని లాభపడ్డారు. ఈ పద్మవ్యూహంలోంచి ఎలా బైటపడాలో ఆమెకు తెలియలేదు. ఆమెలోని ఆకర్షణ శక్తే ఆమెకు ప్లస్ పాయింట్! అదే ఆమెకు మైనస్ పాయింట్‌గా కూడా మారింది! అది ఆత్మహత్యా? లేక హత్యా? అన్నది ఇప్పటికీ మిస్టరీయే! అంతటి ప్రసిద్ధ తార అర్ధాంతరమరణం వెనుక కుట్రకోణం ఉందా? సన్నిహితులు పన్నిన కుట్రవల్ల ఆమె హతమైందా? అనే ప్రశ్నలకు నేటికీ సమాధానం లేదు.

**(ఆగస్టు 5 మార్లిన్ మన్రో సంస్మరణ సందర్భంగా)**

## పరాయి పంచన బాల్యం

మార్లిన్ అసలు పేరు నార్మాజీన్. 1926 జూన్ 1న పుట్టింది. తల్లి గ్లాడీ. కొలంబియా ఫిలిమ్ స్టూడియోలో ఫిలిమ్ కట్టర్‌గా పనిచేసేది. స్థిరంగా పనిచేయలేక ట్రీట్‌మెంట్ తీసుకునేది. గ్లాడీ తల్లి కూడా అంతే. అస్థిరమైన మానసిక స్థితి ఆ కుటుంబంలోనే పారంపర్యంగా వచ్చినట్టనిపిస్తుంది! మార్లిన్ బాల్యం వేదనాభరితంగా కొనసాగింది. లాస్‌ఏంజిల్స్ ఆర్ఫన్ హోమ్ సొసైటీ లాంటి శిశు కేంద్రాల్లో, బంధువులు, కుటుంబ శ్రేయోభిలాషుల దయాదాక్షిణ్యాలమీదా ఆధారపడి పెరిగింది మన్రో. తనను ఎవరూ ఆదరించరనే మానసిక క్షోభ ఆమెను బాల్యం నుండే వెంటాడేది. నా తండ్రి ఎవరని మార్లిన్ తల్లిని ప్రశ్నించేది. తల్లి ఒక ఫోటో చూపించి ఇతనే మీ నాన్న అని చెప్పేది. ప్రముఖ హాలీవుడ్ నటుడు క్లార్క్ గేబుల్ పోలికల్లో హుందాగా కనిపించేవాడు మార్లిన్‌కి. దాంతో ఆమె తన బాల్య స్నేహితురాళ్ళతో, ‘ద గ్రేట్ క్లార్క్ గేబుల్” మా నాన్న అని గర్వంగా చెప్పుకునేది. గమ్మత్తేమిటంటే మార్లిన్ మన్రో చివరి చిత్రం ‘మిస్‌ఫిట్స్’ లో కథానాయకుడు క్లార్క్ గేబులే!

బాల్యంలో తన దయనీయస్థితికి తల్లిదండ్రులే కారణమని ఆమె భావించేది. వాళ్ళపట్ల ద్వేషం పెంచుకుంది. తల్లిదండ్రులు బ్రతికుండగానే, “వాళ్ళు చనిపోయారు, నేను అనాథగా పెరిగాను” అని చెప్పేది.

మోడలింగ్‌లో అవకాశాలు వస్తున్న రోజుల్లో ఒక ఎంట్రీ ఫామ్‌లో తన వివరాలు రాస్తున్నప్పుడు తండ్రి పేరు ఏమిటనే కాలమ్ దగ్గర ‘నాకు తెలియదు’ అని రాసి అందరినీ ఆశ్చర్యపరిచింది మార్లిన్‌మన్రో.

## ఏడో యేటే శృంగార అనుభవం!

వయసొచ్చిన రోజుల్లో మోడలింగ్ చేసేది. సినిమా వేషాలు వస్తున్న తొలిరోజుల్లో ఒక కేలండర్‌కు నగ్నంగా ఫోజిచ్చి సంచలనం సృష్టించింది. లక్షలాదిమంది రసిక శిఖామణులు ఆ కేలండర్‌కోసం ఎగబడ్డారు. ఇలాంటి ఫోజు ఎందుకిచ్చారని ఒక విలేకరి ప్రశ్నిస్తే, “ఏం చేయను ఆకలి అవసరం అలాంటిది.. నేను కుదరదంటే, నా వెనుక క్యూలో ఎంతోమంది ఉన్నారు” అని సమాధానమిచ్చింది. పత్రికల్లో ఆమె సంచలన వ్యాఖ్యల్ని ఎంతో ఉత్సాహంగా చదువుకునేవారు. “మీకు తొలి శృంగార అనుభవం ఎప్పుడు ఎదురైంది?” అన్న ప్రశ్నకు “నా ఏడవ యేట” అని చెప్పి విలేకరిని షాక్‌కి గురిచేసింది. “అతడు నా కంటే చిన్నవాడు” అని చెప్పడంతో ఆ విలేకరి మరింత షాక్‌కు గురయ్యాడు!

డబ్బు, కీర్తిప్రతిష్టలకోసం సినిమా అవకాశాల కోసం ఫలానా వ్యక్తి దోహదపడతాడని తెలిస్తే మార్లిన్ వారితో చనువుగా వ్యవహరించేది. తొలి రోజుల్లో అలా వేషాలు సంపాదించడానికి జానీ హైడ్ ఆమెకు ఉపయోగపడ్డాడు. ఆ తర్వాత ట్వంటీయత్ సెంచరీఫాక్స్

సంస్థ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ జోసెఫ్ ఎమ్.షెంక్‌తో అనుబంధం పెంచుకుని పాపులర్ హీరోయిన్ హోదాకు చేరుకుంది.

ఆమె మొదటి చిత్రం 'సమ్మర్ లైట్నింగ్' (1948). రెండవ చిత్రం 'డేంజరస్ ఇయర్స్'. ఇవి అంతగా ప్రాధాన్యం లేని పాత్రలే. 'మంకీ బిజినెస్' 'నయాగరా', 'జెంటిల్‌మన్ ప్రెఫర్ బ్లాండీస్' వంటి చిత్రాలు ఆమెకు 'సెక్సీస్టార్ ఇమేజ్ తెచ్చిపెట్టాయి.

'బస్‌స్టాప్', 'ద ప్రిన్స్ అండ్ ద షో గర్ల్', 'సమ్‌లైక్ ఇట్ హాట్' వంటి చిత్రాలు ఆమెకు మరింత పేరు తెచ్చాయి. తన సెక్స్ అప్పీల్‌లో ఏదో మ్యాజిక్ ఉందనీ, అది జనాన్ని వెర్రివాళ్ళను చేస్తోందనీ గ్రహించిన మార్లిన్ ఎంతో గర్వంగా ఫీలయ్యేది.

సొంతంగా మార్లిన్ మన్రో ప్రొడక్షన్స్ స్థాపించింది. వార్నర్ బ్రదర్స్‌తో కలిసి ప్రసిద్ధ నటుడు లారెన్స్ ఒలివర్ దర్శకత్వంలో ఆయన సరసన 'ద ప్రిన్స్ అండ్ ద షో గర్ల్' (1957లో) కథానాయికగా ఓ చిత్రం నిర్మించింది కూడా! ఆమె నటించిన 'సెవెన్ ఇయర్ ఇచ్' చిత్రం ఎంతో ఘన విజయం సాధించింది. ఏడేళ్ళ దాంపత్యం తర్వాత భార్యమీద మోహం మొత్తి పరస్త్రీ వ్యామోహం ప్రారంభం కావడాన్ని ఈ చిత్రంలో తమాషాగా చూపించారు. దీన్నే 'సెవెన్ ఇయర్ ఇచ్' అంటారు. దీని ఆధారంగానే అక్కినేని, జమున, రాజసులోచనలతో 'పెళ్ళినాటి ప్రమాణాలు' తీశారు కె.వి.రెడ్డి.

## పెళ్ళిళ్ళూ పెటాకులూ

మార్లిన్ పదహారవయేట, 1942లో జూన్ 18వ తేదీన జిమ్ డఫర్టీ అనే నేవీ యువకుణ్ణి పెళ్ళాడింది.





తొలి వివాహం మూడున్నరేళ్ళకే ముగిసింది. 1954లో ప్రసిద్ధ బేస్‌బాల్ క్రీడాకారుడు జో డిగియోని పెళ్ళిచేసుకుంది. తర్వాత ప్రసిద్ధ రచయిత ఆర్థర్‌మిల్లర్ మూడవ భర్తగా ప్రవేశించాడు. చదువులేని మార్లిన్‌మన్రో ఈ పెళ్ళితో మేధావి హోదా పొందే ప్రయత్నం చేసిందనీ, సెక్సీతారను చేసుకుని మిల్లర్ కూడా తన అహం సంతృప్తిపరుచుకున్నాడనీ వ్యంగ్యంగా చెప్పుకునేవారు. వాళ్ళు నాలుగేళ్ళు కాపురం చేయడం నిజంగా రికార్డు! ఈ వివాహాల్లో ఆమెకు అనురాగ దాంపత్యమంటూ ఏదీలేదు.

ఆర్థర్ మిల్లర్ రాసిన 'ఆఫ్టర్ ద ఫాల్' నాటకంలో మాగీ పాత్ర మార్లినే అంటారు విమర్శకులు.

అనుకున్నది సాధించేందుకు ఎంతకైనా తెగించేది మార్లిన్. కోరి కష్టాలు తెచ్చుకునేది. ప్రసిద్ధ నటుడు మార్లన్ బ్రాండోను ఆమె అభిమానించింది. అతనితో 'గైస్ అండ్ డాల్స్'లో నటించేందుకు విఫల యత్నం చేసింది. చివరకు అతనితో సాంగత్యం ఏర్పరచుకునేవరకు ఆమె విశ్రమించలేదు. ఎప్పుడూ ఏదో ఒక వివాదం ఆమెను వెన్నంటి ఉండేది. ఆమె పొందుకోరేవాళ్ళ నేపథ్యం చూసినప్పుడు 'మార్లిన్ నిప్పుతో చెలగాటం ఆడుతోంది' అని చిత్ర పరిశ్రమలో అందరూ చర్చించుకునేవారు. జాన్ కెన్నడీ, రాబర్ట్ కెన్నడీలతో ఆమె సాన్నిహిత్యం విని కొందరు జాలిపడ్డారు!

ఎంత విచ్చలవిడిగా ప్రవర్తించినా, అనిర్వచనీయమైన భయం, అభద్రతాభావం ఆమెను వెంటాడేవని ఆమె సన్నిహితులనేవారు. ఎప్పుడూ అభద్రతాభావమే. నిర్ణయాలు తీసుకోవాలంటే కలవరపడేది. స్థిమితం లేకుండా ప్రవర్తించేది. జీవిత వాస్తవాలు చూసి భయపడేది. మానసికంగా ఆందోళనకు గురయ్యేది. అవన్నీ స్కిజోఫీనియా లక్షణాలే. ఆమెకు నిద్ర పట్టేది కాదు. డాక్టరు సలహాతో నిద్రమాత్రలకు అలవాటు పడింది.

"నేను మిథునరాశికి చెందినదాన్ని. అంటే లోపల ఒక ఆలోచన, పైన ఒక ఆలోచన! రెండూ క్లాష్ అవుతూ ఉంటాయి. డాక్టర్ జెకిల్ అండ్ హైడ్ టైపన్నమాట" అని నవ్వేసేది.

## చేజేతులా కెరీర్ నాశనం

అశాంతి, సంక్షోభాలు మార్లిన్ సినీ జీవితంపై ప్రభావం చూపించాయి. షూటింగ్స్‌లో డైలాగులు మరిచిపోయేది. కెమెరా ధ్యాస ఉండేది కాదు. ముఖ్యమైన సన్నివేశాల్లో యాభై లేదా అంతకంటే ఎక్కువ టేకులు తీసుకునేది. గంటలతరబడి సహనటులు ఆమెకోసం ఎదురుచూడాల్సి వచ్చేది. ఆల్కహాల్, ట్రాంక్విలైజర్ల వాడకం వల్ల బరువు పెరిగిపోయేది మార్లిన్. అయినా, జోషువా లోగన్ (బస్‌స్టాప్), బిల్లీవైల్డర్ (సమ్‌లైకిట్‌హాట్), జాన్ హ్యూస్టన్ (మిస్‌ఫిట్స్) వంటి ప్రసిద్ధుల చిత్రాల్లో నటించే అవకాశం ఆమెకు లభించింది.

పదిహేనేళ్ళ సినీ జీవితంలో ఆమె నటించిన చిత్రాలు ముప్ఫై దాటలేదు. ఆమె చివరి చిత్రం 'మిస్ ఫిట్స్' (1961). ఆ తర్వాత డీన్‌మార్టిన్‌కు జంటగా 'సమ్‌థింగ్ గాట్ టు గివ్' చిత్రాన్ని పూర్తిచేయలేకపోయింది. దాంతో కాంట్రాక్టు నిబంధనలు ఉల్లంఘించిందంటూ ట్వంటీయత్ సెంచరీ ఫాక్స్ వారు ఆమెపై దావా వేశారు. ఒక పక్క ఈ అశాంతి, మరోపక్క తెలియని ఒత్తిడులు ఆమెను కుంగదీశాయి. అది 1962 ఆగస్టు 5వ తేదీ. అనుమానాస్పదమైన పరిస్థితుల్లో మార్లిన్ మన్రో ఆత్మహత్య చేసుకుందన్న వార్త వెలువడిందారోజు. ఆమె పడకగదిలో నిద్రమాత్రల సీసా ఉందన్నారు. అయితే, 'ఆమె శరీరంపై గాయాల గుర్తులు కూడా ఉన్నాయి, అది హత్యే, ఆధారాలు లేకుండా చేసేశారు, దీని వెనుక పెద్ద కుట్ర జరిగింది' అని నేటికీ కొందరు వాదిస్తూ ఉంటారు.

'నేనే మార్లిన్ మన్రో వారసురాలిని' అంటుంది నాన్సీ మిరకిల్. "మా అమ్మ మార్లిన్ మన్రోది ఎప్పుడూ జాలీగా ఉండే తత్వం. పరిస్థితుల విషయవలయంలో నలిగిపోయింది. ఆమె ఎప్పుడూ స్వేచ్ఛను కోరుకునేది. నేడు ఫెమినిస్టులు వాదించే అంశాలను ఆ రోజుల్లోనే ఆమె మాట్లాడేది" అంటారు నాన్సీ. మార్లిన్ జీవితంపై నాన్సీ పరిశోధన చేసినప్పుడు కొన్ని నగ్న సత్యాలు తెలిశాయట. వాటిల్లో అమెరికా జాతీయ భద్రతాంశాలూ ఉన్నాయట. అవన్నీ ఒక పుస్తకంగా తెస్తానని నాన్సీ ప్రకటించారు. ఆ కొత్త విషయాలు వెలుగు చూస్తే, ఇంకా ఎన్ని సంచలనాలు కలుగుతాయో!

-బి.కె.ఈశ్వర్

# ఇవన్నీ నిజాలే!

## అదీ మన గొప్ప!

A బెర్లిన్ ఒలింపిక్స్ (1936)లో విజయం తర్వాత భారత హాకీ వీరుడు మేజర్ ధ్యాన్‌చంద్‌కు జర్మనీ పౌరసత్వంతో పాటు సైన్యంలో పెద్ద పదవి ఇస్తాననీ, జర్మనీ తరపున హాకీ ఆడమనీ హిట్లర్ ఆశ పెట్టాడు. కానీ ధ్యాన్‌చంద్ తిరస్కరించాడు.

•••

A 200 కోట్ల జనాభాలో కేవలం ఒక్కరు మాత్రమే 116 సంవత్సరాలు జీవించగలరు.

•••

A కోతులలో బానబోస్ అనే జాతి కోతులకి శృంగారంపై ఆసక్తి ఎక్కువ. ఈ కోతులు మనుషుల్లాగా లిప్‌లాక్ కిస్సులు పెట్టుకుంటాయి!

•••

A నీగ్రోలు-శ్వేతజాతీయుల మధ్య వివాహాలను దక్షిణాఫ్రికాలో 36 యేళ్ళపాటు (1939-1985) నిషేధిస్తే, అమెరికాలో 191 సంవత్సరాలపాటు (1776-1967) నిషేధించారు.

•••

A గడచిన 3,500 సంవత్సరాల కాలంలో కేవలం 230 సంవత్సరాలు మాత్రమే ప్రపంచ మానవ సమాజం యుద్ధాలులేకుండా శాంతియుతంగా జీవించిందని లెక్కకట్టారు.

•••

A ప్రపంచంలో జరిగిన పది భయంకర యుద్ధాలలో ఏడు యుద్ధాలు చైనాలోనే జరిగాయి. ఇందులోని రెండు యుద్ధాల్లో మొదటి ప్రపంచయుద్ధంలో కంటే ఎక్కువమంది మరణించారట!

•••

A నిర్దోషమైన, సంపూర్ణమైన రాజ్యాంగంగా ఆమెరికా రాజ్యాంగపత్రం గౌరవం పొందినప్పటికీ, అందులో ఎన్నో వ్యాకరణ, అక్షర దోషాలున్నాయట!

•••

A 1841లో అమెరికా అధ్యక్షునిగా పనిచేసిన జాన్ టైలర్ ఇద్దరు మనవలు ఇప్పటికీ బతికేఉన్నారు. ఆశ్చర్యపోకండి. అదెలాగంటే, 63వ యేట టైలర్‌కు కొడుకు పుట్టాడు. 71-75 యేళ్ళ వయసులో ఆ కొడుక్కి ఇద్దరు కొడుకులు పుట్టారు. వాళ్ళిప్పటికీ బతికే ఉన్నారు. అదీ సంగతి!

•••

A పిరమిడ్స్‌ను ఈజిప్టు బానిసలు నిర్మించారని అంతా అనుకుంటారు. అది అబద్ధం. కూలి డబ్బు తీసుకున్న కార్మికులే పిరమిడ్స్ నిర్మించారు!

•••

A లిఖిత మానవ చరిత్ర ఆరువేల సంవత్సరాల నుండి మాత్రమే మనకు లభిస్తోంది. రెండు లక్షల సంవత్సరాల క్రితమే మానవ మనుగడ ఆరంభమైంది. అంటే మనం 97 శాతం మానవ చరిత్రను కోల్పోయామన్నమాట!

-చిన్నారి

# సుధామ పదగారడి-273

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | h | 3 | h | 4 | | 5 |
| | h | | h | | h | | h | |
| | h | h | 6 | | | 8 h | h | |
| h | h | 7 | h | h | h | 8 | h | h |
| 9 | 11 | | | h | 10 | | | h |
| h | h | 15 | h | h | h | h | h | h |
| 11 | | h | 12 | 13 | | 19 h | hh | 14 |
| h | h | 15 | h | | h | 16 | hh | |
| 17 | | | h | | h | 18 | | |

### ఆధారాలు

**అడ్డం**

1. ఆత్రేయకు ఈ కవి అని గుర్తింపు (3)
4. ఓ రాగం ముందు ఆరవేయండి (3)
6. ప్రకాశం జిల్లాలోని ప్రసిద్ధ పట్టణం. క్షీరపురిట! (3)
9. గాంధీగారి అహింసాయుధం ఇది (4)
10. గుడ్‌నైట్ (4)
11. తిత్తి. పసిపిల్లలు నోట పెట్టుకునేది (2)
12. అందరూ కొత్త నటీనటులతో తేనెమనసులు తీసిన దర్శకుడు (3)
17. మేనా (3)
18. కనిష్ఠం కాదు మాగ్జిమమ్ (3)

**నిలువు**

1. గాంధీని తొలుత ఇలా సంబోధించింది రవీంద్రుడేనట! (3)
2. జలావర్తము (2)
3. అండ (3)
4. ఒట్టు (2)
5. బోయవాడు (3)
7. ప్రముఖుల స్మారకార్థం నెలకొల్పేది. నిగ్రహం కోల్పోతే కూలగొట్టేది (3)
8. మొదటి రాత్రి (3)
11. కిందనుంచి పడగ (3)
13. కప్పుకుని పడుకునేది (3)
14. చేటు, దరిద్రం (3)
15. నెమలి (2)
16. కాలు చాచిపెట్టిన అడుగు (2)

### పదగారడి-272 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ప | స | 2ర | ట్టు | ■ | 3డ | 4పొ | హా | 5రం |
| ను | ■ | తి | ■ | 6బో | ■ | త | ■ | ధి |
| 7గా | బ | రా | ■ | 8నా | సి | ర | 9కం | ■ |
| లి | ■ | 10జా | 11వ్వ | లు | ■ | ■ | 12తు | త్రి |
| ■ | 13గ | ■ | ము | ■ | 14కా | ■ | డు | ■ |
| 15చే | లు | ■ | ■ | 16తి | మి | 17రం | ■ | 18పొ |
| ■ | 19సు | 20మ | బా | ల | ■ | 21గా | ఢ | ద |
| 22అ | ■ | హా | ■ | క | ■ | జ | ■ | రి |
| 23తే | రా | మ | ము | ■ | 24టొ | మ్మ | ది | ళ్లు |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

# సరైనోడు దొరకలేదు

## -ఆలియాభట్



**నటీనటుల నుంచి మంచి అవుట్‌పుట్‌ను రాబట్టుకునే బాధ్యత దర్శకుడిదే! సరైన దర్శకుడు దొరికితే హీరో హీరోయిన్లలో దాగి ఉన్న నట విశ్వరూపం బయటకి వస్తుంది. సరిగ్గా ఆలియా భట్ విషయంలో ఇదే జరిగింది. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ ఉండే ఆలియాలో సీరియస్ నటి దాగి ఉందంటే ఎవరూ నమ్మరు. కానీ 'ఉడ్తాపంజాబ్' చూసిన వారికి మాత్రం ఆలియా విశ్వరూపం తెర మీద కనిపించింది. సరైనోడు దొరికితే తనలోని నటి ఎలా ప్రతిస్పందిస్తుందో ఆలియా ఈ సినిమా ద్వారా చేసి చూపించింది. ఇప్పటికైనా సరైన దర్శకుడు దొరికితే మరోసారి తన సత్తా ఏమిటో చూపిస్తానంటున్న ఆలియాతో....**

**గ్లామర్ హీరోయిన్ అయి ఉండి డీ గ్లామర్ రోల్ ఎలా చేయగలిగారు?**

నటనలో టాలెంట్ తెలియాలంటే డీ గ్లామర్ రోల్స్ బాగా ఉపయోగపడతాయి. 'ఉడ్తాపంజాబ్'లో నా క్యారెక్టర్ అలాంటిదే! ఇప్పటి వరకూ అల్లరి అమ్మాయిగా, గ్లామర్‌డాల్‌గా మాత్రమే ప్రేక్షకులకు తెలుసు. నాలోని నటిని వెలికి తీసింది ఈ సినిమా! ఇలాంటి అవకాశాలు ఎప్పుడో తప్ప రావు.

**ఈ సినిమాకు బాగానే కష్టపడినట్టున్నారు?**

ప్రతి సినిమానూ కష్టపడే చేస్తాం. కాకపోతే కొన్ని సినిమాల్లో మా కష్టం తెర మీద కనపడుతుంది. ఈ సినిమాలో నా కష్టం అలా కనిపించింది. నేను డైరెక్టర్స్ నటిని. వాళ్ళు ఎలా చెబితే అలా చేస్తాను. కాకపోతే ఇంత వరకూ సరైనోడు.. ఐమీన్ సరైన డైరెక్టర్ నాకు దొరకలేదు అనిపిస్తోంది.

**తరచూ ఇలాంటి సినిమాలు చేస్తారా?**

అన్నీ ఇలాంటి సినిమాలే అంటే చేస్తున్న నాకూ, చూస్తున్న ప్రేక్షకులకూ బోరే! ఏడాదికో, రెండేళ్ళకో ఇలాంటి సినిమాలు చేస్తే ప్రేక్షకులు ఆదరిస్తారు. ఏడాదికి ఒకటన్నా సీరియస్ సినిమాలు చేయాలని అనుకుంటున్నాను.

**ఈ సినిమాతో బాలీవుడ్‌లో టాప్ రేస్‌కి చేరినట్టేనా?**

ప్రేక్షకుల అంచనాలు అందుకోవడమే నా దృష్టిలో టాప్ రేస్‌కి చేరడం. నెంబర్ గేమ్‌ల మీదా, టాప్ రేస్‌ల మీదా నాకు నమ్మకం లేదు. ప్రేక్షకులు నా సినిమాను మెచ్చుకుంటే చాలు. ఇప్పటి వరకూ వారి అభిమానాన్ని పొందుతూనే ఉన్నాను. ఇక ముందు కూడా పొందుతాను.

**బయోపిక్‌లో నటించే అవకాశం ఉందా?**

అలాంటి అవకాశం ఇప్పటి వరకూ రాలేదు. పాకిస్థానీ గాయని నజియా హసన్ జీవత గాథ అంటే ఇష్టం. ఆవిడ బయోపిక్‌లో నటించే అవకాశం వస్తే తప్పకుండా చేస్తాను.

**ఇటీవలి కాలంలో అందరికీ దూరం దూరంగా ఉంటున్నారట ఎందుకు?**

యాక్టింగ్ అంటేనే లోన్లీ జాబ్. మిగతా ఉద్యోగాలకీ, నటన అనే ఈ జాబ్‌కీ చాలా తేడా ఉంది. మిగతా ఉద్యోగాల్లో సెలవురోజున అందరినీ కలిసే అవకాశం ఉంటుంది. మాకు అలాంటి అవకాశాలు ఉండవు. అసలు కొన్ని సార్లు సెలవు అనేది లేకుండా నెలల తరబడి పనిచేయాల్సి ఉంటుంది. ఈ కారణంగానే చాలా మందిని తరచూ కలవలేకపోతున్నాను తప్ప నేను ఎవరికీ దూరం కాలేదు. ఎవరినీ దూరం చేసుకోలేదు.

**ఎలాంటి సినిమాలు చేయాలని అనుకుంటున్నారు?**

ఒకే చట్రంలో ఉండిపోవడం నాకు ఇష్టం ఉండదు. గ్లామర్‌తో పాటు మాస్ మసాలా సినిమాలు చేయాలని ఉంది. అంతేకాకుండా పూర్తిస్థాయి కామెడీ సినిమా చేయాలన్నది నా కోరిక. ఇప్పటి వరకూ పూర్తిస్థాయి కామెడీ చేయలేదు. నేను ఏ సినిమా ఒప్పుకున్నా పూర్తి అవగాహనతోనే చేస్తాను. కథ మార్చారనో, లేకపోతే సగం సినిమా తరువాత కథ నచ్చలేదనో సినిమా మధ్యలో వెళ్ళడం నాకు నచ్చదు. కథ మీద అనుమానం ఉంటే ఒకటి రెండు సార్లు అడిగి చెప్పించుకుని వింటాను.

కె.రామకృష్ణ



